ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

సంపుటి 2 | సంచిక 1 అక్టోబర్-డిసెంబర్, 2021

మమత-సమత-మానవత
www.gurajada.org




## భాష, సాహిత్య వైభవ తోరణం

ISSN 2766-0168
అంతర్జాల త్రైమాస పత్రిక
వ్యవస్థాపక సంపాదకులు
కీ.శే. గురజాడ వేంకట అప్పారావు
www.prakasika.org

# ప్రకాశిక

మమత-సమత-మానవత
www.gurajada.org










## మనవి

ప్రక్కన చూపిన ప్రకటన 1940 లో భారతి పత్రికలో పత్రిక యాజమాన్యం ఇచ్చిన ప్రకటన. 2021 లో, ప్రకాశిక పత్రిక కూడా ఈ ప్రకటనలో ఆశించిన స్వభావం గల రచనలను ఆహ్వానిస్తోంది. కాలం మారింది, సమస్యల స్వరూపం మారింది. కానీ, సమాజ శ్రేయస్సుకి ఉపయోగపడే సాహిత్య అవసరం మాత్రం ఇంకా ఉంది. చాలా ఉంది. మీలో ఉన్న గురజాడ తత్వాన్ని, చైతన్యాన్ని తట్టి లేపండి. మంచి రచనలు మాకు పంపండి.



సంపుటము. ౧౭ ప్రమాది, చైత్రమాసము (ఏప్రిల్ 1940) సంఖ్య: ౪

వ్యాసవిలేఖకులకు మనవి

వ్యాసాలు ఎనిమిదిపుటలకు మించకుండా ఉండాలి. కాగితానికి ఒకవైపే వ్రాయాలి. శాస్త్రీయవిషయాలనుగురించిన వ్యాసాలుకూడా ఎక్కువ పరిభాషా, ఎక్కువ వివరాలూ లేకుండా సంగ్రహంగాను, సామాన్యపాఠకునికి విషయం బోధపడేటట్టు సులభంగాను, మనస్సును కథలా ఆకట్టేటట్టు ఆకర్షకంగాను ఉండాలి. శాసనవ్యాసాలు పదిహేనిండు పుటలకు మించేయెడల రెండు సంచికలలో ప్రకటింపవలసివచ్చును. "బాలానందము"నకు ఉచితమైన కథలు, పాటలు, సాధ్యమైనంతవరకు పిల్లలభాషలో రచించి పంపించవలసినదని కవులకు మనవి. విమర్శలకు గ్రంథములు పంపువారు రెండుప్రతులు పంపవలెను.

దేశాన్ని ఎక్కువగా కలవరపరుస్తున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయాలనుగురించీ, మనఆంధ్రుల ప్రత్యేకసమస్యలనుగురించీ ప్రత్యేకవ్యాసాలు కావాలి. సాధ్యమయినంతవరకు ఎత్తుకునే విషయంలోను, చూచే దృష్టిలోను, రచించే రచనలోను క్రొత్తదనం కావాలి. మన ఉద్యమాలు, మనదేశం, మనసంఘం, మనఆశయాలు భారతిలో ప్రతిఫలించేటట్టు చూడవలసినదని వ్యాసకర్తలకు మనవి.—భా. సం.

Connect with us On Facebook : https://www.facebook.com/Prakasika1
Join us Via Telegram Prakasika telegram link : https://t.me/joinchat/SlYqileFRFSJ_zi_
Contact us: editor@prakasika.org

# ప్రకాశిక సంపాదక వర్గం



## ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ

ప్రధాన సంపాదకులు

పుట్టినది పశ్చిమగోదావరి జిల్లాలోని ఇరగవరం అగ్రహారం. పెరిగినది చాలా వరకు తణుకులో. తాడేపల్లిగూడెం కళాశాల నుంచి డిగ్రీ, ఉమ్మడి రాష్ట్ర రాజధాని భాగ్యనగరంలోని కేంద్రీయ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఎస్.సి., దేశ రాజధానిలోని ఢిల్లీ విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్., పి.హెచ్.డి. చేశారు. గత 27 సంవత్సరాలుగా అమెరికాలో నివాసం. చాలా సంవత్సరాలు వైద్య విశ్వవిద్యాలయాలలో ఆచార్యులుగా కేన్సర్ వ్యాధికి సంబంధించిన అంశాలపై పరిశోధనలు జరిపారు. ప్రస్తుతం అంతర్జాతీయ ఫార్మస్యూటికల్ కంపెనీలో కేన్సర్ మందులు రూపొందించే శాస్త్రవేత్తగాను, హ్యూస్టన్ లోని టెక్సాస్ విశ్వవిద్యాలయంలోని వైద్యశాస్త్ర విభాగంలో అనుబంధ ఆచార్యులుగానూ పనిచేస్తున్నారు. అంతర్జాతీయ కేన్సర్ పరిశోధనలకి సంబంధించిన అంతర్జాతీయ పత్రికకి ప్రధాన సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. మాటల మాలలల్లడం ప్రవృత్తి. అడపాదడపా రాసిన కవితలు, కథలు, వ్యాసాలు ఒకచోట కూర్చి "మనస్వినీయం" అన్న పేరుతో ఇటీవల ఒక పుస్తకం ప్రచురించారు.



## మా శర్మ

గౌరవ సంపాదకులు

మా శర్మగా సుపరిచితులైన మాచవరం వేంకట చెంచురామ మారుతి సుబ్బరాయశర్మ 1967 సంవత్సరం నవంబర్ 29వ తేదీన గుంటూరు జిల్లా, నరసరావుపేటలో జన్మించారు. పాత్రికేయులు, కాలమిస్ట్‌గా ప్రసిద్ధులు. తెలుగువారికి సొంతమైన అవధాన ప్రక్రియ, ఆశుకవిత్వంలో అగ్రగణ్యులు, ఆరాధ్యులైన కొప్పరపు కవులు మా శర్మగారికి మాతామహులు. ఆ మహాకవుల పేరిట శ్రీ కొప్పరపు కవుల కళాపీఠాన్ని 2002లో స్థాపించారు. వారి విగ్రహాలను విశాఖపట్నం సాగరతీరంలో, నరసరావుపేటలో స్థాపించారు. కొప్పరపువారి సాహిత్యాన్ని సేకరించి దొరికినంత వరకూ గ్రంథస్థం చేశారు. ప్రతియేటా శ్రీ కొప్పరపు కవుల ప్రతిభా పురస్కారాలు ప్రదానం చేస్తున్నారు. ప్రముఖులు పీసపాటి నరసింహమూర్తి, వేటూరి సుందరరామ్మూర్తి, మల్లాది చంద్రశేఖరశాస్త్రి, మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం, నేదునూరి కృష్ణమూర్తి, కె.విశ్వనాథ్, బేతవోలు రామబ్రహ్మం, మేడసాని మోహన్, గరికిపాటి నరసింహారావు, మాడుగుల నాగఫణిశర్మ, పి.సుశీల, సిరివెన్నెల సీతారామశాస్త్రి మొదలు

ఎందరో తెలుగు, జాతీయ కవులు, కళాకారులు ఆ పురస్కారం అందుకున్న వారిలో ఉన్నారు. ప్రస్తుతం ఆంధ్రపత్రిక దినపత్రికకు కన్ సల్టింగ్ ఎడిటర్ గా పాత్రికేయ సేవలు అందిస్తున్నారు. ఎన్నో ఏళ్ల నుండి మీడియాలో ఉన్నారు.



## శ్రీమతి గురజాడ అరుణ

నిర్వాహక సంపాదకులు

గురజాడ వేంకట అప్పారావుగారి ముని మనుమరాలు శ్రీమతి గురజాడ అరుణ. ముంబైలో పుట్టి పెరిగిన వీరు IT రంగంలో ప్రాజెక్ట్ మేనేజర్ గా పనిచేస్తున్నారు. ముత్తాతగారి అకాల మరణంతో అసంపూర్ణంగా మిగిలిపోయిన వారి సాహితీ సేవలు, సంఘ సంస్కరణ కార్యక్రమాలను ముందుకు తీసుకెళ్ళే క్రమంలో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపించారు. గురజాడ వారి పేరిట ఎన్నో సేవా కార్యక్రమాలు చేస్తూ ముత్తాతగారి స్మృతిని చిరస్థాయిగా ఉంచుతున్నారు.



## శ్రీ గురజాడ రవీంద్రుడు

సంపాదక సలహాదారు

గురజాడ వేంకట అప్పారావుగారి మునిమనుమడు శ్రీ గురజాడ రవీంద్రుడు. 2014లో గురజాడ ఫౌండేషన్ (అమెరికా) స్థాపనలో ముఖ్య భూమిక పోషించారు. ఫౌండేషన్ లక్ష్యాలను, ఆశయాలను ముందుకు తీసుకెళ్ళడంలో చురుకైన పాత్ర పోషిస్తూ ముత్తాతగారి అడుగుజాడల్లో పయనిస్తున్నారు. గురజాడ ఫౌండేషన్ (అమెరికా) ఇండియన్ చాప్టర్ కు ప్రెసిడెంట్ గా వ్యవహరిస్తున్నారు.



## శ్రీ విహారి

సంపాదక సలహాదారు

విహారి అనే కలం పేరుతో సుప్రతిష్ఠులైన శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 1941లో తెనాలిలో జన్మించారు. వీరు 12 కథాసంపుటాలు, 15 విమర్శనాత్మకమైన వ్యాస సంపుటాలు, ఒక వ్యాస కదంబం, 7 నవలలు, 5 కవితా సంపుటాలు, ఒక దీర్ఘ కథాకావ్యం- పుస్తకాల రూపంలో వెలువరించారు. అన్ని ప్రసిద్ధ తెలుగుపత్రికలలోనూ 300కి పైగా వీరి రచనలు ప్రచురితమయ్యాయి. వివిధ పత్రికల్లో పరిచయాలూ-పరామర్శలు, బతుకు గీతలు, కథావిహారం వంటి శీర్షికలనూ నిర్వహించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కా రం, అజో విభో కందాళం ఫౌండేషన్ (AVKF) వారి జీవన

సాఫల్య పురస్కా రం, ఆం.ప్ర భాషా దినోత్సవ పురస్కా రం, తె.వి.వి.కీర్తి పురస్కా రం లాంటి ఎన్నో ప్రతిష్ఠాత్మకమైన పురస్కా రాలు అందుకున్నారు. ఎల్.ఐ.సి.లో జనరల్ మేనేజర్ గా పదవీ విరమణ చేసి, హైదరాబాద్ లో నివాసం ఉంటున్నారు.



## ఆచార్య వెలమల సిమ్మన్న

సంపాదక సలహాదారు

బహుముఖ ప్రజ్ఞాశాలిగా వాసికెక్కిన ఆచార్య వెలమల సిమ్మన్నగారు 1955 సంవత్సరం మార్చి 1వ తేదీన శ్రీకాకుళం జిల్లా, జలుమూరు మండలం, తిమడాం గ్రామంలో జన్మిం చారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్, స్కూల్ఆ ఫ్ డిస్టెన్స్ ఎడ్యుకే షన్ లో తెలుగుశాఖలో అధ్యాపక ధర్మం నిర్వర్తిం చారు. భాష, సాహిత్యం, వ్యాకరణం, భాషా శాస్త్రం, విమర్శ, పరిశోధన మొదలైన రంగాలకు సంబంధించి 83 గ్రంథాల్ని రాశారు. 440కి పైగా పరిశోధన పత్రాలు ప్రముఖ పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 160కి పైగా వివిధ సెమినార్లలో హాజరై పరిశోధన పత్రాల్ని సమర్పించారు. 50కి పైగా రేడియో ప్రసంగాలు చేశారు.



## ఆచార్య గుమ్మా సాంబశివరావు

సంపాదక సలహాదారు

తెలుగు సాహిత్యంలో ప్రముఖ విమర్శకులుగా, పుస్తక సమీక్షకులుగా, అన్నింటికీ మించి మంచి అధ్యాపకునిగా పేరొందిన గురువర్యులు ఆచార్య గుమ్మా సాంబశివరావుగారు. స్వగ్రామం గుంటూరు జిల్లాలోని వేజెండ్ల. 2018లో ఆంధ్ర లయోలా కళాశాలలో తెలుగు శాఖాగ్రణిగా పదవీ విరమణ చేశారు. మహాకవి గురజాడ 150వ జయంతి కానుకగా 2011 డిసెంబరులో కన్యాశుల్కంలో హాస్యం పేరుతో ఓ గ్రంథాన్ని ముద్రించారు. 2012 డిసెంబరు 27,28,29 తేదీల్లో తిరుపతి నగరంలో నాలుగో ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకుని తెలుగు అకాడమీ వారు ఆచార్య గుమ్మా సాంబశివరావు రచించిన తెలుగువాఙ్మయ చరిత్ర-రచయితలు అనే గ్రంథాన్ని ముద్రించారు. నూటముప్పైకి పైగా వివిధ పత్రికల్లో వ్యాసాలు, 150 కి పైగా పుస్తక సమీక్షలు, 60 కి పైగా ఆకాశవాణిలో ప్రసంగాలు అనేక జాతీయ అంతర్జాతీయ వేదికల మీద వివిధ అంశాల మీద ప్రసంగాలు, సాంబశివరావుగారి విస్తృత ప్రతిభకి తార్కాణం. సాంబశివరావు గారు అనేక జాతీయ, అంతర్జాతీయ సన్మానాలు, సత్కారాలు పొందారు. ఏ అంశంపైనైనా అనర్గళంగా ప్రసంగించే వీరి సామర్థ్యాన్ని గుర్తించి అనేక సాహిత్య పీఠాలవారు 'ప్రసంగప్రజ్ఞా నిధి', 'ఉపన్యాసకేసరి' వంటి బిరుదులతో సత్కరించారు.



## డా.సి. భవానీదేవి

సంపాదక సలహాదారు రచయిత్రి, విమర్శకురాలు

ఆంధ్రప్రదేశ్ సచివాలయం నుంచి ప్రభుత్వ ఉప కార్యదర్శిగా పదవీ విరమణ చేశారు. 15 కవితా సంపుటులు, వివిధ ప్రక్రియల్లో 51 గ్రంథాలు వెలువరించారు. వీరి పలు కవితలు, కథలు ఇతర భాషల్లోకి అనువదించబడ్డాయి. డాక్టర్ సి. భవానీదేవి పలు అవార్డులు, ప్రశంసలు అందుకున్నారు. ఆకాశవాణి, ప్రసారభారతి జాతీయ స్థాయిలో ప్రతి ఏటా ప్రతిష్టాత్మకంగా నిర్వహించి ప్రసారం చేసే జాతీయ కవి సమ్మేళనంలో భాగంగా 2019 సంవత్సరానికి తెలుగు కవయిత్రిగా ఎంపికయ్యారు.



## డా. రేవూరి అనంత పద్మనాభరావు

సంపాదక సలహాదారు

పద్మనాభరావు వందకుపైగా అష్టావధానాలు చేశారు. 120 గ్రంథాలు ప్రచురించారు. అందులో నాలుగు కథా సంపుటాలు, నాలుగు నవలలు, 12 అనువాదాలు, 11 జీవితచరిత్రలు, 12 సివిల్స్ పరీక్షల గ్రంథాలు, పరిష్కరణలు, వ్యాఖ్యలు, పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. వీరి రచనలపై నాలుగు విశ్వవిద్యాలయాల నుండి ఆరుగురు పరిశోధక విద్యార్థులు ఎం.ఫిల్. / పి.హెచ్.డి. డిగ్రీలు సంపాదించారు. పద్మనాభరావుకు 1993లో తెలుగు విశ్వవిద్యాలయ అనువాద పురస్కా రము, 2000లో కేంద్ర సాహిత్య అకాడమీ అనువాద పురస్కా రం లభించాయి. ఢిల్లీ తెలుగు అకాడమీ, మదరాసు తెలుగు అకాడమీ సనాతన ధర్మచారిటబుల్ ట్రస్టు తదితర అవార్డులు పొందారు. కందుకూరి రుద్రకవి రచనలపై పి.హెచ్.డి. చేశారు. 1967లో కందుకూరు ప్రభుత్వ కళాశాల అధ్యాపకులుగా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1975 నుండి 2005 వరకు ఆకాశవాణి, దూరదర్శన్ లో పదవీ బాధ్యతలు మూడు దశాబ్దాలు నిర్వహించి, ఢిల్లీ అదనపు డైరెక్టర్ జనరల్ గా పదవీ విరమణ చేశారు. 2005 - 10 మధ్య తిరుమల తిరుపతి దేవస్థానంలో పనిచేసి శ్రీ వేంకటేశ్వర భక్తి ఛానల్ కు అంకురార్పణ దశలో కృషి చేశారు. కంచికామకోటి పీఠాధిపతి వీరిని ఆస్థాన విద్వాంసులుగా సత్కరించారు. అమెరికా, యు.కె, జర్మనీ దేశాలలో పర్యటించి ఉపన్యసించారు. 1200 వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురించారు. 74 సంవత్సరాల పద్మనాభరావు హైదరాబాదులో స్థిరపడ్డారు.



## డా. నాగసూరి వేణుగోపాల్

సంపాదక సలహాదారు

దేశవ్యాప్తంగా తొమ్మిది ఆకాశవాణి కేంద్రాలలో సుమారు ముప్పైయి మూడు సంవత్సరాలుగా పనిచేస్తూ మరోవైపు రచయితగా, కాలమిస్టుగా, సంపాదకునిగా డా. నాగసూరి వేణుగోపాల్ ఇంతవరకు 60 పైగా పుస్తకాలు వెలువరించారు. అనంతపురం జిల్లా కొనతట్టు పల్లిలో 1961లో జన్మించిన నాగసూరి ఎస్వీయూ నుంచి ఫిజిక్స్‌లో ఎం.ఎస్సీ., ఎం.ఫిల్., తర్వాత ఆంధ్ర విశ్వవిద్యాలయంలో జర్నలిజంలో పి.హెచ్.డి. గడించారు. పరిశీలన, పరిశోధన, ప్రణాళికతో ఆకాశవాణి కార్యక్రమాలు నిర్వహించిన నాగసూరి రేడియో పరిచయ కార్యక్రమ నిర్వహణలో పేరుపొందడమే కాక 'ఆదివాసీ అంతరం', 'శతవసంత సాహితీ మంజీరాలు', 'వెలుగుజాడ', 'అన్నమయ్య పదగోపురం', 'జీవనబింబం', 'చిత్తూరు జిల్లా జీవన చిత్రం' వంటి విలువైన కృషి ద్వారా చిరకాలం నిలబడే ముద్ర వేశారు. విజ్ఞానశాస్త్రం, సాహిత్యం, పత్రికారంగం, ప్రసారమాధ్యమాలు, చరిత్ర, భాష వంటి విషయాలపై పరిశోధనాత్మక గ్రంథాలు వెలువరించారు. గురజాడ, తాపీ, పొట్టి శ్రీరాములు, నార్ల, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, జి.వి.కృష్ణారావు, విద్వాన్ విశ్వం వంటి వారి పరిశోధనాత్మక పుస్తకాలు వెలువరించిన నాగసూరి 'సాహితీ వీక్షణం', 'సాహితీ స్పర్శ' వంటి విమర్శనా గ్రంథాలు కూడా రచించారు. 20వ శతాబ్దం ముగుస్తున్న వేళ విజయవాడ ఆకాశవాణి ద్వారా మూడేళ్ళ పాటు పరిచయం చేసిన శతాబ్దపు వంద ఉత్తమ తెలుగు గ్రంథాల గురించి వెలువరించిన 'శతవసంత సాహితీ మంజీరాలు' అత్యంత విలువైన సంకలనం. ఇంకా సాహిత్య అకాడమీకి 'సైన్స్ ఫిక్షన్' 'వైజ్ఞానిక కథలు', అలాగే 'కథావరణం', 'మదరాసుబదుకులు' కథా సంకలనాలను మిత్రులతో కలిసి వెలువరించారు. 'స్థానిక మూలాలు', 'విస్మృత ప్రముఖులు', 'జానపదకళలు', 'హెచ్.ఐ.వి./ఎయిడ్స్', 'ఆదివాసుల జీవితం', 'ఇతర ప్రాంతాల తెలుగువారు', 'అన్నమయ్య' వంటి అంశాలపై దృష్టి నిలిపి కృషి చేసిన వేణుగోపాల్ ప్రస్తుతం తెలుగువారు విస్మరించిన గాంధీ తత్వంలోని ప్రయోజనకరమైన కోణాలను వివరించడానికి తన బృందంతో కలిసి శ్రమిస్తున్నారు. వీరి ప్రస్తుత నివాసం హైదరాబాదు.



## ఆచార్య ఉషాదేవి

విశ్రాంత ఆచార్యులు, పూర్వ పీఠాధిపతి,భాషాభివృద్ధి పీఠం
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం

అతిథి సంపాదకురాలు






# బాల్యం-భాష-భవిష్యత్తు

బిడ్డ గర్భంలో ఉన్నప్పటినుంచి, బిడ్డతో అమ్మ మాట్లాడే భాష అమ్మ భాషే; అరువు భాష కాదు. బాల్యంలో బిడ్డ అభివృద్ధికి అమ్మ, బిడ్డతో అమ్మ మాట్లాడే మాటలే మూలం. అమ్మ, నాన్న, తాతలు, అమ్మమ్మ, బామ్మ, అత్త, మామ లాంటి దగ్గర వ్యక్తులు మాట్లాడే మాటలు విని బిడ్డ అదే భాషలో ఆలోచించడానికి అలవాటుపడుతుంది. ఏ ప్రాంతానికి సంబంధించిన పిల్లలకైనా, ఏ ఆర్థిక, సామాజిక వర్గానికి సంబంధించిన పిల్లలకైనా ఇది వర్తిస్తుంది.

బడిలో ఏ భాష ద్వారా బోధించాలి అన్న చర్చ ఈ మధ్య ఆంధ్రరాష్ట్రంలో విస్తృతంగా జరుగుతోంది. కొన్ని దశాబ్దాల క్రితం ఇలాగే కాలేజీ లలో తెలుగు మాధ్యమం ఉండాలా ఆంగ్ల మాధ్యమం ఉండాలా అన్న చర్చ జరిగేది. ఆంగ్ల మాధ్యమంలో చదివినవారు మేధావులవుతారని, వాళ్ళు ఉన్నత పదవులు పొందుతారని ఆంగ్ల మాధ్యమ వాదులు వాదించే వారు. నాబోటి వాళ్ళు ఎంతోమంది వేరే దారి లేక ఉన్న ఊళ్ళో ఉన్న కాలేజీ లో చదివారు; అయినా వెనకబడలేదు.

పూర్తిగా ఇంటి వాతావరణం నుంచి బయటకి వచ్చి, కొంచెం బడి, కొంచెం ఇల్లు వాతావరణానికి అలవాటుపడే పిల్లలు ఇంట్లో వాడే భాషలోనే ఆలోచిస్తారు. ఒకటవ తరగతి

నుంచి 8 వ తరగతి వరకు ఆంగ్లంలో బోధించే విధానం తీసుకురావడం అంటే పిల్లలని గందరగోళం లో పడేయడమే. బోధన మాధ్యమం, పాఠ్యాంశం వేరే విషయాలయినా ఆ రెండిటినీ కలగలపి ఆంగ్ల మాధ్యమవాదులు కొంత గజిబిజి వాదనలు చేస్తున్నారనిపిస్తోంది. పూర్వంలాగే పదవ తరగతి వరకు తెలుగు మాధ్యమాన్ని కొనసాగిస్తూ, ఆంగ్ల భాషని ఒకటి రెండు పాఠ్యాంశాలుగా బోధించి ఆ భాషతో కొంత పరిచయాన్ని పెంచి, ఉన్నత విద్యని ఆంగ్ల మాధ్యమంలో కొనసాగించడానికి విద్యార్థులను సన్నద్ధం చేయడం సబబుగా ఉంటుంది.

ఆంగ్ల మాధ్యమాన్ని ఒక సామాజిక విభజన రేఖగా చిత్రించడంలో ఔచిత్యం లేదు. ఇంతకాలం మనం తెలుగులోనే నేర్పుతున్నా తెలుగులో భావవ్యక్తీకరణ ఎందుకు మెరుగుగా లేదు అని ఆంగ్ల మాధ్యమవాదులు కొందరు వాదించవచ్చు. ఇంగ్లండులో పెరిగినా, అమెరికాలో చదివినా పట్టుమని పది వాక్యాలు ఆంగ్లంలో రాయలేని, మాట్లాడలేని వాళ్ళు కోకొల్లలు. అంతెందుకు, అమెరికాలో పుట్టి పెరిగిన చాలా మంది అమెరికన్ లు కూడా ఆంగ్లంలో సరిగా మాట్లాడలేరు, రాయలేరు. పోల్చుకోవాలంటే, గ్రామాలలో పుట్టి పెరిగినా, ప్రతిభావంతులుగా ఎదిగి తెలుగు, ఆంగ్ల భాషలలో అనర్గళంగా మాట్లాడగల భారత ఉప రాష్ట్రపతి శ్రీ వెంకయ్య నాయుడు గారు, భారత ఉన్నత న్యాయస్థాన ప్రధాన న్యాయమూర్తి శ్రీ రమణ గార్ల తో పోల్చుకుని వాళ్ళకి తెలుగు భాష మీద ఉన్న మక్కువతో పోటీ పడాలి.

పిల్లలు పెరిగేటపుడు, వాళ్ళు పెరిగే సమాజానికి సంబంధించిన విషయాలు, చరిత్ర తప్పక తెలుసుకోవాలి. తెలుగు భాషకి, తెలుగు సంస్కృతికి మాత్రమే ప్రత్యేకమైన ఎన్నో అంశాల గురించి పిల్లలకి పాఠ్యాంశంగా చెప్పవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఆ పని తెలుగు మాధ్యమంలోనే సాధ్యం. పైపెచ్చు, అరకొర ఆంగ్లం తెలిసిన అధ్యాపకులు ఆంగ్ల మాధ్యమంలో చెబితే తయారయ్యే పిల్లలని ఊహించగలమా? అసంఖ్యాక గిరీశాలను తయారు చేయడానికి ఇది సులువు మార్గం. ఎక్కువ శాతం ప్రజలు గ్రామాలలో నివసించే భారతదేశంలో స్థానిక భాషలోనే బోధన జరగాలన్నది భారత రాజ్యాంగంలో దూరదృష్టితో పొందుపరచిన అంశం. ఆ స్ఫూర్తితోనే తెలుగు అధికార భాషా సంఘం తెలుగుని పరిపాలనా భాషగా రూపొందించే ప్రయత్నంతో పాటు పాఠశాలలో తెలుగు మాధ్యమ పరిరక్షణకి కూడా పాటుపడాలి, ఒత్తిళ్లకి తట్టుకుని. అది గురజాడ, గిడుగు లాంటి మహనీయులకి మనమిచ్చే నిజనివాళి.

కొవ్వలి గోపాలకృష్ణ

**ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ**
**ప్రధాన సంపాదకులు**

# ముఖచిత్రం

భాష, సాహిత్య వైభవ తోరణం




# లోపల

## సాహిత్య ప్రకాశిక



## భాషా ప్రకాశిక

# ధన్యోస్మి



ప్రకాశిక ఆలోచనకి బీజం పడినప్పటినుండి, తొలివార్షికోత్సవ సంచిక విడుదల వరకు జరిగిన ప్రయాణం చారిత్రాత్మకమైనది. వ్యక్తిగతంగా నేను ఎన్నో విషయాలు నేర్చుకున్నాను.  సజ్జన సాంగత్యం, ఎందరో సాహితీమూర్తులతో పరిచయ భాగ్యం కలిగింది.

ప్రకాశికని నడపడంలో సహకరించిన సంపాదక వర్గ సభ్యులకి, ముఖ్యంగా శ్రీ మా శర్మ గారికి, డా. అనంత పద్మనాభరావు గారికి, విహారి గారికి, నాగసూరి వేణుగోపాల్ రావు గారికి శత సహస్ర వందనాలు.  సంపాదకవర్గం లో లేకపోయినా, అడిగినప్పుడల్లా, అడిగిన వెంటనే, సలహాలు, సమాచారం ఇచ్చి సహకరించిన ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

తొలి వార్షికోత్సవ సంచికలో భాష-పరిణామం అన్న అంశం మీద ప్రత్యేక వ్యాసాలు సేకరించి, ఈ సంచికకి అతిథి సంపాదకత్వం వహించిన ఆచార్య ఉషాదేవి గారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు.

ఈ సంచిక రూపొందించడం లో  సహకరించిన డా. బాలగణేశ్ కి, పూర్వ సంచిక రూపొందించడం లో  సహకరించిన శ్రీ జంధ్యాల శరత్ బాబుకి ధన్యవాదాలు.

ప్రకాశిక నిర్వహణలో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను సహకరించిన ఎందరో మహానుభావులు, అందరికే అక్షరాంజలులు.

భవదీయుడు
ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ
ప్రధాన సంపాదకులు

# ధన్యవాదాలు

ప్రకాశిక తొలి వార్షికోత్సవ సంచికతో కలిపి, ఇప్పటివరకు వచ్చిన 5సంచికలలో వారి వ్యాసాలు, కథలు, కవితలు ప్రచురించిన వారందరికీ పేరు పేరునా హృదయపూర్వక ధన్యవాదాలు. ప్రకాశిక సంచికలు చదివి, అభినందించి, అమూల్యమైన సలహాలు, సూచనలు ఇచ్చిన పాఠకులకి అక్షర నీరాజనాలు.

భవిష్యత్తులో కూడా ప్రకాశికని ఆదరించి మీ బంధు మిత్రులకి కూడా పరిచయం చేయమని కోరుతున్నాము.

ఇట్లు

ప్రకాశిక సంపాదక వర్గం

శ్రీ రవీంద్రుడు గురజాడ

శ్రీ మాశర్మ

శ్రీ విహారి

శ్రీ అప్పరసు కృష్ణా రావు

ఆచార్య వెలమల సిమ్మన్న

శ్రీ కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి

డాక్టర్. అయ్యలసోమయాజుల గోపాలరావు

డాక్టర్. కాత్యాయని విద్మహే

శ్రీ పాలమరశెట్టి కృష్ణారావు

కళారత్న డాక్టర్. మీగడ రామలింగస్వామి

డాక్టర్.గుమ్మ సాంబశివరావు

డాక్టర్. జి.వి.పూర్ణచందు

డాక్టర్. దామెర వేంకట సూర్యరావు

డాక్టర్. .ఎన్.సీహెచ్.చక్రవర్తి

డాక్టర్. సి. భవాని దేవి

డాక్టర్. నాగసూరి వేణుగోపాల్

శ్రీ జంధ్యాల శరత్ బాబు

శ్రీ ఆర్.ఎస్. వెంకటేశ్వరన్

శ్రీ శ్రీనివాస రాజు పెన్మెత్స

డాక్టర్. చెంగల్వ రామలక్ష్మి

ఆచార్య నేమాని కృష్ణమూర్తి

డాక్టర్. జి.అరుణాదేవి

డాక్టర్. జంధ్యాల జయకృష్ణ బాపూజీ

డాక్టర్. పి.సి.వెంకటేశ్వర్లు

శ్రీ వింజనంపాటి రాఘవరావు

శ్రీ తరిగొప్పల వి.ఎల్.ఎన్.మూర్తి

శ్రీమతి రావుల కిరణ్మయి

శ్రీ అనుసూరి వేంకటేశ్వరరావు

శ్రీమతి రవీణ చవాన్, పూణే

శ్రీ ముప్పవరపు వెంకయ్య నాయుడు,
భారత ఉపరాష్ట్రపతి

శ్రీ మండలి బుద్ధప్రసాద్

డాక్టర్. కొండుభట్ల రామచంద్రమూర్తి

శ్రీ భండారు శ్రీనివాసరావు

డాక్టర్. వి.వి. రామారావు

డాక్టర్. రేవూరు అనంతపద్మనాభరావు

శ్రీ కల్లూరి భాస్కరం

శ్రీ సుంకర చలపతిరావు

డాక్టర్. సి.హెచ్.సుశీల

డాక్టర్. శేషగిరి రావు వెల్లంకి

కీ.శే. రామవరపు జగన్మోహనరావు

సినీ విజ్ఞాన విశారద శ్రీ ఎస్వీ రామారావు

శ్రీమతి షావుకారు జానికి

శ్రీ కైకాల సత్యనారాయణ

శ్రీ భువనచంద్ర

శ్రీ ద్విభాష్యం రాజేశ్వరరావు

ఆచార్య డి.వి. శ్రవణ్ కుమార్

డాక్టర్. తుర్లపాటి రాజేశ్వరి

శ్రీ సెట్టి ఈశ్వరరావు

డాక్టర్. భాస్కర్ రావు

శ్రీ బుడితి రామినాయుడు

డాక్టర్. మేడసాని మోహన్

ఆచార్య అయినవోలు ఉషా దేవి

ఆచార్య వెలుదండ నిత్యానంద రావు

డాక్టర్. లక్ష్మణ చక్రవర్తి

డాక్టర్. దుర్గెంపూడి చంద్రశేఖరరెడ్డి

ఆచార్య శివుని రాజేశ్వరి

డాక్టర్. శారదా పూర్ణ శొంఠి



N. V. RAMANA
CHIEF JUSTICE OF INDIA

SUPREME COURT OF INDIA
TILAK MARG
NEW DELHI-110 001
Phone : 011-23794772

27 నవంబర్ 2021

<u>సందేశం</u>

మహాకవి శ్రీ గురజాడ వేంకట అప్పారావు గారు స్థాపించిన పత్రిక '*ప్రకాశిక*' ని పునః ప్రారంభించినందుకు గురజాడ ఫౌండేషన్, అమెరికా వారికి, ప్రధాన సంపాదకులు ఆచార్య కొవ్వలి గోపాలకృష్ణ గారికి, వారికి సహాయ, సహకారాలు అందిస్తున్న వారందరికీ అభినందనలు. '*ప్రకాశిక*' ప్రతులు చాలా అందంగా, ఆలోచింపజేసే, విజ్ఞానం పెంపొందించే వ్యాసాలతో రూపొందించబడ్డాయి. '*ప్రకాశిక*' విజయవంతంగా ఒక సంవత్సరం పూర్తి చేసుకున్న సందర్భంగా సంపాదక వర్గానికీ, రచయితలకీ, పాఠకులకీ శుభాకాంక్షలు.

గురజాడ వారి రచనలు ఆనాటి సమాజంలోని సాంఘిక, ఆర్థిక రాజకీయ పరిస్థితులకి అద్దం పట్టేవి. అవి ఈనాటికీ పాఠకులని ప్రభావితం చేస్తున్నాయంటే కారణం ఆయన సృష్టించిన పాత్రలు నేటికీ ఏదో రూపంలో సమకాలీన సమాజంలో సజీవంగా ఉండడమే. ఆయన కాలంలో నెలకొన్న మూఢ నమ్మకాలూ, దురాచారాలూ ఏదో రూపంలో ఈనాడూ కొనసాగుతూ ఉండడమే. ఆయన రచనలు మేధావులని ఆలోచింపజేసేలా ఉంటాయి; సామాన్యులకి 'మన వ్యథలూ,బాధలూ అర్థం చేసుకున్న మనిషి ఒకరున్నారు' అనే భరోసా ఇచ్చేలా ఉంటాయి.

భౌగోళిక, నైసర్గిక సరిహద్దులు ముఖ్యం కాదని, మనిషి, మానవత్వం దేశ మనుగడకీ, ఉనికికీ ముఖ్యమని చెబుతుంది గురజాడ వారి దేశభక్తి గీతం. మన దేశం 'పాడి పంటలు పొంగిపొరలే దేశం' కావాలని ఆశించారు గురజాడ. పాడి పంటలు లేని, తిండి లేక ఈసురోమంటూ బతికే జనమున్న దేశం అంతర్గత, బాహ్య శత్రువులనుంచి తనను తాను రక్షించుకోలేదన్న సత్యాన్ని కవితాత్మకంగా, ప్రభోదాత్మకంగా కలకాలం నిలిచేలా రాసిన గురజాడ అజరామరమైన ప్రపంచ కవి.

*"దేశమును ప్రేమించుమన్నా*
*మంచి యన్నది పెంచుమన్నా*
*వొట్టి మాటలు కట్టిపెట్టోయ్*
*గట్టి మేల్ తలపెట్టవోయ్*

...

*దేశాభిమానం నాకు కద్దని*

*వొట్టి గొప్పలు చెప్పకోకోయ్*

*పూని ఏదైనాను ఒక మేల్*

*కూర్చి జనులకు చూపవోయ్*

...

*సొంత లాభం కొంత మానుకు*

*పొరుగు వానికి తోడుపడవోయ్*

*దేశమంటే మట్టి కాదోయ్*

*దేశమంటే మనుషులోయ్''*

గురజాడ వారి దేశభక్తి గీతంలోని ఈ పంక్తులను భాషలకు, ప్రాంతాలకు, దేశాలకు అతీతంగా ఎవ్వరైనా, ఎక్కడైనా, ఏ సందర్భంలోనైనా ఉటంకించవచ్చు, అన్వయించుకోవచ్చు. ఇదొక విశ్వ మానవ గీతం. అందుకే ప్రముఖ కవి శ్రీ శ్రీ ఈ గీతాన్ని సమస్త ప్రపంచ మహాజనుల జాతీయ గీతంగా అభివర్ణించారు. ఈ గీతంలో ప్రతి పద్యం, ప్రతి పంక్తి నేటికీ, ఏనాటికీ ప్రాసంగికమే. సమాజపు తీరుతెన్నులను కాచి వడపోసిన దార్శనికులు మాత్రమే ఇలాంటి మానవీయ రచనలు చేయగలుగుతారు.

గురజాడ రచనలు వ్యవస్థల మీద ఎక్కుపెట్టిన సూటి బాణాలు; వ్యవస్థల ముసుగులో అమాయక, సామాన్య ప్రజలని మోసగిస్తున్నవారిమీద విసిరిన పదునైన వ్యంగ్యాస్త్రాలు. రాజకీయ, పోలీసు, న్యాయ వ్యవస్థలు సామాన్య ప్రజల రక్షణ కోసం ఏర్పడి పనిచేస్తున్నా, ఎవరో కొందరు ఈ వ్యవస్థలని స్వప్రయోజనాలకోసం వాడుకుని వాటికి ఎలా చెడ్డపేరు తెస్తారు అన్న విషయాన్ని గురజాడ తన రచనలలో శక్తివంతమైన సంభాషణల ద్వారా చెబుతారు. వ్యవస్థలలోని లోపాలను, సమాజంలోని దురాచారాలను, దురాగతాలను నిర్భయంగా ఎత్తిచూపి, సమస్యలకు పరిష్కారాలను సూచించగల శక్తి రచయితలకి ఉంది. కత్తికంటే కలం గొప్పదన్న నానుడిని నిజం చేస్తూ, గురజాడ చాటిన సర్వ మానవ సమానత్వం వైపు సమాజాన్ని నడిపింపగల అవకాశం, బాధ్యత మేధావులకి ఉంది. గురజాడ వారి రచనల స్ఫూర్తితో, వారి ఘనమైన వారసత్వానికి ప్రతీకగా '*ప్రకాశిక*' ఒక శక్తివంతమైన, సామాజిక చైతన్యం నింపే, సాహిత్య పత్రికగా వర్ధిల్లాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను.

**(నూతలపాటి వెంకట రమణ)**

భారత ప్రధాన న్యాయమూర్తి

Ms. A Surya Kumari IAS
**Collector & District Magistrate**
**Vizianagaram**

Ph : 08922 - 276720 (Office)
08922 - 276177 (Camp Office)
08922 - 278876 (Camp Office)
Mobile : +91 94901 94666
E-mail : collector_vznm@ap.gov.in

## ప్రకాశిక

తెలుగు భాష గొప్పతనాన్ని, సాహిత్యాన్ని, స్ఫూర్తి కలిగించే కథనాంశాలను అందిస్తున్న ప్రకాశిక సంప్రదాయ పత్రికలకు విభిన్నంగా ఉందనే చెప్పాలి. అందులో ప్రచురించే కథనాలు, కథలు, వినియోగించే భాష, రచనా శైలి ఎంతో గొప్పగా ఉన్నాయి. తెలుగు భాష గురించి, కవి పండితుల గురించి, గొప్పగొప్ప రచయితల గురించి తెలుసుకోవాలనే వారికి ఇదొక జ్ఞానభాండాగారమనే చెప్పాలి. భావితరాలకు ఇదొక చక్కని భాషా వేదిక అవుతుందని భావిస్తున్నాను. ఒక పక్క సాహిత్య అంశాలకు ప్రాధాన్యత ఇస్తూనే.. ఆర్థిక, సామాజిక అంశాలకు కూడా ఈ ప్రకాశిక సమున్నత స్థానం కల్పించటం నిజంగా అభినందనీయం. నేటి తరానికి ఉపయోగపడేలా.. నాటి తరం అంశాలను అందిస్తున్న ప్రకాశిక అందరూ చదవ దగ్గ పత్రిక అని చెబుతున్నందుకు చాలా సంతోషంగా ఉంది.

నవయుగ వైతాళికుడు, సంఘ సంస్కరణకు నడుం కట్టిన మేరునగ ధీరుడు, మహాకవి శ్రీ గురజాడ వేంకట అప్పారావు గారు నడయాడిన పవిత్రమైన నేల విజయనగరం. వ్యావహారిక భాష లో గురజాడ రాసిన దేశ భక్తి గీతం, కథలు, నాటికలు సమాజాన్ని ఎంతగానో జాగృత పరచాయి. బాల్య వివాహాలను రూపు మాపడానికి గురజాడ రచించిన కన్యాశుల్కం నాటకానికి వందేళ్ళు దాటినా ఇప్పటికీ ఆదరణ తగ్గక పోవడం వారి ప్రతిభకు తార్కాణం.

గురజాడ స్ఫూర్తి గా వారు రచించిన రచనలను, వారి భావజాలాన్ని, వస్తువులను, జ్ఞాపకాలుగా భావితరాల వారికి వారసత్వ సంపదగా అందించాల్సిన బాధ్యత, అవసరం ఎంతైనా ఉందని భావిస్తున్నాను.

గురజాడను గుండెల్లో పదిలపరచుకున్న కళల కాణాచిగా, విద్యల నగరంగా ఖ్యాతి గాంచిన విజయనగరం కీర్తిని స్ఫూర్తిదాయకంగా నిలపడం లో తోడ్పాటునందించడానికి పెద్ద మనసుతో ముందుకు రావాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

మీరందించే ఆర్థిక సహాయం మౌలిక వసతుల కల్పన, టాయిలెట్స్, తాగు నీటి సౌకర్యం, పాఠశాల భవనాలు /ఆసుపత్రుల అభివృద్ధికి ఉపకరిస్తాయని భావిస్తూ మీ దాతృత్వానికి మీ పేరును పెట్టే అవకాశాన్ని కల్పించాలని మనవి చేస్తున్నాను.

ఇట్లు

A Surya K—

(ఎ. సూర్యకుమారి , ఐ.ఏ.ఎస్ )

జిల్లా కలెక్టర్, విజయనగరం

ప్రత్యేక వ్యాసం

# కొప్పరపు కవుల పరిచయం



మాశర్మ
కాలమిస్ట్ & సీనియర్ జర్నలిస్ట్
✆ 93931 02305

తెలుగువాడి సంతకంగా భావించే “అవధాన విద్య”కు బలమైన పునాదులు, బంగారు బాటలు వేసిన మహనీయులలో ప్రథమ శ్రేణీయులు, ఆశుకవిత్వంలో అగ్రగణ్యులు, జంటకవులుగా విఖ్యాతులు కొప్పరపు సోదర కవులు. వీరిరువురు స్వయంగా సోదరులు, కవితా రసోదరులు. వీరి పూర్తి పేర్లు వేంకటసుబ్బరాయకవి (1885-1932)-వేంకటరమణకవి(1887-1942).వేంకటసుబ్బమాంబ, వేంకటరాయలు వీరి తల్లిదండ్రులు. వీరిది కవి వంశం. పూర్వం వీరింట్లో ఎందరో కవులు ఉద్భవించారు. అందుకే,”కవిత పుట్టిల్లు సోదరకవుల ఇల్లు” అనే ఖ్యాతి వచ్చింది. గుంటూరు జిల్లా నరసరావుపేటకు దగ్గరలోని ‘కొప్పరం’ వీరి స్వగ్రామం. వీరి ఊరుపేరు, ఇంటిపేరు ఒకటే కావడం విశేషం. ఈ ప్రాంతం చాలాకాలం కృష్ణాజిల్లాలో ఉండేది. తర్వాత గుంటూరుజిల్లాగా మారింది. ప్రస్తుతం ప్రకాశం జిల్లా పరిధిలోకి వచ్చింది. గుంటూరు - ప్రకాశం జిల్లాల సరిహద్దు గ్రామమైన సంతమాగులూరుకు ఐదు కిలోమీటర్ల దూరంలో కొప్పరం ఉంది. మహాకవులకు నిలయమై, గొప్ప చరిత్రకు, పౌరుష ప్రాభవాలకు ఆలవాలమైన కొండవీటి సీమ, పలనాటి గడ్డలో కొప్పరపు సోదరకవులు ఉదయించారు. చిన్నారి పొన్నారి చిరుతకూకటినాడే కొప్పరపు కవులు పద్యాలను అల్లడం, అవధానాలు చేయడం ఆరంభించారు. తండ్రి వేంకటరాయలు తొలి గురువు. మాతామహ వంశీకుడైన పోతరాజు



రామకవి వీరికి అవధాన గురువు. కొప్పరంకు కాస్త దగ్గరగా ఉండే ఏల్చూరు రామకవిగారి స్వగ్రామం. నేటి కుర్తాళ పీఠాధిపతి, పూర్వాశ్రమ డాక్టర్ ప్రసాదరాయకులపతిగారి ముత్తాతగారే రామకవి. రామకవిగారు ఇరవై కళలలో బహు ప్రావీణ్యులు. సోదర కవుల సంస్కృత విద్యాభ్యాసం నరసరావుపేటకు చెందిన రామడుగు రామకృష్ణశాస్త్రిగారి దగ్గర సాగింది. అన్నదమ్ముల వయస్సుల్లో ఇద్దరి మధ్య రెండేళ్ల వ్యత్యాసం ఉంది. మొట్టమొదటగా అగ్రజుడు వేంకటసుబ్బరాయకవి కవితా ప్రస్థానం ప్రారంభించాడు. ఐదేళ్ల ప్రాయంలోనే కవితలల్లడం ఆరంభించాడు. 10-11 ఏళ్ళ వయస్సులోనే అష్టావధానం చేసి అందరినీ ఆశ్చర్యపరిచాడు. పదహారేళ్ళ ప్రాయంలోనే శతావధానం నిర్వహించి, బెల్లంకొండ రామారాయకవీంద్రుని వంటి కవిపండిత ప్రకాండులతో శభాష్ అనిపించుకున్నాడు. అవధానాలు ఒక పక్క - ఆశువుగా కావ్యాలు చెప్పడం మరొక పక్క సాగిస్తూ విజయభేరి మోగించాడు. సుమారు 1902 ప్రాంతంలో, సోదరులిద్దరూ కలిసి జంటకవితాయాత్రకు శ్రీకారం చుట్టారు. వీరి మొట్టమొదటి అవధానం నరసరావుపేట పాతూరు ఆంజనేయస్వామి దేవాలయంలో జరిగింది. కవులిద్దరూ ఆంజనేయస్వామి, దుర్గాదేవి ఉపాసకులు. వీరి తుదిశ్వాస వరకూ ఆ రెండు నామములు రసనాగ్రంపై నర్తించేవి. అందుకేనేమో! వీరి కవితా ప్రవాహంలో అంతటి వేగం, సారస్వత జీవితంలో అంతటి వైభవం ప్రాప్తించాయి. తెలుగు సాహిత్య చరిత్రలోనే వీరంతటి వేగంగా కవిత్వం చెప్పినవారు లేరన్నది పెద్దల మాట. ఆ మహావేగ రసభాసుర కవితా ప్రసారాన్ని నభూతో! న భవిష్యతి! గా వరిష్ఠులు, గరిష్ఠులు అభివర్ణించారు. కుగ్రామం నుంచి మహా నగరాల వరకూ వారి కవితా ప్రస్థానం సాగింది. వెళ్లిన ప్రతిచోటా, జయజయ ధ్వానాలే మిన్ను ముట్టాయి. కవితా వర్షం,'కనక' వర్షం ఏరులై పారాయి. కొప్పరపు కవుల సభలలో ప్రత్యక్షంగా పాల్గొని, వారి అసమాన వేగధాటికి ఆశ్చర్యచకితులై, ఆ అసాధారణ ధారణా ధురీణతకు అచ్చెరువు చెంది, ఆ కవితా పరీమళ శోభకు అమితానందభరితులై, ఆ అనుపమ ప్రతిభా ప్రభకు మురిసి మెరిసి ఆశీస్సులు, అభినందనలు, ప్రశంసలు పద్య రూపాత్మకంగా అందించిన మహనీయుల నామధేయములు వింటే చాలు! ఒళ్ళు గగుర్పొడుస్తుంది. కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని, వేదం వేంకటరాయశాస్త్రి, వావిలకొలను సుబ్బారావు (వాసుదాసు), వేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, జయంతి రామయ్యపంతులు, వడ్డాది సుబ్బరాయకవి (వసురాయ కవీంద్రుడు), కాశీ కృష్ణాచార్యులు, కొక్కొండ వేంకటరత్నం పంతులు, పేరి కాశీనాథశాస్త్రి, ముదిగొండ నాగలింగశాస్త్రి, తంజనగరం దేవపెరుమాళ్లయ్య (దేవరాజు సుధీమణి), చెన్నాప్రగడ భానుమూర్తి వంటి మహామహోపాధ్యాయులు ఎందరో... కొప్పరపు కవుల ప్రతిభను చూసి

నిర్వైరపోయి, ఆనందభాష్పాలు వృష్టించారు. చిలకమర్తి, కాళ్ళకూరి, బలిజేపల్లి, విశ్వనాథ, తుమ్మల, జాషువా, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, వద్దిరాజు సోదరులు, శేషాద్రిరమణకవులు వంటివారు కొప్పరపువారి వాగ్దేవతకు ఆరతులిచ్చారు. టంగుటూరు ప్రకాశం పంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు, భోగరాజు పట్టాభిసీతారామయ్య, కొండా వెంకటప్పయ్య, కొమర్రాజు లక్ష్మణరావు, కాశీనాథుని నాగేశ్వరావుపంతులు, బెజవాడ పట్టాభిరామిరెడ్డి (గోపాలరెడ్డి తండ్రి), జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి, కాసు వెంకటరెడ్డి (బ్రహ్మానందరెడ్డి, వెంగళరెడ్డికి అగ్రజుడు) వంటి నాయకశ్రేష్ఠులు నీరాజనాలు పలికారు. పండిట్ జవహర్ లాల్ నెహ్రు కొప్పరపువారి ఆశుకవితా విన్యాసం చూసి జగదాశ్చర్యకరమని ప్రశంసలతో ముంచెత్తారు. సోదరకవుల ప్రభావంతో ఎందరో పద్యకవులు, అవధాన కవులు తెలుగునేలపై పుట్టుకొచ్చారు. కొప్పరపువారు కొన్ని వేల సభలు చేశారు, లక్షల పద్యాలు చెప్పారు. రోజుకొక శతావధానం చేశారు. ఓకే రోజు రెండేసి శతావధానాలు చేసిన సందర్భాలు కూడా ఉన్నాయి. గంటకొక కావ్యాన్ని, ప్రబంధాన్ని అశువుగా చెప్పారు. గంటకు ఐదు వందల పద్యాలను ఆశువుగా చెప్పిన సందర్భాలు ఉన్నాయి. ఒకసారి మార్టేరులో అరగంట కాలంలోనే 360 పద్యాలతో "మనుచరిత్ర" కావ్యాన్ని ఆశువుగా చెప్పి, సభ్యులను ఆశ్చర్యజలధిలో ముంచెత్తారు. గన్నవరంలో జరిగిన ఒక సభలో, షేక్స్పియర్ " సింబలైన్" కావ్యాన్ని 400 పద్యాలలో కావ్యంగా ఆశువుగా నిర్మించి, ప్రేక్షకులను రసానంద తాండవంలో మునకలెత్తించారు. తొలిజామున లేచి, వారు రచించిన "భాగవత కావ్యము"లోని పద్యాలు చదివేవారని బూదరాజు రాధాకృష్ణగారు తన ఆత్మకథ వంటి " విన్నంత కన్నంత" లో రాశారు. తన మాతామహులు పంగులూరివారి నుంచి ఈ విశేషాలు విన్నట్లు బూదరాజువారు వివరించారు. ఆ కాలపు మహనీయుల ఆత్మకథల్లో, జీవిత చరిత్రల్లో కొప్పరపువారి విశేషాలు అక్షరసాక్ష్యాలుగా చరిత్రలిఖితమై ఉన్నాయి. ఎక్కడెక్కడ నుంచో బండ్లు

> పండిట్ జవహర్ లాల్ నెహ్రు కొప్పరపువారి ఆశుకవితా విన్యాసం చూసి జగదాశ్చర్యకరమని ప్రశంసలతో ముంచెత్తారు. సోదరకవుల ప్రభావంతో ఎందరో పద్యకవులు, అవధాన కవులు తెలుగునేలపై పుట్టుకొచ్చారు.

కట్టుకొని ఆ సభలకు వెళ్లేవారు. కొన్ని వేలమంది ప్రేక్షకులతో సదస్సులు కిక్కిరిసిపోయేవి. ఈ కవిద్వయం దైవసంకల్పము, సాధ్వీ మాహాత్మ్యము (కుశలవ), శ్రీకృష్ణ కరుణా ప్రభావము మొదలైన కావ్యాలు రచించారు. సుబ్బరాయ శతకం ( వేంకటరమణకవి విరచితం), దీక్షితస్తోత్రము, నారాయణాస్త్రము, కనకాంగి, జ్ఞానోపదేశము మొదలైన రచనలు కూడా చేసినట్లు తెలుస్తోంది. ఆశువుగా చెప్పిన లక్షల పద్యాలు, కూర్చొని రాసిన కావ్యాలు, ఖండికలు, శతకాలు సంపూర్ణంగా నేడు అందుబాటులో లేవు. దైవసంకల్పము, సుబ్బరాయశతకము సంపూర్ణంగా నేడు దొరుకుతున్నాయి. కొన్ని అవధాన పద్యాలు, సమకాలిక మహాకవి పండితులు చెప్పిన ప్రశంసా పద్యాలు కొన్ని ఈనాడు లభ్యంగా ఉన్నాయి. వారి కవితా సంపద కోసం అన్వేషణ జరుగుతూనే ఉంది. దొరికిన పద్యాలను పరికిస్తే? పద్యాలన్నీ ప్రబంధగతిలో సుగంధాలు వీస్తున్నాయి. నన్నయ్య, తిక్కన్న, యర్రాప్రగడ, పోతన, శ్రీనాథుడు, అల్లసాని పెద్దన, తెనాలి రామకృష్ణ, రామరాజభూషణుడు, ధూర్జటి, పింగళి సూరన వంటి పూర్వ మహాకవుల చతుర వచోరీతులన్నీ కొప్పరపు కవుల నడకలో కనిపిస్తాయి.వీరు ఆశువుగా చెప్పిన అవధాన పద్యాలు- కూర్చొని రాసిన కావ్య పద్యాలు రెండింటిలోనూ అదే శోభ దర్శనమవుతుంది. ప్రతిపద్యమూ శబ్దసౌందర్యం, అర్థ గాంభీర్యంతో ప్రబంధ ప్రభతో ప్రకాశిస్తూ వుంటుంది. కేవలం అత్యంత వేగంగా చెప్పడమే కాదు, వేగంగా చెప్పిన పద్యాలలోనూ అనంత సౌందర్య శోభిత విలక్షణతను చూపించడం వీరి అనుపమానమైన అపూర్వ ప్రతిభ. విశేష వృత్తాలు ఎన్నో వీరి అవధానాల్లో కనిపిస్తాయి. క్లిష్ట ప్రాసలను అలవోకగా దాటుతూ పద్యం చెప్పేవారు. సీస పద్యాలను సైతం కుప్పలుగా చెప్పే అరుదైన అవధాన విధానం వీరిది. వీరి ధారణా వైదుష్యం కూడా అనితర సాధ్యం. శతావధానంలో వరుసగా మూడు రకాలుగా ధారణ చేసి చూపించేవారు. (1) ఒకటి నుంచి వంద వరకూ, (2) వంద నుంచి ఒకటి వరకూ,

> నన్నయ్య, తిక్కన్న, యర్రాప్రగడ, పోతన, శ్రీనాథుడు, అల్లసాని పెద్దన, తెనాలి రామకృష్ణ, రామరాజభూషణుడు, ధూర్జటి, పింగళి సూరన వంటి పూర్వ మహాకవుల చతుర వచోరీతులన్నీ కొప్పరపు కవుల నడకలో కనిపిస్తాయి.

(3) అస్తవ్యస్తంగా 3,9,5,21,13,97,18... ఇలా పృచ్ఛకుల స్థానాలను,పేర్లను, సంఖ్యను గుర్తు చేస్తూ.. పద్యాలను అప్పచెప్పేవారు. శతావధానం ముగిసిన తర్వాత సభా విశేషాలను వర్ణిస్తూ యాభై పద్యాలు తక్కువ కాకుండా అదనంగా చెప్పేవారు. అరిస్తే పద్యం, స్మరిస్తే పద్యం.. అని శ్రీశ్రీ అన్నట్లు.. మామూలు పలకరింపులు కూడా పద్యాలలోనే చేసేవారు. వారు పద్యాలలోనే మాట్లాడుకునేవారు, మాట్లాడిన మాటలన్నీ పద్యాలయ్యేవి. అందుకే, "పలికిన పలుకులన్నియును పద్యము లయ్యెడు, ఏమి చెప్పుదున్? " అని వీరి గురించి వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అన్నారు. తెలుగువారు ఎక్కడ వుంటే అక్కడకు వెళ్లి కొప్పరపు కవులు పద్యాలు చెప్పారు. దేవాలయాలు, రాజాస్థానాలు, చావిళ్లు, మంటపాలు, విద్యాశాలలు, గృహాలు, వీధులు, కూడళ్ళు కొప్పరపు కవుల కవితా ప్రదర్శనలకు నాడు వేదికలయ్యాయి. ఎన్నో బిరుదులు, ఏన్నెన్నో సత్కారాలు, మరెన్నో గజారోహణ, గండపెండేరాది ఘన గౌరవాలు పొందారు. తెలుగు పద్య సరస్వతిని, అవధాన ప్రభను ఊరూవాడా ఊరేగించారు. పద్యాన్ని శ్వాసించారు, పద్యసీమను శాసించారు. నేడు కొన్ని వందల పద్యాలే అందుబాటులో ఉన్నప్పటికీ, అవన్నీ అనర్ఘరత్నాలే." గంగిగోవు పాలు గరిటడైనను చాలు" అన్నట్లు, పవిత్ర గంగాప్రవాహ సదృశమైన కొప్పరపు కవుల ధారను పద్యప్రియులు హృదయపూర్వకంగా ఆరాధిస్తున్నారు, ఆస్వాదిస్తున్నారు.అనల్పపద్య సంపదను సృష్టించిన ఈ మహాకవులు భౌతికంగా జీవించిన కాలం అతి స్వల్పం. అగ్రజుడు వేంకటసుబ్బరాయకవి 46 ఏళ్ళకే తనువు చాలించారు.సోదరుడు వేంకటరమణకవి 54 ఏళ్ళ ప్రాయంలోనే శరీరాన్ని వదిలేశారు.అన్నయ్య వెళ్లిపోయిన తర్వాత తమ్ముడు పదేళ్లు జీవించినా, భాతృవియోగంతో అస్త్ర సన్యాసం చేశారు. అప్పటికి వీరి సంతానం చాలా చిన్నపిల్లలు (10,7,4 ఏళ్ళ ప్రాయంవారు).వారి సాహిత్య సంపదను దాచలేకపోయారు. ప్రకృతి వైపరీత్యాలకు, అపహరణలకు ఆ అమూల్య సంపద అదృశ్యమైపోయింది. తెలుగువారి అదృష్టంతో, నేడు కొంతైనా దొరుకుతోంది. ఈ అమూల్యరాశిని అక్కున చేర్చుకుందాం. దైవోపాసనతో పాటు యోగాభ్యాసం, వ్యాయామం చేసేవారు. కర్రసాము ప్రత్యేకంగా సాధన చేసేవారు. వారి కవిత్వం ఎంత అందంగా ఉంటుందో, వారి రూపాలు కూడా సమ్మోహన స్వరూపాలు. ఖంగుఖంగుమనే కంఠధ్వని, శ్రావ్యమైన పద్య పఠనం వారి ఆకర్షణలు. అంతటి పట్టుదల,అంతటి ప్రతిభ, వ్యక్తిత్వం కలిగిన సారస్వతమూర్తులు ఎప్పుడో కానీ జన్మించరు. నవంబర్ 12వేంకటసుబ్బరాయకవి, డిసెంబర్30 వేంకటరమణకవి జయంతి దినోత్సవములు. రససిద్ధులైన మహాకవులు జరామరణాలకు అతీతులై, యశఃకాయులై విరాజిల్లుతూనే ఉంటారు. జయహో తెలుగు పద్యం.

ప్రత్యేక వ్యాసం

# ఆశు కవిత్వానికి కావ్య స్థాయిని కల్పించిన మహా కవులు



ఎ.కృష్ణారావు
(సీనియర్ జర్నలిస్టు, ఢిల్లీ)
98102 23863

పద్యం ఒక అద్భుతమైన సాహితీ ప్రక్రియ. తెలుగు సాహిత్యంలో దానికి ఒక విశిష్టత ఉన్నది. పద్యం ద్వారా స్వేచ్ఛగా భావాలను వ్యక్తీకరించడం సాధ్యం కాదు అన్న వాదనలో నిజం లేదని చెప్పడానికి తెలుగు పద్య కావ్యాల్లో అనేక పద్యాలను ఉటంకించవచ్చు. సొగసు, సౌందర్యం, భావ వ్యక్తీకరణ, లయ, సంగీతం వంటి అనేక లక్షణాలను కేవలం ఒకే పద్యంలో చెప్పడానికి అవకాశాలున్నాయి. అనంతమైన అర్థాన్ని నాలుగు పాదాల కందంలో చెప్పవచ్చని మన కవులు నిరూపించారు. ఒక చిన్నపద్యంలో అందమైన స్త్రీని, ప్రకృతి సౌందర్యాన్ని వర్ణించడం ఏ విధంగా సాధ్యమవుతుందో, అనంతమైన భక్తిని కూడా వ్యక్తం చేయడం కూడా సాధ్యమవుతుందని చెప్పవచ్చు. ఎక్కువ మంది కవులు రాజాస్థానాలు, సంపన్నుల లోగిళ్లలో వారిని స్తుతిస్తూ పద్యాలు అల్లినంత మాత్రాన పద్యానికి ఉన్న గౌరవం ఏ మాత్రం తగ్గిపోలేదు. భక్తి సాహిత్యంలో పద్యం కీలక పాత్రను పోషించింది. అదే విధంగా ధిక్కారసాహిత్యంలోనూ, సామాజిక చైతన్యం ప్రోదిచేయడంలోనూ పద్యం పాత్ర లేదని చెప్పలేము. ఒక సాహితీ ప్రక్రియకున్న ప్రత్యేకతను పద్యం ఎప్పుడూ నిరూపించుకుంది.

పద్యమే సాహిత్యంలో ప్రధాన ప్రక్రియగా ఉన్నప్పుడు కొన్నిదశాబ్దాల పాటు వందలాది రచనలు వెలువడ్డాయి. కాని వాటిలో కూడా అత్యంత నాణ్యమైనవి, ప్రతిభావంతమైనవి కాలపరీక్షకు నిలబడ్డాయి. వ్యాస మహాభారతాన్ని నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱన తెనుగీకరించినా, వారి వారి ప్రత్యేకతలు, వర్ణనా చాతుర్యం స్పష్టంగా కనిపిస్తాయి. నన్నయ్య ఉజ్జ్వల మైన శారద రాత్రులను ఎంత ఆనందిస్తామో, ఎఱ్ఱన నిరస్త నీరదావరణములైన స్ఫురదరుణాంశు రాగ రుచినీ అంతే అనుభవిస్తాం. మందారమకరంద మాధుర్యాన్ని అందించిన పోతన మనలను

భక్తి పారవశ్యాలను చేస్తారో, పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంత కాఠిన్యాన్ని తెలిపిన శ్రీనాథుడూ మనను అంతే ఆకట్టుకుంటారు. పెద్దన, రామరాజ భూషణుడు మొదలైన అష్టదిగ్గజాలు రచించిన ప్రబంధ కావ్యాల్లో మనకు లభించే సాహితీ సౌందర్యం ఆస్వాదించడం మొదలు పెడితే బయటకు రావడం అంత సులభం కాదు.

బ్రిటిష్ వారు వచ్చాక గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమైంది. కావ్య రచనను ప్రోత్సహించేవారు, పోషించేవారూ లేకపోయారు. ఆధునిక నాటక రంగం ప్రాచుర్యంలోకి రావడం ప్రారంభమైంది. వీరేశలింగం లాంటి వారు శాకుంతలం వంటి నాటకాల్లో అద్భుతమైన పద్యాలను రాసిన సందర్భాలున్నాయి. పద్యానికీ, నాటకానికీ మేళవింపు కుదురుతున్న ఈ క్రమంలోనే అవధాన ప్రక్రియకు ఆదరణ లభించడం మొదలైంది. ఇదివరకు రాజాస్థానాల్లో ఆశువుగాకవితలు చెప్పడం, ప్రాచీన కవులు అవధానాలు చేశారని ప్రకటించుకున్నా 19, 20 శతాబ్దాల్లో అవధానకళకు ప్రాధాన్యత లభించడానికి చారిత్రక, ఆర్థిక, సామాజిక కారణాలు లేకపోలేవు. చక్రవర్తులు, మహారాజుల దశనుంచి చిన్న చిన్నసంస్థానాలు, జమీందార్లు, ప్రముఖ వ్యాపారులు, సంపన్నులు సాహితీ పోషకులయ్యారు. ఒకరకంగా ఆధునిక తెలుగు సాహిత్య ఆవిర్భావం జరుగుతున్నసమయంలో పద్యం తనను తాను బతికించుకోవడానికి విశ్వయత్నాలు చేసింది. అందుకు అవధాన ప్రక్రియ ఎంతో దోహదం చేసింది. ఆ రకంగా పద్యాన్ని సజీవంగా ఉంచేందుకు కారకులైన వారిలో కొప్పరపు కవులు ప్రముఖులు. సుబ్బరాయ కవి, వేంకట రమణ కవి అనే ఈ కొప్పరపు సోదరులు పద్యాన్ని కాపాడేందుకు గాను పద్యకళలో సాధనను చేశారు. అవలీలగా, ఆశువుగా పద్యాలు అల్లడం ద్వారా పద్యాన్ని బతికించారు. రంగస్థలానికి పోటీగా పద్యాల్ని వేదికలపై అనర్గళంగా, ధారా ప్రవాహంగా చదివి సాహితీ ప్రియుల్ని చకితుల్ని చేశారు. పద్యాన్ని ప్రజల్లోకి తీసుకువెళ్లి పద్యం

బ్రిటిష్ వారు వచ్చాక గ్రామీణ ఆర్థిక వ్యవస్థ ఛిన్నాభిన్నమైంది. కావ్య రచనను ప్రోత్సహించేవారు, పోషించేవారూ లేకపోయారు. ఆధునిక నాటక రంగం ప్రాచుర్యంలోకి రావడం ప్రారంభమైంది.

రామణీయకతను పామరులు కూడా మెచ్చుకునేలా చేశారు. ఏకాగ్రత, భాష, వ్యాకరణంపై పట్టు ఉంటే పద్యాల్నిచదవడం అంతకష్టంకాదని నిరూపించారు. వారు పద్యంపై ఎంత పట్టు సాధించారంటే వారు మాట్లాడినా పద్యమే, వారు శ్వాసించినా పద్యమే అన్నట్లుగా కుప్పలు తెప్పలుగా పద్యాలు చెప్పడం మొదలు పెట్టారు. గంటకు 400-500 పద్యాలు కూడా అనర్గళంగా తడుముకోకుండా చదవడం, అడిగిన వెంటనే అతి వేగంతో పద్యం చెప్పడం వారు సాధన చేశారు.

1909లో వడ్లమూడిలో కొప్పరపు కవులు అవధానం చేసినప్పుడు ఉన్నప్పుడు వారికి పృచ్ఛకులుగా ఉన్న కుంటముక్కల వేంకట జానకీ శర్మ తన 70వ ఏట ఆ మహాకవుల పద్యాలను సేకరించి 1963లో ప్రకటించి ఉండకపోతే వారి సాహిత్య గొప్పతనం మనకు తెలిసి ఉండేదికాదు.

> 1909లో వడ్లమూడిలో కొప్పరపు కవులు అవధానం చేసినప్పుడు ఉన్నప్పుడు వారికి పృచ్ఛకులుగా ఉన్న కుంటముక్కల వేంకట జానకీ శర్మ తన 70వ ఏట ఆ మహాకవుల పద్యాలను సేకరించి 1963లో ప్రకటించి ఉండకపోతే వారి సాహిత్య గొప్పతనం మనకు తెలిసి ఉండేదికాదు.

అయితే అవధానాలు చేయడం, అడిగిన వెంటనే పద్యాలు చెప్పడం చేస్తున్న క్రమంలో కొప్పరపు కవులు గొప్ప కావ్య రచన చేయాలన్న ఆలోచన చేయలేదు. దాని వల్ల వారు అడపా దడపా రాసిన కొన్ని కావ్యాలు లభ్యం కాకపోగా, వారు ఆశువుగా చెప్పిన లక్షలాది పద్యాలు అక్కడికక్కడే గాలిలో కలిసిపోయాయి. వారు చేసిన అనేక శతావధానాలు అముద్రితంగానే ఉండిపోయాయి. వ్యవధి లేకుండా శతావధానాలు చేయడం, ఉధృతంగా వర్షం కురిసినట్లు పద్యాలను గుప్పించడం మూలంగా కొప్పరపు కవులకు కూడా వాటిని లిఖిత పూర్వకంగా భద్రపరచాలన్న ఆలోచన లేకపోయింది. ఈ అద్భుతమైన మౌఖిక సాహిత్యం గురించి భవిష్యత్ తరాలకు తెలియజేయడంలో సాహిత్య చరిత్రకారులు విఫలమయ్యారు.

అంత మాత్రాన కొప్పరపు కవులు అద్భుతమైన పద్యాలు రాయలేరని చెప్పడానికి వీల్లేదు. కేవలం ఆశువుగా చెప్పిన పద్యాల్లోనే వారు కవిత్రయం,

శ్రీనాథుడు, అష్టదిగ్గజాల రచించిన పద్యాల స్థాయిని చేరుకున్నారని చెప్పడానికి ఎన్నో ఉదాహరణలున్నాయి.నిజంగా రాయడంపై వారు దృష్టి కేంద్రీకరించి ఉంటే ఇంకా గొప్ప కావ్యాల సృజన జరిగి ఉండేది. ఆశుకవిత్వానికి కావ్య ప్రతిష్ట తెచ్చి, ఆశువుగా కూడా గొప్ప సాహితీ విలువలున్న పద్యాలు చెప్పగలరని వారు నిరూపించారు.

> కేవలం ఆశువుగా చెప్పిన పద్యాల్లోనే వారు కవిత్రయం, శ్రీనాథుడు, అష్టదిగ్గజాల రచించిన పద్యాల స్థాయిని చేరుకున్నారని చెప్పడానికి ఎన్నో ఉదాహరణలున్నాయి. నిజంగా రాయడంపై వారు దృష్టి కేంద్రీకరించి ఉంటే ఇంకా గొప్ప కావ్యాల సృజన జరిగి ఉండేది.

"ఏ సవిత్రి పవిత్ర దాస హృచ్ఛ తంత్ర
సంచర చ్చంచరీ కాంచితాత్మ
ఏ ప్రసూవా ప్రసూవేషు పంచేషు
పాతాసాధ్య సుధ్యుత్సవానుకూల
ఏ జనయిత్రి విభ్రాజ దోంకార
నాద బ్రహ్మమునకు నిదాన సీమ
ఏ మాతృమణి సుధాధామార్ధ బింబ
కల్పిత కలాప ప్రభాత శిరస్క
ఆ నిజాశ్రిత జాత కల్పాగకల్ప
ఆ జగన్నేత్రి శాంకరి యఖిల ధాత్రి
శిష్టరక్షణ కార్య ప్రకృష్ట చిత్త
మత్కృతీశ్వరు నిష్టాప్తి మనుచు గాత"

అని సుబ్బరాయ శతకంలో వేంకట రమణ కవి ఇష్టదేవతా స్తుతిని కొలిచిన తీరు, దైవ సంకల్పం అన్న చిన్నకావ్యంలో 'కాంచీపురేశ్వరీ కాంచికా ప్రాలంబ పృథుదామ నిష్యంద మధువు గ్రోలి, పూతపినాకినీ స్రోతస్వినీ మణీకల్లోల డోలికాకలనదేవి' అని వారు రాసిన పద్యం పూర్వ కవులను గుర్తు చేస్తాయి.

"కమలేందీవర షండ మండిత లసత్కాసార సేవారతిన్
గమికర్మీకృతనైకనీ వ్రతుడనై కంటిన్ విదర్భంబునన్"

అని చెప్పిన శ్రీనాథుడి కంటే కొప్పరపు కవులు తక్కువ కాదని చెప్పడానికి ఈ పద్యం చదివితే చాలు.

"శరడిండీర పటీర శుభ్ర సరసీజాతాచ్ఛ పత్రాధితే

యరసారుట్ శరదబ్ద హీరధర పంచాస్యరవాణీపయ
శ్వర ధీరాభ్ర తరంగిణీ లహరికా సంక్రందనాశ్వక్షపా
కర నికాశ కనత్స్వరూప! త్రిగజత్కళ్యాణ! మల్లీశ్వరా!!"

ఒక శతావధానం అనంతరం పరమేశ్వరుని ప్రార్థిస్తూ చదివిన ఈ పద్యం విన్న వారికి సంస్కృతంలో కూడా కొప్పరపు కవులు శ్రీనాథుడిలా దీర్ఘ సమాసాలతో ప్రవాహ సదృశమైన పద్యాలు ఆశువుగా చెప్పగలరని అర్థమవుతుంది.

"బాల భాను ప్రభాభాసమానములు
శరచ్చంద్ర చంద్రికా రాజితంబు
అపర దిగ్ వ్యాప్త సాంధ్యారాగ రమ్యముల్
క్షీరడిండీర రుచి ప్రతిభము
లబ్దరాగ మణి ఘృణౌఘ సంశ్లాఘ్యముల్
వజ్రమణి ద్యుతి వర్ణితంబు"



అని రాసిన పద్యం నన్నయ్య కవిత్వాన్ని తలపింపక మానదు.

శతావధానాలను ప్రారంభించే ముందు కొప్పరపు కవులు ఆశువుగా ఇష్టదేవతాస్తుతి చేస్తూ చదివిన పద్యాలు భాగవతంలో పోతన చేసిన ఇష్ట దేవతా స్తుతి పద్యాలను గుర్తు చేయక మానవు.

"ఎవ్వని నమ్మి దేశముల కెంతయు బోయ జయంబు గంటిమో
ఎవ్వని నమ్మి ఈ సభ నహీన ధృతిన్ జరగించుచుంటిమో
ఎవ్వని నమ్మి ఏమిటనొకింతయు సందియమందకుంటిమో
ఎవ్వర కీర్తి శాలి పవనాత్మజు డేలుత మిమ్ము మమ్మునున్"

అని వారు చేసిన ఆంజనేయస్తవము పోతన 'ఎవ్వనిచే జనించు.. ' అన్న పద్యమును తలపిస్తుంది. వారు పంగిడి గూడెము శతావధానంలో ఆశువుగా చెప్పిన ఇష్ట దేవతా ప్రార్థనలో జగదీశ్వరి స్తవం చదివిన వారికి పోతన తప్పక గుర్తుకు వస్తారు.

"నీలాంబుజారామ కేళీమరాళమై
సామేన శంకర స్వామి వెలయఁ
బవలు రాతిరి సేయు భద్రతాటంకముల్
దరహాస రుచి ధగ ధగ వెలుంగఁ

త్రయ్యంతవేణి పద్మజరాణి, హరి రాణి
చెలికారమునఁ గెలంకుల మెలంగఁ
గెంగేలి రాచిల్క క్రీడార్ధమెసరేఁగి
ప్రణవాక్షరార్ధ ముపన్యసింపఁ

గప్రముక్తాఫలామల గగనవాహి
నీ పయఃకణపంక్తి వందే యటంచు
విఘ్నపతి పూజన మొనర్ప విశ్వభరణ
దీక్ష నెలకొన్న దేవి కిదే నమస్సు"

ఆంజనేయుని స్తుతిస్తూ మరో సభలో వారు చదివిన పద్యం-
"ఎవని శౌర్యము విన్న నెడదలో జెయివెట్టి
కలచి నట్టడలు రాకాసి మూక
ఎవ్వాని నుడివిన నెల్ల గంధర్వ కి
న్నర సురనాయకుల్నుతుల్ సేతు
రెవ్వాని సడిగన్న నెల్ల భూతాదిక
గ్రహము లెల్లపుడు జీకాకు జెందు"
ఈ పద్యం చదివిన వారికి మహాభారతంలోని విరాటపర్వంలో
"ఎవ్వాని వాకిట నిభమద పంకంబు
రాజభూషణ రజోరాజినడఁగు
నెవ్వాని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపు గఱపు.."
అంటూ తిక్కన రాసిన పద్యాన్ని గుర్తు చేయక మానదు.

"నానా సూన వితాన సంపదల నానందంబు సంధించుచున్" అని బాపట్ల శతావధానంలో చదివిన పద్యం విన్నవారికి నంది తిమ్మన రచించిన "నానాసూన వితాన వాసనల నానందించు సారంగ మేలానన్నొల్లదటంచు.." అన్న పద్యం జ్ఞాపకం వస్తుంది.

విశ్వనాథ సత్యనారాయణ రామాయణ కల్పవృక్షం రాసి రామాయణానికి తెలుగు సాహితీ వన్నెలద్దారు. కొప్పరపు కవులు కూడా రామాయణం పూర్తిగా రాసి ఉంటే మరో అద్భుతమైన రామాయణ కావ్య సృజన జరిగేదనడంలో సందేహం లేదు. 1912 మే లో కాకినాడలో శ్రీగంజాం వేంకట రత్నం పంతులు గారి ద్వితీయ పుత్రికా కల్యాణ మహోత్సవ సమయంలో కొప్పరపు సోదర కవులు సీతాకళ్యాణాన్ని

ఆశు ప్రబంధంగా చెప్పారు.

విశ్వామిత్రుడి ప్రభావం గురించి వసిష్టుడు దశరథుడికి వర్ణిస్తూ చెప్పిన పద్యం ఇది.

"చటుల తపోగ్నిచే జగమెల్ల నుడికించు
భవ్యమౌ బ్రహ్మర్షి పదవి గాంచె
మేనకాంగన తోడ మేనొక్కటిగ చేసి
వలనొప్పగా శకుంతలను గాంచె
స్వర్గంబునకు ప్రతి స్వర్గంబు నిర్మిచి
యట త్రిశంకు మహేంద్రు నట్టులుంచె
గారాని దొసగుల గావించి దయనించి
యల హరిశ్చంద్రుని ఖ్యాతు జేసె
బ్రహ్మ దిమ్మని, దిమ్మని బమ్మగాగ
సేయనేర్పుగ లాడు కౌశికుడి తండు
చండకోపుడు, సకలాస్త్ర శస్త్రవేది
వీని కోరిక దీర్చు మర్వీ కళత్ర!"



రాముని గళమున సీతా గజ పుష్పమాల వేసే దృశ్యాన్ని వర్ణిస్తూ కొప్పరపు కవులు గజము అనే పదంతో ఎలా ఆడుకున్నారో చూడండి.

"గజ దనుజ వైరి ధనువున్
గజిబిజి లేకుండ విరిచి ఖ్యాతింగను నం
గజమూర్తి రాము గళమున
గజ సుమ దామంబు వైచె గజగమన తగన్"

కొప్పరపు కవులు ఏ సభకు వెళ్లినా వేలాది మంది వారి పద్యాలు వినేందుకు సాహితీ ప్రియులు హాజరు కావడమే, వారు పద్యాలను జనరంజకంగా అల్లగలరన్న విషయాన్నినిరూపిస్తుంది. పోలవరం జమీందారు ఏర్పాటు చేసిన మరో సభలో కొప్పరపు కవులు 'భీష్మ జననం' గురించి చదివిన పద్యాలు విన్న వారికి వారు మహా భారతాన్ని పూర్తిగా రాసి ఉంటే అది చరిత్రలో నిలబడేదన్న అభిప్రాయం కలిగి ఉంటుంది. నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱన ముగ్గురూ కలిసి శ్రీమదాంధ్ర మహా భారతాన్ని 21,507 పద్యాలతో పూర్తి చేశారు. అందుకు మూడు

శతాబ్దాల సమయం పట్టింది. లక్షలాది పద్యాలనే ఆశువుగా చదివిన కొప్పరపు కవులు తలుచుకుంటే మహాభారతాన్ని అవలీలగా అనతి కాలంలోనే రాసి ఉండేవారని చెప్పవచ్చు.



భీష్మ జననములో శంతనుడు చూసిన గంగా సౌందర్యాన్ని కొప్పరపు కవులు ఆశువుగా వర్ణించిన తీరు చూడండి.

"పున్నమి జాబిల్లి బోలు నెమ్మొగమును
కలువ రేకుల మించి కన్నుగవయు,
నీలంపు సరుల నంజాలు ముంగురులును
దిమిరంపు రాశిని దెగడు కొప్పు,
తళుకుటద్దముల గాల్దన్ను నున్జెక్కులు
కలదు లేదను భ్రాంతి గొలుపు కౌను,
ఇసుక తిన్నెల గోట నెగమీటు పిరుదలు
లే యనంటుల గేలి సేయు తొడలు
విలసిలగ నొక్క వెలదియై విమల రత్న
ఘటిత కాంచన భూషణ కలిత యగుచు
మదన మంత్రాధిదేవత మాడ్కి దనరు
జాహ్నవిని గాంచి మోహించె శంతనుడు"

జాహ్నవిని మదన మంత్రాధి దేవత అని వర్ణించడం కొప్పరపు కవులకే చెల్లింది!

కొప్పరపు కవుల కావ్యధార గురించి ఎంతైనా రాయవచ్చు.

"వెన్నెల, వయస్సు, నైశ్వర్యము న్నిలువక
భ్రాంతి గలిగించి యురికించు భావరథము
బ్రాజ్ఞుడెరిగి చరింప నాపదలు రావు
సగుణ సముదాయ పున్నయ్య సుబ్బరాయ!!"

అని సోదర కవుల్లో ఒకరు అన్నట్లు స్థిత ప్రజ్ఞులకు ఏది స్థిరంగా ఉంటుందో బాగా తెలుసు. అందుకే వారు తెలుగు సాహిత్యంలో శాశ్వతంగా నిలిచిపోయారు.

ప్రత్యేక వ్యాసం

# నిత్య స్మరణీయులు కొప్పరపు సోదరకవులు



- డా. మేడసాని మోహన్
ప్రముఖ అవధాని, కవి, పండితుడు

1971-72 ప్రాంతంలో నేను చిత్తూరు జిల్లా చంద్రగిరి ఉన్నత పాఠశాలలో పదవ తరగతి చదువుతూ ఉన్నాను. ఎనిమిది తొమ్మిది తరగతులలో ఉండగానే పడిన బాల్యచాపల్యం కొద్దీ చిన్న చిన్న పద్యాలు వ్రాయడానికి ప్రయత్నించే వాణ్ణి. నేను వ్రాసిన పద్యాలను ఆనాటి మా తెలుగు ఉపాధ్యాయులకు చూపించేవాణ్ణి. నాటి ఉపాధ్యాయులలో పూజ్యులు శ్రీ నారాయణ శాస్త్రి, శ్రీ గురుస్వామి వర్మ, శ్రీ బైరెడ్డి చంగయ్య, శ్రీ వై.కె.వి.యన్. ఆచార్య ప్రభృతులు. నేను ఏ కంద పద్యాలో, తేటగీతులో, ఆటవెలదులో వ్రాసి వారికి చూపించినపుడు ఎంతో ముచ్చట పడేవారు. ఆ రోజుల్లో ఆయా ఛందోలక్షణాలు తెలుసుకొని పద్యరచన చేసేవాణ్ణి కాదు.కేవలం పాఠ్యపుస్తకాలలో ఉన్న తెలుగు పద్యాలు ధారణ చేసి, అందులోని లయాత్మక గమనాన్ని గుర్తుపెట్టుకుని, తదనుగుణంగా పద్యమల్లే ప్రయత్నం చేసేవాణ్ణి. అలా అల్లిన పద్యాలలో అక్కడక్కడా కొన్ని స్ఖాలిత్యాలు దొరలు తుండేవి. ఆ స్ఖాలిత్యాలను మా గురువులు దిద్దేవారు. పద్య రచనపై నాకు గల జిజ్ఞాసను గుర్తించిన నాటి మా గురువులు నాడు నేను ధారాశుద్ధిగా పద్యం వ్రాయడానికి తగిన ఛందోవ్యాకరణ రీతులు శ్రద్ధతో నేర్పించినారు. ఆ మహానుభావుల వాత్సల్యపూర్వక ప్రబోధమే భవిష్యత్తులో నేనొక అవధాన కవిగా ప్రసిద్ధి వహించడానికి పునాదిగా నిలిచింది.ఆ ప్రబోధనా ప్రభావంతో ఆశువుగా పద్యాలనల్లే ప్రయత్నం చేసేవాణ్ణి.

ఒకసారి నేను తొమ్మిదవ తరగతి చదువుతుండగా మా తెలుగు ఉపాధ్యాయుడు ఏదో పాఠం చెబుతూ చెబుతూ, మధ్యలో నన్ను లేపి హఠాత్తుగా నాకు శివుడు కనిపిస్తే, నా మనస్సు ఎలా స్పందిస్తుందో ఒక పద్యం ఆశువుగా చెప్పమన్నారు. అప్పుడే క్రింది పద్యం చెప్పినట్టు నాకు బాగా గుఱుతు..

"నీ మెడలో కనిపించెడి
పామును చూడగనే నేను పరుగెత్తెదనే
నీ మూర్తి పూర్తిగ గని
నా మనమున బెదరకుందునా! హర! శంభో!"

అని చెప్పిన వెంటనే మా ఉపాధ్యాయుడు ఎంతో పరవశించి ఆశీర్వదించినాడు. నేను పదవతరగతి పరీక్షలు వ్రాసి, జూనియర్ కళాశాల విద్యార్థిగా మారుతున్న తరుణంలో మా ఉపాధ్యాయులు నాపై ప్రత్యేక శ్రద్ధ వహించినారు. నాకోసం చంద్రగిరి ఉన్నత పాఠశాల గ్రంథాలయానికి తిరుపతి వేంకటకవుల "నానా రాజ దర్శనము", "శతావధాన సారము", కొప్పరపు సోదరకవుల శతావధానములకు సంబంధించిన పుస్తకాలు తెప్పించినారు. అలా ఆ పుస్తకాలను తెప్పించడానికి నాటి ప్రధానోపాధ్యాయులు శ్రీమాన్ పై.కె.వి.యన్. ఆచార్య గారు ఎంతో చొరవ చూపించినారు. ఆ పుస్తకాలను ప్రాథమికంగా ఒకసారి చదివినాను. మా ఉపాధ్యాయులు కూడ ఆ పద్యాలలో కొన్ని ధారాశుద్ధిగా, చమత్కారబంధురంగా ఉండే పద్యాలు నాతో ధారణ చేయించినారు. అప్పుడు నా పరిశీలనాధ్యయనంలో నేను గుర్తించిన అంశాలు ఇలా పేర్కొనడం ఔచిత్యంగా భావిస్తాను.

1. తిరుపతి వేంకటకవుల పద్యాలు అలతియలతి పదాలతో సాగిపోతూ, తేలికగానే అర్థమౌతాయి.

2. వీరు విశేష ఛందస్సుల పట్ల పెద్దగా దృష్టి పెట్టేవారు కాదు. చాలా వరకు ప్రసిద్ధ మార్గ,దేశి ఛందస్సులే చెప్పేవారు.

3. కొప్పరపు సోదరకవుల పద్యాలు చాలా వరకు సామాసికచాలనం, ధారాశుద్ధి, చిక్కదనం కలిగి ఉండేవి.

అప్పటి గురువులు నాకు ప్రత్యేకముగా బోధన చేసిన అంశం ఏమిటంటే... కొప్పరపు సోదరకవుల అవధానాలలో పద్యం వేగంగా చెప్పేవారని, నేను కూడా

> "అప్పటి గురువులు నాకు ప్రత్యేకముగా బోధన చేసిన అంశం ఏమిటంటే... కొప్పరపు సోదరకవుల అవధానాలలో పద్యం వేగంగా చెప్పేవారని, నేను కూడా అటువంటి ధారావేగాన్ని అలవరచుకోవాలని ప్రబోధించేవారు."


కొప్పరపు సోదరకవులు

అటువంటి ధారావేగాన్ని అలవరచుకోవాలని ప్రబోధించేవారు. నేను ఆ దిశగా నా వంతు కృషి నిర్విరామంగా కొనసాగించినాను. ఆ కొనసాగించడంలో ప్రప్రథమంగా కొప్పరపు సోదరకవుల పద్యాలు ధారణ చేయడంతో ప్రారంభించినాను. ఆ అవధాన సభా ప్రారంభంలో ఇష్టదేవతా స్తోత్రంగా సరస్వతీదేవి స్తుతిగా ఒక పద్యం నిర్మించుకోవడానికి ఆదర్శంగా స్వీకరించినాను.

''నీలాంబుజారామ కేళీమరాళమై
సామేన శంకరస్వామి వెలయ
పవలు రాతిరి సేయు భద్రతాటంకముల్
ధరహాసరుచి ధగధగ వెలుంగ
త్రయ్యంతవేణి పద్మజురాణి హరిరాణి
చెలికారమున కెలంకుల మెలంగ
కెంగేలి రాచిల్క క్రీడార్థ మెసరేగి
ప్రణవాక్షరార్ధముపన్యసింప
కమ్రముక్తా ఫలామల గగనవాహి
నీ పయఃకణపంక్తి వందేయటంచు
విఘ్నపతి పూజనమొనర్ప విశ్వభరణ
దీక్ష నెలకొన్న దేవికిదే నమస్సు''

పై పద్యాన్ని సముచితంగా అధ్యయనం చేసిన తర్వాత అప్పటికి నాకున్న యోగ్యతా స్థాయిలో నేను సరస్వతీదేవి ప్రార్థనగా ఈ క్రింది పద్యం రచించుకున్నాను.

''ఏ దేవి సుకుమార పాదాబ్జ మకరంద
మమరద్రుమంబుల కమరు ధార
ఏ లేమి బంగారు చేలంపు గుచ్చెళ్లు
దేవాళి మకుట సందీప్తలహరు

లే తల్లి వదంనాంబుజాతంబు శాశ్వత్క
ళాహాసవిన్యాస దోహదంబు
నే చాన చనుదోయి ప్రాచుర్య సంగీత
సాహిత్య విద్యావిశాల హర్మ్య
మమ్మహాదేవి విశ్వవిశ్వాతరాళ
సర్వ మానవాభ్యుదయ సంస్కార సార
సంతతానుగ్రహ ప్రభాజాల! హేల!
భారతీదేవి మన్మనో భద్ర యగుత''

ఈ పద్యం చూచి ఆనాడు మా తెలుగు ఉపాధ్యాయులందరూ ఆనందించినారు.

ఉన్న పళంగా ఆశువుగా చెప్పిన పద్యాలలో కూడ ఆలంకారికమైన ఊహల పోహళింపు, ప్రాబంధిక శైలీ విన్యాసం, శిల్పబంధురమైన సామాసిక చాలన, అనర్గళ ధారాశుద్ధితో కూడిన శబ్దభావ సమ్మేళనం.. ఇత్యాది అంశాలతో కూడిన కొప్పరపు సోదరకవుల పద్యాలు గుభాళిస్తూ ఉండేవి. ఇందులో ఒక్కొక్క అంశానికి ఉదాహరణలిస్తూ కొప్పరపు సోదరకవుల సాహితీవైభవం, ఆశుకవితా ప్రస్థానాన్ని విశదీకరిస్తూ పోతే, ఒక సిద్ధాంత వ్యాసం నిర్మాణమౌతుంది. ఉదా॥ గుంటూరు శతావధానంలో ''తల వెంట్రుక''పై ఆశువుగా చెప్పిన ఒక స్రగ్ధరావృత్తాన్ని పేర్కొంటాను..

> కొప్పరపు సోదరకవుల సాహితీవైభవం, ఆశుకవితా ప్రస్థానాన్ని విశదీకరిస్తూ పోతే, ఒక సిద్ధాంత వ్యాసం నిర్మాణమౌతుంది. ఉదా॥ గుంటూరు శతావధానంలో ''తల వెంట్రుక''పై ఆశువుగా చెప్పిన ఒక స్రగ్ధరావృత్తాన్ని పేర్కొంటాను..

''అంభోజాతాక్షి వేణిన్ హరువు గనిన రోమాతి సౌభాగ్యమెంతే
సంభావింతున్‌పయోముక్సముదయ రుచులున్ స్ఫారరోలంబకాంతుల్
శుంభద్ధ్వాన్తప్రభల్ హెచ్చుగ కొని విధి మెచ్చొప్పుగా కూర్చి యాపై

జంభద్విడ్రత్న రోచుల్ చమిరి యొనరుపన్ జక్కనౌ తీవెయో నాన్"
సారాంశం: సౌందర్యవతి యొక్క కేశపాశములోని తల వెంట్రుక కారుమబ్బుల సమూహం, తుమ్మెదల బారు, ఇంద్రనీలమణుల సోయగాలకంటే అందచందాలు సంతరించుకొని చీకటి వెలుగులు చిమ్ముతూ ఉంది.

విశదల శతావధానంలో "తెల్లు నూగు"ను గూర్చి వీరు ఆశువుగా చెప్పిన మహాస్రగ్ధరావృత్తాన్ని గమనిస్తే, విశేష ఛందస్సుల పట్ల వీరికున్న సాధికారికప్రజ్ఞ విశదమౌతుంది.

స్రగ్ధర వంటి వృత్తాలను ఆశువుగా చెప్పగలగడం ఒక కవితా రూప తపస్సు. అందులోను ఇంత అద్భుత శయ్యా సౌభాగ్య విశేషంతో చెప్పడం వారి పుంభావసరస్వతిత్వమే. వీరి పద్యాలను ధారణ చేసిన అభ్యాసంతో, తరువాత పెద్దన, నంది తిమ్మన, శ్రీనాథ మహాకవి ప్రభృతుల మహాకావ్యాలను చదివి ఆయా పద్యాలను కూడ శ్రద్ధతో కంఠస్థం చేశాను.

విశదల శతావధానంలో "తెల్లు నూగు"ను గూర్చి వీరు ఆశువుగా చెప్పిన మహాస్రగ్ధరావృత్తాన్ని గమనిస్తే, విశేష ఛందస్సుల పట్ల వీరికున్న సాధికారికప్రజ్ఞ విశదమౌతుంది.

"కనమే ఆ తెల్లు నూగున్ గఱకు తనముచే క్రాలి బాధించు చుంటన్
తనువంటన్ మంట తోచున్ దగిలిన యెడ వస్త్రంబులెంతేని పాడౌ
వినలేదద్దాన నీమేల్వలయు ననుచునే విజ్ఞుడుం తెల్ప నెందున్
తనరుం దుర్మార్గుతో నెంతయునది సరిగా తమ్ముడా పోల్కి సేయన్"

సారాంశం: తెల్లు నూగు కఱకుదనంచే అందరినీ బాధిస్తుంది. శరీరానికి సోకితే మంట పుడుతుంది. దీనితో ఫలానా మేలు కలుగుతుంది.. అని ఏ విజ్ఞుడూ పేర్కొనలేదు. ఒక దుర్మార్గునితో ఆ తెల్లునూగును పోల్చవచ్చును.

ఇలా విశదీకరిస్తూ పోతే ఎన్నో ఉదాహరణలు చూపవచ్చు.

నేను 1986 జనవరి మాసంలో విజయవాడ శివరామకృష్ణ కళాక్షేత్రంలో, రోటరీక్లబ్బు ఆధ్వర్యంలో "షోడశగుణిత అష్టావధానము" నిర్వహించినాను. అంటే

**16 అష్టావధానాలు ఏకసమయంలో నిర్వహించడం. ఆ యవధాన ప్రారంభంలో నాటి సభా సంధానకర్త ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు, శాతవాహన కళాశాలలో ఆంధ్రశాఖాధ్యక్షులు శ్రీజంధ్యాల మహతీశంకర్‌గారు.. ఇంకా ఎందరో మహోదయులు పాల్గొన్నారు. వారంతా వారివారి ప్రారంభోపన్యాసాలలో తిరుపతి వేంకటకవులను గూర్చి, కొప్పరపు సోదరకవులను గూర్చి మాట్లాడుతూ ఈ క్రింది కొప్పరపు సోదరకవుల పద్యం చదివినారు..**

**"ఏ యంబ బిరుదంబు లిప్పించె తొలుదొల్త**
**మణికొండ భూపాల మౌళి చేత**
**ఏ దేవి జయఘంటికాదుల నిప్పించె**
**మద్రాసు బుధశిరోమణుల చేత**
**నే తల్లి వేయి నూర్లిప్పించె ఘటికా ద్వయిని పీఠికాపురాధీశు చేత**
**నే మాత జయకేతనవెత్తంగ పతకంబు**
**లిప్పించె పోల నరేశు చేత**
**నే ప్రసువు,భుజగేంద్రాది సుప్రసిద్ధ**
**నృపులచే జయ బిరుదాదు లీయ జేసె**
**నట్టి మదుపాస్య శ్రీ శివాబ్జాస్య నేడు**

**కూర్మి దళుకొత్త జయమొసన గూర్చు గాత!" పై పద్యాన్ని శ్రద్ధగా ఆలకించిన నేను నా అవధాన ప్రారంభంలో దేవతాస్తుతి సందర్భంగా ఈ క్రింది సీస పద్యం చెప్పినాను.**

**"అవధానప్రక్రియ నాచరించు ప్రతిభ**
**విద్యార్థి దశనె ఇప్పించినావు**
**స్నాతకోత్తర విద్య సాగించునాటికే**
**వందలాదిగ సభల్ బఱపినావు**
**అన్నమాచార్య మహామందిరంబులో**
**చక్రవర్తిత్వమొసంగినావు**
**ద్రవిడ కర్ణాటాంధ్ర రాజధానులలోన**
**విహరించు భాగ్యమిప్పించినావు**
**ఎటుల దయజూతు వమ్మ! వాగీశ్వరి! నను**

**షోడశగుణావధాననైస్తుల్య మొసగి**
**శారదా మాత! వాగ్బల సంప్రదాత!''**

**ఆనాడు సభలో పాల్గొన్న పండితులందరూ పై పద్యాన్ని ఎంతో ఆనందించి, ఆమోదించినారు.**

**ఈ విధంగా నా అవధాన ప్రస్థానంలో కొప్పరపు సోదరకవులు ( కొప్పరపు వేంకటసుబ్బరాయకవి, కొప్పరపు వేంకటరమణకవి) నామధేయుల ప్రభావం ఎంతో ఉన్నది.**

**''కమల భవాది దైవత జగత్ స్తవనీయ ధగాయమాన తే**
**జముల హసింప జాలిన ప్రశస్త సుధీప్రతిభా ప్రభాద్యులౌ**
**సుమహితులైన కొప్పరపు సోదర సత్కవులార! మీ పదా**
**బ్జముల మరందపానముల సమ్మతి బొక్క చరింతు నెయ్యెడన్''**



**ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించు గాని**
**దు:ఖితమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్**
**మెతుకువిదల్పదీ భరతమేదిని ముప్పది మూడు కోట్లదే**
**వతలెగవడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తులార్తురే**

**- జాషువా**

# తెలుగు సాహిత్యంలో అనర్ఘరత్నాలు



డా. N.Ch. చక్రవర్తి
హైద్రాబాద్
93999 58069

సముద్రగర్భంలో ఉన్న సంపదలన్నీ తవ్వుకోడం సాధ్యంకాదు. ఆనంతాకాశంలో మెరిసే చుక్కలను గణించడం అసాధ్యం. అలాగే తెలుగు సాహిత్య సాగరంలో ఎన్ని ఆణిముత్యాలు మనం ఏరుకోగలం?? రసాలంకారాలు జాలువార్చి కవులు అమృతపానులై మనను బ్రహ్మానంద సహోదరమైన రసవార్ధిలో తేల్చారు.

టెంకణాదిత్యుడనీ వివేకబ్రహ్మ అనీ పేరుగాంచిన నన్నెచోడుడు 12 వ శతాబ్దివాడని ప్రతీతి. శ్రీశైల ప్రాంతం వాడు. ఈతడి ప్రసిద్ధ రచన కుమారసంభవం. మూలకథ మహాకవి కాళిదాసుది. నన్నెచోడుడు దీనిని తెలుగులో తీర్చిదిద్దాడు. ఈ కవి ప్రబంధమార్గం వేసిన తొలికవి అంటారు. అనంతర కవులు అనేకులకు ఈతడు అనుసరణీయుడు.

అది మారుడు శివునిపై కుసుమాస్త్రాలు సంధించే సందర్భం. అతడిని ఇంద్రుని ప్రేరణ విచక్షణాశూన్యుణ్ణి చేసింది. ఆ విషయం రతీదేవి మాటలను పరిశీలిస్తే మనకు ధ్వనిలో తెలుస్తుంది. రతీదేవి తన భర్తకు నచ్చచెప్పడం అనే కల్పన నన్నెచోడునిది. ఇదొక అందంమైన కల్పన.

ఉ. అతని శరాసనమ్ము కనకాచల మిక్షు శరాసనమ్ము నీ
క, తనికి యమ్ముపాశుపత మంటిన గందెడుపూవుటమ్ము నీ
క, తడుపురాపహారి విరహాతురపాంథ జనాపహారి నీ
వ, తనికి నీకుహస్తిమశకాంతరమెమ్మెయి నెన్ని చూచినన్(1)

ఇవీ రతిమాటలు. ఏనుగంతవాడు అతడు. దోమ నీవు. (హస్తి మశకాంతరము). అతడి విల్లు కొండ (అతడి శరాసనమ్ము కనకాచలము). నీ విల్లు విరిగిపోయే చెరకుగడ(ఇక్షు శరాసనమ్ము నీది). అతడి బాణం పాశుపతం (అతడికి యమ్ము పాశుపతమ్ము) లోకాలను దహించేసే శక్తి కలిగినది. ముట్టుకుంటే అవే కందిపోయే పూవులు నీ బాణాలు(అంటిన కందెడు పూవుటమ్ము నీకు). అతడు త్రిపురాసురుని సహరించినవాడు(అతడు పురాపహారి). విరహంతో వేగిపోయి వెఱ్ఱివాళ్లను బాధించేవాడవు నీవు(విరహాతుర పాంథజనాపహారి నీవు) అని హితం చెప్పి మన్మథునిలో వివేకాన్ని ప్రోదిచేసే ప్రయత్నం చేసింది. ఇందులో హస్తి (ఏనుగు), మశక (దోమ) అంతరం అన్నది ఒక జాతీయము. రామణీయకమైన ఇలాంటి పద్యాలను కొల్లలుగా మనం నన్నెచోడుని రచనలో చూడవచ్చు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో జంటగా కవిత్వం వ్రాసిన కవులు కొద్దిమంది ఉన్నారు. అలాంరివారిలో పింగళి–కాటూరి కవులు పేరెన్నికగన్నవారు. పింగళి లక్ష్మీకాంతం గారు. కాటూరి వేంకటేశ్వరరావు గారు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో జంటగా కవిత్వం వ్రాసిన కవులు కొద్దిమంది ఉన్నారు. అలాంరివారిలో పింగళి-కాటూరి కవులు పేరెన్నికగన్నవారు. పింగళి లక్ష్మీకాంతం గారు. కాటూరి వేంకటేశ్వరరావు గారు. వీరు తమ గురుదేవులైన చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రి గారికి (తిరుపతి వేంకటకవుల లో ఒకరు) అంకితం ఇస్తూ 'సౌందరనందము' అనే కావ్యాన్ని రచించారు. ఇది బౌద్ధ సంబంధ కథలలో ఒకటైన సుందరీ నందుల ప్రణయగాథ. విరహగాథ. వీరి శైలి రసాత్మకం. సుమధురం.సులలితం. ఈ కావ్యం బౌద్ధకథ కనుక తత్సంబంధ పద్యాన్ని చూద్దాం

సీసం. ఛాగమ్ముమెడకు గసాయికత్తికి మధ్య
వెసజొచ్చి ప్రేటు తప్పించువారు
మాలపల్లెల కేగి మంచిమాటలు చెప్పి
దేహశౌచమ్ము బోధించువారు
దూరతఃపరిహృత దుర్గంధ కుష్ఠ దే

హుల కుపచారముల్ సలుపువారు
ఆప్తవియోగ సంతప్తుల కూరట
చెప్పి విరక్తి శిక్షించువారు

తేగీ. నాడునాటికి బదులు వందలుగ జేరు
జనములకు ధర్మదీక్ష లొసంగువారు
నౌచు దిరుగుచునుందు రత్యంత సత్య
ధర్మశీలురు దేవదూతలవిధాన.(2)

బౌద్ధభిక్షువుల సమాజాసేవలు ఇందులో రేఖామాత్రంగానైనా సమగ్రంగా వర్ణించబడ్డాయి. ఏ మతానికి అయినా సమాజసేవ మానవసేవ అన్నది మానవీయ ధర్మం. ఆ కనీస ప్రాథమిక ధర్మాన్ని విడిచిన ఏ మతమూ సమ్మతము కాదు. మనుషుల ప్రాణాలు తీయుమని ఏ మతమూ ఎప్పుడూ చెప్పదు. 'ఛాగమ్ము మెడకు గసాయికత్తికి మధ్య వెసజొచ్చి ప్రేటు తప్పించువారు', అంటే మేక మెడకూ కసాయి కత్తికి నడుమ చెయ్యిపెట్టి హింసను ఆపేవారు కొందరు. అంటే, కాపాడడంలో తమ చెయ్యి తెగినా పర్వాలేదు అన్న త్యాగశౌర్యం. ఇది నేరుగా ఉండదు. గోప్యంగా ఉంటుంది. దీనజన సముద్ధరణ ఒక కోణం. దళితవాడలకు పోయి వారిలో చైతన్యాన్ని నింపే విభాగంలో కొందరు భిక్షువులు.

> బౌద్ధభిక్షువుల సమాజాసేవలు ఇందులో రేఖామాత్రంగానైనా సమగ్రంగా వర్ణించబడ్డాయి. ఏ మతానికి అయినా సమాజసేవ మానవసేవ అన్నది మానవీయ ధర్మం.

దూరతః పరిహృత దుర్గంధ కుష్ఠ దే
హుల కుపచారముల్ సలుపువారు

దుర్గంధ భూయిష్టములు అయిన కుష్ఠ రోగులకు సేవలుచేసేవారు కొందరు. స్థితప్రజ్ఞులు అయితే తప్ప ఆ కంపు భరిస్తూ తమకు అంటుతుందనే భయాన్ని విడిచి సేవలు చెయ్యలేరు.

ఆప్తవియోగసంతప్తుల కూరట
చెప్పి విరక్తి శిక్షించువారు

ఆప్తులను పోగొట్టుకొని విషాదం లో కూరుకున్న వారిని ఓదార్చేవారు కొందరు. విరక్తిని శిక్షించడం అనడం ఒక చమత్కారం.

నాడునాటికి బదులు వందలుగజేరు
జనములకు ధర్మదీక్ష లొసంగువారు

బుద్ధుని మహిమకు బోధకు ఆకర్షితులై వందలూ వేలుగా వచ్చి చేరుతున్నారు అని చెప్పడం. వారికి దీక్ష ఇవ్వాలి. ఆ దీక్షలు ఇవ్వడంలో ఊపిరి సలపకుండా కొందరు ఉన్నారు. ఈ విధంగా భిక్షుల సేవలు సమాజంలో బహుముఖీనంగా విస్తరించి ఉన్నాయి. పద్యంలో చివర 'దేవదూతల విధాన' అన్నది ప్రధానం. దేవదూతల్లాగా ఉన్నారట వీళ్ళు. వీళ్ళు ఎవరిదూతలు?? బుద్ధుని సైన్యం కనుక బుద్ధుడే సాక్షాత్తూ భగవంతుడు అని ధ్వనిలో సూచన. ఇది గొప్పకవుల శైలి. వారు వ్రాసుకుంటూ పోతారు. మనం ఏరుకుంటూ పోవాలి. ఇలాగ ఈ కావ్యం అంతా లలిత మనోహరంగా సాగుతుంది.

> ముందే మనం చెప్పుకున్నట్టు తెలుగు వాఙ్మయం లో శతకాలకు సముచిత స్థానం ఉంది. భక్తి, వైరాగ్య, శృంగార, నీతి, వ్యంగ్య శతకాలు ప్రసిద్ధాలు. ఇందులో మళ్ళీ ఒకదానిలో ఒకటి మిళితమై ఉన్నవీ ఉన్నాయి.

ముందే మనం చెప్పుకున్నట్టు తెలుగు వాఙ్మయం లో శతకాలకు సముచిత స్థానం ఉంది. భక్తి, వైరాగ్య, శృంగార, నీతి, వ్యంగ్య శతకాలు ప్రసిద్ధాలు. ఇందులో మళ్ళీ ఒకదానిలో ఒకటి మిళితమై ఉన్నవీ ఉన్నాయి. అష్టదిగ్గజాల్లో ఒకరైన ధూర్జటి కవి కర్తృకమైన శ్రీ కాళహస్తీశ్వరశతకం సాహిత్య విశేషాలతో అలరారుతున్నది. రాజాస్థానంలో ఉన్నా ఈతడు రాజుల మదాన్నీ వారి కొలువులనూ నిరశిస్తూ ఎన్నో వ్రాసిన ధీరకవి.

మ. ఒకరింజంపి పదస్థులైబ్రతుక తామొక్కొక్క రూహింతు రే
లకొ? తామెన్నడుజావరో? తమకు బోవో సంపదల్? పుత్రమి
త్ర కళత్రాదులతోడ నిత్యసుఖమందంగందురో?యున్న వా
రికి లేదో మృతి యెన్నడున్ గటకటా! శ్రీ కాళహస్తీశ్వరా!(3)

పైన చెప్పిన ఒక ప్రధాన దుర్గుణం పాలకులదే. చంపడాలూ పదవులు ఆక్రమించడాలూ అవీ వారి పనే. దాన్ని తీవ్రంగా నిరశించాడు ఈ పద్యంలో.

'ఒకరింజంపి పదస్థులై బ్రతుక తామొక్కొక్కరూహింతురేలకొ?' ఒకరిని చంపి ఆ గద్దెలను తాము ఎక్కాలని కొందరు అనుకుంటూ ఉంటారేమిటి?? 'తామెన్నడు బోవరో? తమకు బోవో సంపదల్?' తాము మాత్రం పోరా?? సంపదలూ పోవా?? 'పుత్రమిత్ర కళత్రాదుల తోడ నిత్య సుఖమందంగందురే?' భార్యాపిల్లలతో శాశ్వతంగా సుఖాలు అనుభవిస్తూ ఉంటారా?? అయ్యో!అయ్యయ్యో! అని గుండెలు బాదుకునేంత ఆవేదన చెందుతాడు. కవి ఒక్క పద్యం ద్వారా గతకాల చరిత్రనూ తానున్న కాలపు పరిస్థితులనూ కూడా ధ్వనింపచేస్తాడు. వాస్తవాలను అవి కఠినాలైనా నిక్కచ్చిగా చెప్పడమే సుకవుల లక్షణం. 'ఏదేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం?' అని ఒక కవి ఆవేదనకు పై పద్యంలోని సంగతులే మూలం. ఈ రీతి ప్రాచీన శతక పద్యాలు ఎన్నెన్నో.

ఆధునిక కవుల్లో ఒకరైన మరుమాముల దత్తాత్రేయ శర్మ గారు రచించిన శతకం పుస్తకపాణి శతకం. ఇందులో కవి సందేశం చూద్దాం.

కం. అక్షరలక్షలు గలిగిన
కుక్షికి దృప్తియె కలుగదు కూర్చొని తినగా
నక్షయ సంపదతరుగున్
మోక్షాపేక్షయె సురక్ష పుస్తకపాణీ!(4)

ఎంతచదువున్నా ఎంతసంపద కలిగినా కూర్చుని తింటుంటే ఎంతసంపద అయినా తరగిపోతుంది. కూర్చుని తింటే కొండలైనా కరిగిపోతాయి అనేకదా పెద్దల మాట. కళ్ళముందు చూస్తున్నాం కదా!! పనిచేసేవాళ్లు లేకుండాచేసి కూర్చోబెట్టి మేపితే సమాజపు ఆర్థిక స్థితిగతులు ఎలా తలక్రిందులు అయిపోతాయో!! వీటినుండి మోక్షాపేక్ష ఒకటే రక్షిస్తుంది అని కవి సూచన. మోక్షాపేక్ష అనగానే మనవాళ్ళు నిరామయం గా ఏ పనీ చెయ్యకుండా ఉండడం అనుకుంటారు. కానే కాదు. మోక్షార్థియై త్యాగయ్య 32 వేల కీర్తనలు వ్రాసి సమాజానికి అమూల్య సంపదను అందించాడు.

ఆధునిక కవుల్లో ఒకరైన మరుమాముల దత్తాత్రేయ శర్మ గారు రచించిన శతకం పుస్తకపాణి శతకం. ఇందులో కవి సందేశం చూద్దాం.

కైవల్యాన్ని కోరి పోతన సాటిలేని భాగవత సాహిత్య సంపదను మనకు అందించాడు. రామ సన్నిధిని కోరి గోపన్న గుడిగోపురాదులు నిర్మించి శతకాన్నీ కీర్తనలనూ మనకు పంచిపెట్టాడు. నిజమైన మోక్షార్థులంటే ఇలాంటి మహనీయులు. వారిని ఆదర్శంగా తీసుకోవాలి. కవి అంతరాత్మను పాఠకుడు పట్టుకోగలగాలి.. అప్పుడే సత్సాహిత్యంలోని రసాన్ని మనం క్రోలగలం.

“కైవల్యాన్ని కోరి పోతన సాటిలేని భాగవత సాహిత్య సంపదను మనకు అందించాడు. రామ సన్నిధిని కోరి గోపన్న గుడిగోపురాదులు నిర్మించి శతకాన్నీ కీర్తనలనూ మనకు పంచిపెట్టాడు. నిజమైన మోక్షార్థులంటే ఇలాంటి మహనీయులు.”

ప్రసక్తానుప్రసక్తంగా ఆధునికంగా వస్తున్న శతకాల తీరుతెన్నులు ఎలా ఉన్నాయో చెప్పుకుందాం. కవి అంటేనే కవిత్వం వ్రాసేవాడు అని. కవిత్వం అంటే ఏవో నాలుగు ముక్కలు అటూ ఇటూ వ్రాయడం కాదు. గురులఘువులకు నుడులు కిట్టించడం కానేకాదు. రసాలంకార శోభితమై పదగుంఫనాలతో శోభిల్లేది కవిత్వం. నవనవోన్మేషంగా సాగాలి సుకవిత్వం. ఇప్పుడిప్పుడే కొత్తగా వ్రాస్తున్నవారిలో అనేకులు అధ్యయనమూ, కనీస పాండిత్యమూ లేకుండా వ్రాస్తున్నారు అని చెప్పక తప్పదు. కొందరు ప్రతిభాశాలురు లేకపోలేదు. వారి శతకాల్లోనూ ప్రత్యేకతలు లేకపోలేదు. అది అరుదుగా కనిపిస్తున్నది. వేమన పద్యాలనో లేదా సుమతీ శతకాన్నో వీరు చూసి అందులో ఎంత క్లిష్టత ఉన్నదో లేదా విషయాన్ని ఎంత వైవిధ్యంగా చెప్పారో గమనించక “ఓస్ ఇంతేనా శతకం అంటే” అని తేలికగా తీసుకుంటున్నారు అనిపిస్తుంది. అందులో పండిన అలంకారాలూ బింబప్రతిబింబత్వాలూ ప్రకృతిసిద్ధమైన ప్రతీకాదులను ఎంత అందంగా చెప్పారో గుర్తించినట్లు తోచదు. కొందరు ఏమాత్రం వైవిధ్యం లేకుండా చెప్తున్నారు. కొందరు పూర్వులు చెప్పినవే తాము చెప్పినట్లు మళ్ళీ మళ్ళీ చెప్తున్నారు.ఇవి అన్నీ సరే. యతులూ గురులఘువుల సంపూర్ణం గా తెలియనివారు శతకాలపై శతకాలు వ్రాసి వదలుతున్నారు. ప్రస్తుత కాలంలోని ఈ ధోరణులు భాషకూ తెలుగు కవిత్వానికీ దైన్యస్థితిని కలిగిస్తున్నాయి.

సామాజిక మాధ్యమాల వల్ల ఎంత మేలు ఉందో అంతే కీడూ జరుగుతున్నది. నేర్చుకుందాం అనుకునే తపన ఉన్నవారు బహుతక్కువ. అలా అనుకునేవారికి సరిగా నేర్పేవారూ లేరు. ఈ నేపథ్యంలో తాము వ్రాసిందే పద్యం అన్నట్లుగా ఉన్న స్థితి నెలకొని ఉంది. అనేకులు సామాజిక సమస్యలు తీసుకుని వ్రాసే ప్రయత్నం చేస్తున్నారు. అది ఆహ్వానించదగిన పరిణామం. దీనికి తోడు అవార్డులూ రివార్డులూ పోటీలూ బహుమతులూ ధ్రువపత్రాలతో సాహిత్య బృందాలు నిండిపోతున్నాయి; చాలా వెగటు పుట్టించి ఆవేదన కలిగిస్తున్నాయి. ప్రమాణం కాని శతకాలు పుట్టుకుని వస్తున్నాయి. వీటి గురించి భాషాభిమానులూ పాఠకులూ సాహిత్యపిపాసులూ ఆలోచించవలసిన అవసరం ఉన్నది. అలా కానినాడు రసహీనమైన వ్రాతలకు (ఎందుకంటే కవిత్వం అనడానికి వీలు లేదు కనుక) తెలుగు ఆలవాలం అయిపోతుంది. అదే సమయంలో, బిగువుగా మంచి కవిత్వాన్ని వ్రాస్తున్న వర్ధిష్ణువులూ కొద్దిమంది ఉన్నారు. వారి ప్రతిభనూ అధ్యయన శీలాన్నీ కవిత్వాన్నీ చెప్పుకుని తీరాలి. భుజంతట్టి వారితో వ్రాయించాలి. విదేశాల్లో స్థిరపడిన కొందరు తెలుగువారు చక్కని పరిజ్ఞానంతో వ్రాస్తున్నవారూ ఉన్నారు. ఇందుకు ఆనందించవలసినదే. కనుక మనను మనం ఒకసారి సమీక్షించుకుందాం. ఎక్కడ ఉన్నామో తెలుసుకుందాం.

> "సామాజిక మాధ్యమాల వల్ల ఎంత మేలు ఉందో అంతే కీడూ జరుగుతున్నది. నేర్చుకుందాం అనుకునే తపన ఉన్నవారు బహుతక్కువ. అలా అనుకునేవారికి సరిగా నేర్పేవారూ లేరు."


సూచికలు:

*1. నన్నెచోడుని కుమారసంభవకావ్యం. యువభారతి ప్రచురణ 1976.

*2. పింగళి కాటూరి కవుల సౌందరనందం.కాటూరికవితాలత పబ్లిషర్స్ 1967.

*3. శ్రీ కాళహస్తీశ్వరశతకం విక్టరీ పబ్లిషర్స్ 2008.

*4. మరుమాముల దత్తాత్రేయశర్మ గారి పుస్తకపాణి శతకం శ్రీరామసిద్ధాంతి ప్రచురణలు 2020.

# బహుముఖ ప్రజ్ఞాశాలి అడివి బాపిరాజు



- ఆచార్య వెలమల సిమ్మన్న
విశ్రాంత ఆచార్యులు
విశాఖపట్నం
94406 41617

"ఆయన అజాతశత్రువు
ఆయన మూర్తి సుకుమారం
ఆయన హృదయం సుమ కోమలం
ఆయన వాక్కు నవనీత సమానం
ఆయన మనస్సు వెన్నలాంటిది
ఆయన కీర్తి హిమాలయ శిఖరం
ఆయన వ్యక్తిత్వం మహోన్నతమైంది
ఆయన విజ్ఞానం సర్వతోముఖమైంది
ఆయన ప్రతిభ బహుముఖమైంది"

*- దేవులపల్లి రామానుజరావు*

తెలుగు సాహిత్య చరిత్రలో ఆధునిక యుగానికి విశిష్ట స్థానముంది. ఎంతోమంది మేధావులకు నిలయమైన యుగమిది. ఈ యుగంలో కవులు, కథకులు, నవలాకారులు, వ్యాసకర్తలు, పండితులు, విమర్శకులు, భాషాశాస్త్ర కోవిదులు తెలుగు సాహిత్య క్షేత్రంలో బంగారు పంటలు పండించారు. అట్టివారిలో బాపిరాజొకరు. వీరు 8 అక్టోబరు 1985లో జన్మించారు. "కలకలలాడే ఆ ముఖము, కళలు విరజిమ్మే ఆ కళ్ళు, బుద్ధి చాతుర్యాన్ని చాటే ఆ విశాల ఫాలమూ, నల్లని ఆ జుట్టు, నెమ్మదిగా నర్తించే ఆ పెదవులు, చెక్కిళ్ళపై ప్రసరించే

ఆ చిరునవ్వు, ఆ ఖద్దరు సిల్కు లాల్చీ, ఆ పొందూరు ఖాదీ ధోవతి, ఎడమ చేతి ప్రాణ ప్రదమైన ఆ పాటల పుస్తకం, ఎడతెగని ఆ ఉత్సాహశీలం ఆ అమాయకపు మహోల్లాసం ఆ మధుమూర్తి బాపిరాజు" అని బుద్ధవరపు కామరాజు అన్నారు.

ఒకరు కవిగా పేరుగాంచవచ్చు, ఒకరు కథా రచయితగా ప్రసిద్ధి చెందవచ్చు, ఒకరు నవల రచయితగా విఖ్యాతి పొందవచ్చు, ఒకరు వ్యాసకర్తగా ఆరితేరవచ్చు, ఒకరు పత్రికా సంపాదకులుగా మంచి పేరు సంపాదించవచ్చు. ఒకరు శిల్పంలో నిష్ణాతులై యుండవచ్చు. ఒకరు చిత్రలేఖనంలో తమ నైపుణ్యాన్ని చూపించవచ్చు. ఒకరు నాట్యాచారులుగా రాణించవచ్చు, ఒకరికి సంగీతంలో అభినివేశముండవచ్చు, మరొకరు చిత్తకళాదర్శకులుగా పేరుగాంచవచ్చు - కాని ఇవి అన్నీ ఒకే వ్యక్తిలో మూర్తీభవించియున్న బహుముఖ ప్రజ్ఞాలి, మహోన్నతమూర్తి కళాతపస్వి బాపిరాజు.

**కవిగా :**

"అతడు గీసినగీత బొమ్మై<br>
అతడు పలికిన పలుకుపాటై<br>
అతని హృదయములోని మెత్తన<br>
ఆర్ద్రవత్కృతియై<br>
అతడు చూపిన చూపుమెఱుపై<br>
అతడు తలచిన తలపు వెలుగై<br>
అతని జీవికలోని తియ్యన<br>
అమృతరసధునియై"

*- విశ్వనాథసత్యనారాయణ*

రాజుగారికి చిన్నతనం నుంచి గేయాలు రాయడం అలవాటు. తాను రాయడమేకాక, తన చుట్టువున్న వారిచేత కూడా రాయించేవారు. గేయకవిత్వంలో వీరు ఒక ప్రత్యేకతను సంపాదించుకున్నారు. అంచేతనే నవ్య సాహిత్యంలో బసవరాజు, బాపిరాజు, నండూరి సుబ్బారావుగార్లను 'గేయకవిత్రయం'గా పేర్కొన్నారు కురుగంటి సీతారాయభట్టాచార్యులుగారు.

బాపిరాజుగారి కొన్ని గేయాలు మాత్రమే ముద్రణ భాగ్యానికి నోచుకున్నాయి. వీరి ముద్రిత గేయాలకంటే అముద్రిత గేయాలే ఎక్కువ. తాను బ్రతికివున్నప్పుడు

తన గేయ సంపుటాల్ని అచ్చు వేయించడానికి శుద్ధ ప్రతుల్ని కూడా తయారు చేసుకున్నారు. అకాల మరణం వల్ల ఆ గేయాలు అచ్చుకు నోచుకోలేదు.

రాజుగారి కవిత్వంలో ఎక్కువగా భావ కవితా శాఖలు చోటు చేసుకున్నాయి. పిల్లల గేయాల్ని రాసి బాల సాహిత్యానికి వున్న లోటును తీర్చారు. వీరు వచన కవితలు కూడా రాసి వచన కవితా లోకంలో తనదైన స్థానాన్ని నిలబెట్టుకున్నారు. గాంధీ సిద్ధాంతాని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకొని తమ కవిత్వంలో ప్రతిపాదించారు. రాజుగారు పదహారు గేయ సంపుటాల్ని రాశారు "తొలకరి" 1922లోను, "గోధూళి" 1938లోను, "శశికళ" 1954లోను ముద్రించబడ్డాయి. అంజలి, బాపు, చిగురుటాకులు, జ్యోతి, ఆంధ్ర, దీపమాల, శిల్పబాల, సుహమా చంద్రికలు, గడ్డిపూల పళ్ళెము, జానపదగేయాలు, జంగం కథలు, బాపిరాజు వచనాలు, బాపిరాజు ఇతర గేయాలు మున్నగు సంపుటాలు అముద్రితంగా వున్నాయి.

ఆధునిక తెలుగు సాహిత్య రంగంలో పాశ్చాత్య భాషా సంపర్కం వల్ల భావ కవిత్వం ఉద్భవించింది. ఆంగ్ల క్షవులైన షెల్లీ, కీట్స్, వర్డ్స్ వర్త్, రవీంద్రుడు మొదలైనవారి ప్రభావం ఆధునిక తెలుగు కవిత్వంపై పడింది. ఆ ప్రభావ ఫలితమే భావ కవిత్వం వచ్చింది. భావ కవిత్వంలో బాపిరాజు గారి ఒక విశిష్ట స్థానం ఉంది. భావకవిత్వపు ప్రసంగం వచ్చేసరికి మనకు బాపిరాజుగారు దర్శనమిస్తారు. రాజుగారి భావ కవితా భావాల్ని క్రమంగా ప్రణమ కవిత్వం, ప్రకృతి కవిత్వం, దేశభక్తి కవిత్వం, భక్తి కవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వం, స్మృతి కవిత్వం అనే శాఖలుగా విభజించవచ్చు.

భావకవుల్లో తనహితులందరికీ శివ శంకర శాస్త్రికి ""హృదయేశ్వరి", విశ్వనాథకి "కిన్నెర" కృష్ణశాస్త్రికి "ఊర్వశి" అనే ఉపాసనా దేవతలున్నారని అదే విధంగా తన బ్రతుకు శ్రుతి కలిపి వలపించు సతి "శశికళ" అని మనకు పరిచయం చేస్తారు రాజుగారు.

తన కళాధిదేవత రసాధిదేవత, ఆరాధ్య దేవత, అపురూప సౌందర్య లావణ్యమూర్తి అయిన "శశికళ" గూర్చి చెపుతూ....

"చిత్రరూపము రంగు శశికళ
శిల్పకౌశల్యమ్ము శశికళ
చిత్రకారుని కుంచె శశికళ
శిల్పి చేతులు ఉలియె శశికళయే!

కావ్యనాయిక నాకు శశికళ
కావ్యరసమున స్థాయి శశికళ
కావ్య వ్యంగ్యము రీతి, శశికళ
కావ్యమే నాగీతి శశికళయే!

అని ఆదివ్యమంగళ సుందర రూపాన్ని తనివితీర పలువిధాలుగా కీర్తిస్తారు రాజుగారు "ఎండిమియాన్" అనే శీర్షికలో "శశికళ" సాక్షాత్కర వృత్తాంతమయింది.

బాపిరాజుగారు శశికళా ప్రియులు. ఆయన జీవితమంతా కళామయం చేసి, చివరకు ఆయనను తనలో లోనం చేసుకుంది శశికళ. శశికళ రాజుగారి రాణి వాణి, బాణి. "శశికళ" సంపుటాన్ని తన ఆశయమూర్తి, తన ఆత్మ పూజా పీఠస్థ శిల్పకళాలక్ష్మికి అంకితమిచ్చారు.

**కథకుడుగా :**

"కథకుగాని, నవలకు గాని, నాటికకు గాని, పాటలకు గాని, చిత్రానికి గాని, శోభతేవడానికి ఏమేమి చేయాలో అవన్నీ ఆయనకు క్షుణ్ణంగా తెలుసు. బహుముఖాల ఆధునాతన ఆంధ్ర సాహిత్య వైభవాన్ని దిగంతాలకు వెలార్చిన అడివి బాపిరాజుఆరు. ఆయన ఆంధ్ర సాహిత్య తారాపథంలో ఒక ఉజ్జ్వలతార"
- బుద్ధవరపు కామరాజు

తెలుగువారందరు సగర్వంగా చెప్పుకోదగ్గ ప్రసిద్ధ కథా రచయిత రాజుగారు. తెలుగు కథా సాహిత్యాన్ని తనకుగల ప్రజ్ఞాపాటవం చేత, దీప్తివంతం చేసిన ప్రతిభావంతులు ఆయన. ఏనాడైతే బాపిరాజు తెలుగు కథ రాయడానికి పూనుకున్నారో ఆనాడే తెలుగు కథా రంగం కళారంగంగా మారింది. తెలుగు కథా సాహిత్య క్షేత్రాన్ని కళాత్మకంగా మార్చిన కళాతపస్వి రాజుగారు. వీరి ఒక్కొక్క కథ ఒక్కొక్క కళాకంఖం. అంచేతనే "వంగసాహిత్యానికి రవీంద్రుడు ఎంతవైవిధ్యమైన కళామూర్తో, తెలుగు సాహిత్యానికి బాపిరాజు అంత" అని మొదలి నాగభూషణశర్మగారు కొనియాడారు. ఇది సత్యం.

బాపిరాజు కథలు, రాశిలో తక్కువేకాని వాసిలో ఎక్కువే. వీరు 44 కథల్ని రాశారు. అంజలి, తరంగిణి, తూలికానృత్యం, భోగీరలోయ, రాగమాలిక, వింధ్యాచలం' అనే పేర్లుతో ఆరు సంపుటాలుగా వెలువడ్డాయి. కథా సంపుటాలుగా వచ్చిన కథలు ముప్పది ఐదు. వివిధ పత్రికలో ప్రచురించబడ్డ కథలు నాలుగు. అసంపూర్ణ కథలు రెండు. అముద్రిత కథ ఒకటి. ఆ కథలు యివి.

వీరు రాసిన కథల్ని స్థూలంగా నాలుగు వర్గాలుగా వర్గీకరించవచ్చు. 1.కాల్పనిక కథలు 2. వాస్తవిక కథలు 3. బాలవాఙ్మయ కథలు 4. చారిత్రక కథలు. వీరి కథలన్నింటినీ, సవిమర్శ దృష్టితోనూ, కళాత్మక హృదయంతోనూ పరిశీలిస్తే ఆయన ప్రతిభా ప్రజ్ఞా పాటవాలు మనకు గోచరిస్తాయి.

బాపిరాజు కథలో మొట్టమొదటిసారిగా మనకు కొట్టి వచ్చేటట్లు కన్పించేది ఆయన వస్తు వైవిధ్యం. వీరి కథా ఎత్తుగలు అందంగా, ఆకర్షణీయంగా, అపూర్వకంగా వుంటాయి. ఆయన పాత్రలు కళామూర్తులు, ప్రేమమూర్తులు, ప్రజ్ఞామూర్తులు, సర్వవిద్యా పరిపూర్ణులు. వర్ణనలు సంక్షిప్తంగా, సుందరంగా, మధురాతి మధురంగా హృదయాహ్లాదకరంగా ఉపయ, ఉత్ప్రేక్ష, రూపక, అతిశయోక్తి మొదలైన సరసగుణాలంకార శోభితంగా వుంటాయి. రాజుగారి సంభాషణలు సహజంగా, స్వాభావికంగా, వివరణాత్మకంగా, ప్రయోజనాత్మకంగా వుంటాయి. కథా కథన శిల్పంలో వైవిధ్యాన్ని, వైశిష్ట్యాన్ని సాధించారు. వీరి భాష సరళంగా, కమనీయంగా, మనోహరంగా వుంటుంది. ఆయన వ్యక్తిత్వం ఎంత పవిత్రమైందో, గంభీరమైందో, ఉదాత్తమైందో, ఉన్నతమైందో, ఆయన వచన రచనా శైలీ సౌందర్యం కూడా, అంత మహోన్నతమైంది, సుకుమారమైంది. కథా శీర్షికలు అల్పాక్షరాలతో కూడుకొని కథా పరమార్థాన్ని సూచించి, ఆకర్షణీయంగా వుంటాయి. శీర్షికలు చిన్నవిగానే కాక ముచ్చటగా వుంటాయి. కథల్ని మంగళాంతం చేయడంలో వీరికి ఒక ప్రత్యేక స్థానముంది. రాజుగారి ప్రతికథ అందంగా, ఆనందంగా ముగుస్తుంది.

**నవలాకారుడుగా :**

"బాపిరాజు వ్రాసిన కథలూ, నవలలూ అనేకాలు. వాటిలో కల్పనలత్యద్భుతములైనవి. అతనికి కథా, నవలా, గేయమూ, వ్రాయడమంటే ఒక ఆటవంటిదే. కూర్చుండే పుటలకు పుటలు లేఖకులకు చెప్పి వేసేవాడు. తడబాటు లేదు. తడుముకోవడం లేదు. అంతటి నిశితమైన ప్రజ్ఞ అతనిది."

*- మల్లంపల్లి సోమశేఖర శర్మ*

బాపిరాజుగారి శక్తి సామర్థ్యాలకు, ప్రతిభా వ్యుత్పత్తులకు, కథా కథఃకౌశలానికి, ఆదర్శపాత్ర చిత్రణ నైపుణ్యానికి, సన్నివేశకల్పనా చాతుర్యానికి, శైలీ మాధుర్యానికి, వర్ణనా వైవిధ్యానికి, రమ్యరమణీయ సుందర భావనా ప్రాబల్యానికి వారి నవలలు గీటురాళ్ళు. అవి తెలుగు నవలా సాహిత్యంలో మైలురాళ్ళు.

ఉత్తమ నవలా కారులైన బాపిరాజుగారు 12 నవలల్ని రాశారు. నారాయణరావు, తుఫాన్, కోనంగి, నరుడు, జాజిమల్లి మొదలైన ఐదు సాంఘిక నవలలు. హిమబిందు, గోనగన్నారెడ్డి, అడవిశాంతిశ్రీ, అంశుమతి మొదలైన నాలుగు చారిత్రక నవలలు. మధురవాణి, శిలారథం, కైలాసేశ్వరుడు నవలలు అముద్రితంగా అసమగ్రంగా వుండిపోయాయి.

వీరి సాంఘిక నవలల్లో అగ్రస్థానంగా నిలిచింది 'నారాయణరావు'. ఇది పాత్ర ప్రధానమైన నవల. 1932లో ఆంధ్ర విశ్వకళా పరిషత్ వారు నిర్వహించిన నవలా రచన పోటీలో నారాయణరావు నవలకు ఉత్తమ బహుమతి రావడం ఆయన ఉత్తమ నవలా కారుడుగా అనడానికి చక్కని నిదర్శనం ఈ నవల కేంద్ర సాహిత్య అకాడమి అనడానికి చక్కని నిదర్శనం. ఈ నవల కేంద్ర సాహిత్య అకాడమి మెప్పును పొంది తమిళం, కన్నడం, మలయాళం, పంజాబీ, హిందీ మొదలైన భాషల్లోకి అనువదించబడింది. ఈ నవల ఆంధ్ర విశ్వ కళాపరిషత్ వారి చేతను మద్రాసు విశ్వవిద్యాలయం వారి చేతను పాఠ్యగ్రంథంగా నిర్ణయించడం చెప్పుకోదగ్గ విశేషం. ఈ నవలలోని ఇతివృత్తం జమిందారీ వ్యవస్థకు సంబంధించినది. సమకాలీన ఆంధ్రుల సమస్యల్ని, జమిందారీ వ్యవస్థ నిర్మూలనాన్ని, ఆంధ్ర జాతీయ స్వాతంత్ర్యోద్యమాన్ని, గాంధీ సిద్ధాంతాన్ని, ఈ నవలలో వీరు ప్రతిబింబింపచేశారు.

తర్వాత చెప్పుకోదగ్గ సాంఘిక నవల "తుఫాన్". ఇందులో శ్రీనాథమూర్తి భార్య శకుంతల అకాలమరణం చెందుతుంది. భార్య మరణంతో శ్రీనాథమూర్తి పడే ఆవేదన వర్ణనాతీతం. ఈ నవల కథా కథనం ఫ్లాష్ బ్యాక్ పద్ధతిలో నడుస్తుంది. జాతీయోద్యమ ప్రభావంతో రాయబడిన నవల కోనంగి. దీని కథ అంతా మద్రాసు రాజకీయాలు ఈ నవలలో చోటు చేసుకున్నాయి. "నరుడు" నవలను హరిజనోద్ధరణను దృష్టిలో పెట్టుకొని రాశారు. అగ్రవర్ణాల వారు, తమకన్నా తక్కువ కులాల వారిని ముఖ్యంగా హరిజనుల్ని ఏవిధంగా అణగదొక్కేరో ఇందులో విపులంగా వివరించారు. అనాది నుంచి అగ్రవర్ణాల వారిచే నీచంగా, హీనంగా, అసభ్యకరంగా, చూడబడిన హరిజనుడు కూడా నరుడే, మానవుడే అనే దృక్పథంతో రచయిత ఈ నవలను రాశారు. వీరు రాసిన నవలలో చివరిది జాజిమల్లి.

రాజుగారు రాసిన మొదటి చారిత్రక నవల "హిమబిందు". ఇది ఆంధ్ర శాతవాహన కాలానికి సంబంధించింది. ఆయన అద్భుత సృష్టి హిమబిందు. రాజుగారి అమృత హృదయమే ఈ నవలగా రూపుదాల్చింది. ఈ నవల ఆనాటి

ఆంధ్రుల సంస్కృతికి, సామాజిక జీవనానికి, మతమౌఢ్యానికి, రాజకీయ కుట్రలకు అద్దం పడుతుంది. గోనగన్నారెడ్డి కాకతీయ రుద్రమదేవి కాలాన్ని చిత్రించే అద్వితీయమైన నవల. శాతవాహనుల పతనాంతరం చక్రవర్తులైన ఇక్ష్వాకుల చరిత్రను తెలిపే ఉత్తమ చారిత్రక నవల "అడవిశాంతిశ్రీ" "అంశుమతి" చాళుక్య కాలానికి సంబంధించిన నవల.

"మీజాన్" దినపత్రికకు సంపాదకుడుగా వున్న రోజుల్లో "మధురవాణి" నవలను రాశారు. రాసినంతవరకు అచ్చు అయింది. తంజావూరు నాయకరాజుల్లో ప్రముఖుడైన రఘునాథనాయకుని చరిత్రకు సంబంధించిన నవలయిది. రఘునాథ నాయకుని ఊరేగింపుతో ఈ నవల ప్రారంభమవుతుంది. ఈ నవలలోని కథ అంతా రఘునాథ నాయకుడు, మధురవాణి పాత్రల చుట్టూ తిరుగుతుంది. ఈ అసంపూర్ణ నవలను డాక్టర్ దిట్టకవి శ్యామలాదేవి గారు పూర్తిచేశారు. విజయనగర సామ్రాజ్యాధిపతి అయిన శ్రీకృష్ణదేవరాయల చరిత్రకు సంబంధించిన చారిత్రక నవల "శిలారథము". ఈ నవల ప్రారంభంలోనే ఆగిపోయింది. చాళుక్య కాలానికి సంబంధించిన నవల "కైలాసేశ్వరుడు". ఇది కూడా అసంపూర్ణంగా వుండిపోయింది.

### రేడియోనాటికల రచయితగా :

రేడియో నాటికలు రాయడంలో కూడా రాజుగారు దిట్ట. భోగీరలోయ, నారాయణరావు, శైలబాల, ఉషాసుందరి పారిజాతం, నవోదయం, దుక్కిటెద్దులు, ఏరువాక మొదలైన వీరి రేడియో నాటికలు శ్రోతల్ని ఆనందపరవశుల్ని చేశాయి.

### ఏకాంకికా రచయితగా :

ఆంధ్ర సామ్రాజ్ఞి (మిజాన్ 2, 16 ఏప్రిల్, 1944), కృతి సమర్పణం (మిజాన్, 8జూలై 1944) బొమ్మలు (మిజాన్ 15 డిశంబర్ 1946) గుడ్డిపిల్ల (కులపతి ప్రత్యేక సంచిక, 1954) మొదలైన ఏకాంకికలు రాసి ఏకాంకిక రచయితగా పేరు ప్రఖ్యాతలు గడించారు.

### వ్యాసస్రష్టగా :

రాజుగారు ఆంధ్రాంగ్ల భాషల్లో సుమారు డైబ్భై వ్యాసాలు రాసి వ్యాసకర్తగా పేరు గడించారు. వీరి వ్యాసాలు కొన్ని అముద్రితంగానూ, మరికొన్ని అసమగ్రంగానూ వున్నాయి. విషయ వైవిధ్యాన్ని బట్టి వీరి వ్యాసాల్ని స్థూలంగా కళా, ఆంగ్ల, కళాక్షేత్ర, చరిత్ర, సంస్కృతి, జీవితచరిత్ర, సాహిత్యం, విమర్శ, స్త్రీ, పత్రిక, సాంఘిక వ్యాసాలు

అనే పది విధాలుగా వర్గీకరించవచ్చు. అనితర సాధ్యమైన ప్రజ్ఞాపాటవంతో విభిన్న వ్యాసాల్ని రాసి, వ్యాస ప్రక్రియకు తెలుగు సారస్వతంలో మహోన్నతమైన స్థానం కల్పించి, పలువురి ప్రశంసల్ని అందుకున్న ఉత్తమ వ్యాస స్రష్ట బాపిరాజుగారు.

### అనువాదకుడుగా :

డి.ఎఫ్ కరకా రాసిన ఆంగ్ల గ్రంథాన్ని 'నా పడమటి ప్రయాణం' అనే పేరులో విద్వాన్ విశ్వం గారితో కలిసి అనువదించారు రాజుగారు. ఈ గ్రంథంలో పదమూడు ప్రకరణలున్నాయి. ఇందులో పారసీజాతి వారి సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, జీవన విధానాలు వర్ణించబడ్డాయి.

### పత్రికా రచయితగా :

రాజుగారు భారతి, శారద, ఆంధ్ర పత్రిక, గృహిణి, వీణ మొదలైన పత్రికల్లో అనేక వ్యాసాలు రాసి సుప్రసిద్ధ పత్రికా రచయితగా పేరుపొందారు.

### పత్రికా సంపాదకుడుగా :

ఉన్నతాదర్శాలు గల పత్రికా సంపాదకులు రాజుగారు. 1915లో రాజమండ్రిలో 'అభినవాంధ్ర సాహిత్యం' అనే పేరుతో ఒక పత్రిక పెట్టి కొన్ని మాసాలు నడిపారు. మచిలీపట్నం నుంచి వెలువడిన ఆంగ్ల పత్రిక "త్రివేణి" కి సహాయ సంపాదకారుడుగా కొన్నాళ్ళు పనిచేశారు.

గులాం మహ్మద్ కలకత్తావాలా నడిపిన 'మిజాన్' తెలుగుపత్రికకు 1944 నుంచి 1947 ఆగష్టు 7 వరకు సాటిలేని మేటి పత్రికా సంపాదకుడుగా పేరు సంపాదించారు. కలకత్తా వాలాకి అనుగుణంగా ఆంగ్ల, ఉర్దూ పత్రికలు నడిచాయి. రాజుగారి సంపాదకత్వంలో నడిచే 'మిజాన్' అందుకు భిన్నంగా నడిచింది. ఆంగ్ల, ఉర్దూ పత్రికలు నడిచే మార్గంలో రాజుగారు పయనించలేదు. తనదైన స్వంత బాణిలో పత్రికను నడిపారు. వీరు ఎవర్ని అనుసరించలేదు. అనుకరించలేదు. తాను నమ్మిన సిద్ధాంతాల కోసం కట్టుబడ్డారు. వీరు ఆత్మాభిమానాన్ని ఎప్పుడూ కోల్పోలేదు. అంచేతనే బాపిరాజు గూర్చి సింగరాజు లింగమూర్తి గారు ఇలా అన్నారు. "మహమ్మదీయ వ్యవస్థాపకుని దగ్గర పనిచేస్తున్నా బాపిరాజు గారెప్పుడూ ఆత్మ స్వాతంత్ర్యాన్ని కోల్పోలేదు. ఆంగ్ల పత్రిక సంపాదకీయాలనే తెలుగు పత్రికకు అనుసరించి వుండేవి. మొదట్లో బాపిరాజుగారు అందుకు అంగీకరించినా, అది ఎప్పటికైనా తమ స్వాతంత్ర్యానికి భంగకరమని భావించి తెలుగు పత్రికకు ప్రత్యేక సంపాదకీయాలు రాసుకుంటానని వ్యవస్థాపకుని కోరారు. కొన్ని సందర్భాలలో

తమ పదవికి రాజీనామా యివ్వడానికి కూడా సిద్ధపడ్డారు. చివరకు సంకల్ప సిద్ధులయ్యారు. ప్రత్యేక సంపాదకీయాలు రాసుకోవడానికి వ్యవస్థాపకునికి ఒప్పుకోక తప్పింది కాదు.

గులాం మహ్మద్ కలకత్తా వాలా రాజుగారికి పత్రికా సంపాదకత్వంలో పూర్తి స్వేచ్ఛను ఇవ్వడమే కాక పత్రికా నిర్వహణలో సంపూర్ణ అధికారాలు కలుగజేశారు. ఇలా జరిగినప్పటికి కూడా చివరకు కాంగ్రెస్సువాదియైన రాజుగారు నిజాం ప్రభుత్వ నిరంకుశత్వ పరిపాలనా విధానాన్ని రజకార్ల ఉద్యమాన్ని సహించలేక ఆగష్టు 7 తేదిన, మిజాన్ తెలుగు పత్రిక సంపాదకత్వానికి రాజీనామా ఇచ్చారు. పత్రికా వ్యవస్థాపకులు కలకత్తా వాలా గారు రాజీనామా ఇవ్వవద్దని ఎంత బ్రతిమాలినా వీరు తన నిర్ణయాన్ని మార్చుకోలేదు.

### ప్రథమాంధ్ర చలన చిత్ర కళా దర్శకుడుగా :

"కవి, కథకులు, చిత్రకారులూ అయిన శ్రీ బాపిరాజుగారు సతతం స్వాప్నిక జగత్తులో విహరించినప్పటికి చిత్తజగత్తుకు దిగివచ్చినప్పుడు రియలిజం(వాస్తవికత) సాక్షాత్కరింప జేసేవారు. వారు కట్టిన సెట్లు, బ్యాక్ గ్రౌండ్‌లో తెరపై వేసిన ప్రకృతి దృశ్యాలు వెండితెరపై చాలా సహజంగా కన్పించేవి. కృత్రిమం అవంతైనా కన్పించేది కాదు."

*- బొమ్మకంటి సుబ్బారావు*

వీరు సతీ అనసూయ - ధ్రువ విజయం (1935) మీరాబాయి (1940) అనే రెండు చిత్రాలకు కళా దర్శకత్వం వహించారు. రెండే రెండు చిత్రాలకు కళా దర్శకత్వం వహించి, ప్రముఖ కళా దర్శకుడుగా పేరు పొందారు. రెండు చిత్రాలతోనే ఎంతోమంది శిష్యుల్ని తయారుచేసి ప్రథమాంధ్ర చలనచిత్ర కళా దర్శకుడుగా పేరు గాంచాడు రాజుగారు. "కలం చెప్పలేని భావాలను కుంచెతోను, కుంచె గీయలేని భావాలను కలంతోను పలికించగల సవ్యసాచి బాపిరాజు" అని లంక సూర్యనారాయణగారు అన్నారు.

### చిత్రకారుడుగా :

"అడవిబాపిరాజు అజంతా దివ్యజ్యోతికి ప్రతిరూపం. చిత్రలేఖనంలోనూ, కవితలోనూ, ఆ జ్యోతి వెలుగులకు రూపమిచ్చి మనకు చూప ప్రయత్నించాడు. కవులు ఆయన గొప్ప చిత్రకారుడని అభినందించారు. చిత్రకారులు గొప్ప కవి అని ప్రశంసించారు. నిజానికి ఆయన కవీ, చిత్రకారుడూ. అన్నిటీమించిన

సరసహృదయుడు, ఆనందమయుడు, అనేక సుందరసుమాలను స్పృశించి ఆనంద వివశుడై పియఃపథంలో విహరించాడు."

*- కందుర్తి ఈశ్వరదత్తు*

రాజుగారు అనేక చిత్రకళా ఖండాల్ని సృష్టించి ప్రముఖచిత్రకారుడూగా తెలుగుదేశంలో పేరు ప్రఖ్యాతలు గడించారు. శబ్దబ్రహ్మ, భాగవత పురుషుడు, సూర్యదేవ, సముద్రగుప్తుడు, రాధాకృష్ణ, మృత్యుంజయుడు, శశికళ, నటరాజు, సంధ్యానృత్యం, తిక్కన, భారతి, గోధూళి, గంగిరెద్దు మొదలైన నలభైవరకు జలవర్ణ చిత్రాలు వేశారు. గౌరీశంకరులు, శ్వేతతార మొదలైనవి తైలవర్ణ చిత్రాలు.

విశ్వనాథ సత్యనారాయణ ''కిన్నెరసాన" పాటలకు, కోకిలమ్మ పెండ్లికి, నండూరి సుబ్బారావు ఎంకిపాటలకు రేఖా చిత్రాలు వేశారు. పత్రికలోని అనేక కథలకు కూడా రేఖా చిత్రాలు వేశారు. పెన్సిల్ స్కెచ్‌లు కూడా ఎన్నో వున్నాయి. ఇలా పెక్కు చిత్ర కళాఖండాల్ని సృష్టించి అత్యుత్తమ చిత్రకారుడుగా పేరు సంపాదించారు రాజుగారు. అందుకే "బాపిరాజుగారికి చిత్రకళ పిలిస్తే పలికే దివ్యశక్తి వుందని నా నమ్మకం" అని గూడూరు నమశ్శివాయగారు అన్నారు. ఇది అక్షరాల నిజం.

**కళాతపస్విగా :**

కళామూర్తి బాపిరాజుగారు గుంటూరు, బందరు, భీమవరం, హైదరాబాదు, మద్రాసు మున్నగు చోట్ల కళాపీఠాల్ని స్థాపించి "కళాతపస్వి"గా పేరును సార్థకం చేసుకున్నారు. ముట్నూరి కృష్ణారావు గారు రాజుగారి కళాతృష్ణను చూసి మెచ్చుకొని "కులపతి" అనే బిరుదును ఇచ్చారు. అప్పటినుంచి అడివి బాపిరాజు "కులపతి" అడవిబాపిరాజుగా ప్రసిద్ధిగాంచారు.

**మహావక్తగా :**

తెలుగు సాహిత్యంలో గొప్ప రచయితగా, మహా వక్తగా, పేరెన్నికగన్న వాళ్ళలో రాజుగారు ఒకరు. ఏ విషయం మీదనైనా శ్రోతల్ని అలరిస్తూ కమ్మని ఛలోక్తులతో, సరస సంభాషణలతో, సున్నిత హాస్యంతో గంటల తరబడి ఉపన్యాసాన్ని ఇవ్వగల మహావక్త రాజుగారు. వీరి గంభీరోపన్యాసం శ్రోతల హృదయాల్ని స్పందింపచేయడమే కాక, అడుగడుగునా హర్షధ్వానాలతో సభా కళకళలాడుతుంది. ఆయన మాటలాడుతుంటే శ్రోతలు మంత్రముగ్ధులై ఉర్రూతలూగవలసిందే.

రాజుగారి ఉపన్యాసంలో మాటా, పాటా, ఆటా త్రివేణి సంగమంలా పెనవేసుకుని, ఎనలేని ఆనందానుభూతుల్ని శ్రోతలకు కలుగజేస్తాయి. వీరి రచన ఎంత సుందరంగా, సుకుమారంగా వుంటుందో వారి ఉపన్యాసం కూడా అంత మధురంగా మనోహరంగా వుంటుంది. అంచేతనే వారి ప్రసంగమంటే శ్రోతలు చెవికోసుకుంటారు. తమ ప్రతిభా సామర్థ్యాలతోనూ, అసాధారణ వాక్పటిమతోనూ, సందర్భోచిత చమత్కార, ఛలోక్తులతోనూ, చక్కని విషయ వివేచన చేస్తూ, తమ మహోపన్యాసాల ద్వారా శ్రోతల్ని ఉత్తేజితులుగా చేసిన మహావక్త బాపిరాజుగారు.

### ప్రిన్సిపాల్‌గా :

రాజుగారు 1935-1938 మధ్యలో ఆంధ్ర జాతీయ కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. తాను ప్రిన్సిపాల్‌గా పనిచేసిన కాలంలో ఆంధ్ర జాతీయ కళాశాలను ఆదర్శవంతమైన గురుకులంలో నిర్వహించారు. ప్రిన్సిపాల్ పదవికే గౌరవం తెచ్చిపెట్టారు. కాటూరి వెంకటేశ్వరరావు గారు ఆయనతో కలిసి కళాశాలలో పనిచేశారు.

### గాంధేయవాదిగా :

ఇరవయ్యో శతాబ్దం ప్రథమార్థంలో జాతీయోద్యమం ప్రారంభమైంది. జాతీయోద్యమానికి సారథ్యం వహించిన మహానుభావుడు గాంధీమహాత్ముడు. గాంధీజి పిలుపుమేరకు జాతీయోద్యమంలోకి ఉత్సుకతతో ఉరికిన వారిలో రాజుగారు ఒకరు. వీరు స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని సంపూర్ణ స్వరాజ్యం కోసం నినాదాలు చేసి, గేయాలు రాసి, పాటలు పాడి, ఉపన్యాసాలిచ్చి ప్రజల్ని జాగృతం చేసిన ప్రముఖ జాతీయవాది. వీరు గాంధీ ఆదేశాల మేరకు 1922 లో సత్యాగ్రహోద్యమంలో పాల్గొని లాఠీదెబ్బలు తిని, జైలుపాలయ్యారు. రాజమండ్రి సెంట్రల్ జైలులోనూ, కడవారు జైలులోను శిక్ష అనుభవించారు.

మహాత్ముని జీవితాన్ని, ఆయన అపూర్వ వ్యక్తిత్వాన్ని, గుణగణాల్ని, స్వాతంత్ర్య నాయకత్వాన్ని, క్షుణ్ణంగా ఆకళింపు చేసుకొని విశేషంగా ప్రభావితుడై తెలుగుజాతి సగర్వంగా చెప్పుకోదగ్గ సాహిత్యాన్ని సృష్టించిన ప్రముఖ జతీయవాది రాజుగారు. గాంధీజి ఆదర్శాల్ని, సిద్ధాంతాల్ని, ఆశయాల్ని వీరి సాహిత్యంలో అక్షరరూపం దాల్చినదనడంలో ఎంతమాత్రం అతిశయోక్తి కాదు.

### దళితజనోద్ధారకుడుగా :

బాపిరాజుగారు ప్రభాకరజీ అనే హరిజన బాలుడిని చేరదీసి, తన యింటిలో కొంతకాలం వుంచి, చదువు నేర్పించి సేవా గ్రామంలో స్వయంగా చేర్పించారు.

**ఆ తర్వాత అతడు పౌనార్ లోని వినోబా భావే ఆశ్రమంలో చేరాడు. ప్రభాకరజీ భూదావోద్యమ కార్యకర్తగా, వినోభాబావే అనుచరుడుగా పేరుపొందారు. హరిజనుడు కూడా నరుడే మానవుడే అన్నభావనతో "నరుడు" అనే నవలను కూడా రాజుగారు రాశారు. హరిజనాభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొని మెట్లు, నరసన్న పాపాయి కథల్ని రాశారు. హరిజనులకు జరిగే అన్యాయ అక్రమాల్ని అనైక్యతను ఎత్తిచూపుతారు మెట్లుకథలో. హరిజనుడైన నరసన్నను సంఘం కలిగించిన బాధల్ని ముఖ్యంగా అగ్రకులస్థులు అతన్ని పెట్టిన హింసల్ని "నరసన్న పాపాయి" కథలో వివరించారు.**

**ఇలా బాపిరాజుగారు తెలుగు సారస్వతానికి నిరంతర నిర్విరామ కృషి చేసి తనదైన ఒక ప్రత్యేకమైన విశిష్టమైన స్థానాన్ని నిలబెట్టుకున్నారు.**

**రావులపర్తి భద్రిరాజుగారి సంపాదకత్వంలో "కులపతి" జూన్ 1954లోనూ, కంచివాసుదేవ రావుగారి సంపాదకత్వంలో "చుక్కాని" అక్టోబర్ 1962 లోనూ, డాక్టర్ దిట్టకవి శ్యామలాదేవి గారి సంపాదకత్వంలో "నాదబిందు శశికళ" 1985 లోనూ ప్రత్యేక సంచికలు ముద్రించబడ్డాయి.**

**ఆకాశవాణి విశాఖపట్నం, విజయవాడ, కడప, హైదరాబాద్ రేడియో కేంద్రాల్లో బాపిరాజు సాహిత్యంపై అనేఖ వ్యాసాలు ప్రసారమయ్యాయి. బాపిరాజుగారు రాసిన పాటలు ఆకాశవాణిలో వచ్చాయి. హైదరాబాద్ దూరదర్శన్‌లో బాపిరాజు సాహిత్యంపై కొన్ని ప్రత్యేక కార్యక్రమాలు ప్రసారమయ్యాయి.**

**బాపిరాజు సాహిత్యంపై ఆంధ్ర, ఉస్మానియా, వేంకటేశ్వర, నాగార్జున మొదలైన విశ్వవిద్యాలయాల్లో పిహెచ్.డిలు, ఎమ్‌ఫిల్‌లు వచ్చాయి.**

**"బాపిరాజు గారివలె ఇన్ని కళలలో ప్రవేశంగల వ్యక్తులు చాలా అరుదు. అట్టి వారెవరైనా ఉన్నప్పటికీ, ఆ పరిచయ కళారంగాలలో ఆరితేరినవారు అంతకన్నా అరుదు. వీరిలోని ప్రత్యేకత ఏమిటంటే ఒకేకాలంలో అన్ని కళావిభాగాలలోనూ ప్రారంభించి, అన్నింటిలోనూ అందెవేసిన చెయ్యి అనిపించుకొన్నారు. ఇట్టివారు ఆంధ్రదేశములో ఈనాటివరకు లేరని చెప్పవచ్చు." అని వి.వి బోణెపెగారు అన్నారు. తెలుగు సాహిత్య కేదారంలో బంగారు పంటలు పండించిన కృషీవలులు బాపిరాజుగారు. ఆధునికాంధ్ర వాఙ్మయంలో రాజుగారికి ప్రత్యేక స్థానముంది. తెలుగు సాహిత్య వైభవాన్ని దిగంతాలకు వ్యాపింపచేసిన కీర్తి అడవిబాపిరాజు గారికే దక్కుతుద్మి.**

# నవ్యాంధ్ర సాహిత్య సౌరభాలు



**డా. రేవూరి అనంతపద్మనాభరావు**
విశ్రాంత అదనపు డైరెక్టర్ జనరల్
దూరదర్శన్, ఢిల్లీ
✆ 98665 86805

ఆధునికాంధ్ర సాహిత్యంలో వచ్చినంత ప్రక్రియా వైవిధ్యం పూర్వయుగాలలో కనిపించదు. నన్నయ నుండి దక్షిణాంధ్రయుగం వరకు కవులు పద్యానికి పట్టం గట్టారు. ఆంగ్లభాషా ప్రభావం వల్ల 19వ శతాబ్దం నుండి తెలుగు సాహిత్యం కొత్తపుంతలు తొక్కింది. నాటకాలు, నవలలు, కథలు, విమర్శ, పరిశోధన, అవిధానము సామాజికస్పృహ, వివిధ కవిత్వవాదాలు ఈ శతాబ్దంలో రచయితలను, కవులను ఆకర్షించాయి. కవుల చరిత్రల రచనకు శ్రీకారం జరిగింది. ఇటీవలే శతజయంతి (2021) జరుపుకొన్న మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి గారి వర్ధంతి (నవంబర్ 7, 2021) తటస్థించింది. వారు 60ఏళ్ళ నాడు 1950లో ప్రచురించిన 'ఆంధ్రరచయితలు' ప్రామాణిక గ్రంథం. 1901 వరకు జన్మించిన 109మంది తెలుగు రచయితల జీవనరేఖలు అందులో ప్రస్తావించారు. 1944లో తొలిముద్రణలో 44మంది కవులతో ప్రారంభమై 1950నాటికి వందసంఖ్య దాటింది. ఈ గ్రంథం అధ్యయనం చేస్తున్న సమయంలో వివిధ సాహిత్యప్రక్రియలలో తెలుగుకవుల ప్రతిభ విశదమైంది.

**ప్రక్రియా వైవిధ్యం :** కేవలం పద్యరచనకే తొమ్మిది శతాబ్దాలు ప్రాచుర్యం పొందిన తెలుగుభాషకు 19వ శతాబ్దంలో జవజీవాలు లభించాయి. 'తెనుగునకున్న వ్యాకరణదీపము చిన్నది' అని నానుడి ఉంది. 1806 - 1862 మధ్య కాలంలో జీవించిన పరవస్తు చిన్నయసూరి వ్యాకరణం వైపు దృష్టిసారించి అమూల్యమైన బాలవ్యాకరణాన్ని 1955లో అందించారు. వారి నీతిచంద్రిక నిరూపమానం. ఆంధ్ర నిఘంటువు రచనోద్యమానికి నాంది పలికారు. ఆ తరువాత బహుజనపల్లి

సీతారామచార్యులు (1827 - 1891) శబ్ద రత్నాకరం తెలుగువారికి కరదీపిక. సూర్యాంధ్రా నిఘంటువు నిర్మాణం బృహత్ ప్రయత్నం.

**పద్యనాటక ప్రభంజనం :** నాటిక ప్రక్రియ తెలుగులో 19వ శతాబ్దంలో విజృంభించింది. బళ్ళారికి చెందిన ధర్మవరం రామకృష్ణమాచార్యులు (1853 - 1912) చిత్రనళీయం, విషదసారంగధరం, పాదుకా పట్టాభిషేకాది నాటకాలు రచించి ప్రదర్శింపజేశారు. బళ్ళారి రాఘవ వీరి మేనల్లుడు. ఆ ప్రాంతం వాడే అయిన కోలాచలం శ్రీనివాసరావు (1854 - 1919) శ్రీరామ జననం, పాదుకాపట్టాబిషేకం, కీచకవధ, హరిశ్చంద్ర, రుక్మాంగదాది నాటకాలు రచించారు. పానుగంటి లక్ష్మీనరసింహారావు (1865 - 1940) కంఠాభరణము, విప్రనారాయణ చరిత్ర ప్రసిద్ధాలు. వారి సాక్షి వ్యాస సంపుటి చిరయశస్సు సంపాదించిపెట్టింది. తిరుపతి వెంకటకవుల పాండవోద్యోగవిజయాలు జన సామాన్యంలోకి దూసుకుపోయి 'బావా! ఎప్పుడు వచ్చితీవు' 'అదిగో ద్వారక' వంటి పద్యాలు జనుల నాలుకలపై నర్తించాయి. వేదంవారి ప్రతాపరుద్రీయం ప్రశస్తం, చిలకమర్తివారి గయోపాఖ్యానం నాటకరాజం.

**అవధాన ప్రతిభ :** ఆంధ్రులకే సొంతమైన అవధాన విద్య 19, 20 శతాబ్దంలో రాజాస్థానాలలో జైత్రయాత్ర చేసింది. తిరుపతి వెంకటకవులు కొప్పరపు సోదర కవులు, వెంకటరామకృష్ణ కవులు.

మరెందరో అష్టావధాన, శతావధాన ప్రక్రియల ద్వారా తెలుగు సాహిత్యానికి రాజ గౌరవం కలిగించారు. జంటకవుల జోడీకి ప్రయత్నాలు జరిగాయి. పింగళి, కాటూరి కవుల సౌందరనందం అందుకు సాక్షి. 20వ శతాబ్దంలో సహస్రావధానుల సంఖ్య పెరిగింది.

**పత్రికా ప్రపంచం :** సాహిత్య పత్రికలు 19,20 శతాబ్దాలలో బహువ్యాప్తమైనాయి. అనేక సాహిత్య పత్రికలు మఖలో పుట్టి పుబ్బలో గతించాయి. అందుకు కారణం పాఠకుల ఆదరాభిమానాలు కొరవడటమే. యావదాంధ్ర దేశంలో వందల సంఖ్యలో పత్రికలు ప్రారంభించబడి రెండు, మూడేళ్ళకే మూసివేయవలసిన పరిస్థితి వచ్చింది. పూండ్ల రామకృష్ణయ్య (1860 - 1904) నాలుగు దశాబ్దాలే జీవించినా (నెల్లూరు) అముద్రితాంధ్ర గ్రంథ చింతామణి పత్రిక ద్వారా ఎన్నో గ్రంథాలు వెలికి తెచ్చారు. ఆ రోజుల్లో కవులు, రచయితలు పత్రికా ప్రారంభానికి ఉరకలు వేశారు. గురజాడవారి 'ప్రకాశిక' ఈ కోవలోనిదే. ఆంధ్ర పత్రిక, కృష్ణాపత్రిక, గోలకొండ పత్రిక,

తదితరాలు సాహితీ సౌరభాలు వెదజల్లాయి.

**గురజాడ వాల్మీకి :** మధునాపంతులుగారు ఆంధ్ర రచయితలు గ్రంథంలో గురజాడను 'వాల్మీకి'తో పోల్చారు. (1895 - 1915). ముత్యాలసరాలు సృష్టికర్తగా, కన్యాశుల్క నాటకరచయితగా, పుత్తడిబొమ్మ పూర్ణమ్మ స్రష్టగా దేశభక్త ప్రబోధక గీత రచయితగా ఆయన శాశ్వతుడు. కాళ్ళకూరి నారాయణరావు వరవిక్రయం, సాంఘిక నాటకం, రాయప్రోలు వారి ఏ దేశమేగినా, ఎందుకాలిడినా జాతినుత్తేజపరిచిన గీతం. దేవులపల్లి కృష్ణపక్షం భావకవితోద్యమ పారిజాతం. తుమ్మల, జాషువా, కరుణశ్రీ తదితర కవులెందరో కవితారస ఝరులు ప్రవహింపజేశారు.

**దేశభక్తి కావ్యాలు :** ఆధునిక భారతంలో స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తితో వెలువడిన ఎన్నో కావ్యాలు ప్రబంధ ధోరణిలో జాతిని ఉత్తేజపరిచాయి. దుర్భాక రాజశేఖర శతావధాని రాణాప్రతాప చరిత్ర, గడియారం వెంకటశేష శాస్త్రి శివభారతం, అజరామర కావ్యాలు, రచయితలు గాంధీజి ప్రభావానికి లోనయ్యారు. తుమ్మల సీతారామమూర్తి (1901 - 1990) గాంధీ ఆస్థానకవిగా ప్రసిద్ధులు. మహాత్ముని ఆత్మకథను కావ్యరూపంగా మలచిన మహనీయుడు. మహాత్మకథ, గాంధీగానం ప్రసిద్ధాలు.

**నవలావికాశం :** ఆధునిక తెలుగు సాహిత్యంలో నవలా చక్రవర్తులు పలువురు. నాటి సాహిత్య పత్రికలు నవలల పోటీలు నిర్వహించాయి. అడవి బాపిరాజు (1895) నవలలు - నారాయణరావు, హిమబిందు, కోనంగి, గోనగన్నారెడ్డి సుధాభాంణలు గోదావరీ నది అంటే బాపిబావకు ఒళ్ళు పులకరిస్తుంది.

'ఉప్పొంగిపోయింది గోదావరీ తాను

తెప్పలన్న ఎగిసింది గోదావరీ ' అని పరవశించారు.

నోరి నరసింహశాస్త్రి (1900) నారాయణభట్టు, రుద్రమదేవి నవలలు చారిత్రక కళాఖండాలు. ఉన్నవవారి మాలపల్లి సామాజిక చిత్రణతో విరాజిల్లిన నవల. 20వ శతాబ్దంలో నవలా రచయిత్రులను దిన, వార, మాస పత్రికలు అధిక ప్రోత్సాహం కలిగించాయి. విశ్వనాథ వారు అనేక నవలలు వెలయించారు.

**కథకచక్రవర్తులు :** కథ, కథానిక, గల్పిక - ఇలా ఎన్నో అవతారాలెత్తిన కథనం చిరస్మరణీయం. శ్రీ పాద సుబ్రమణ్యశాస్త్రి, గురజాడ, మునిమాణిక్యం, భమిడిపాటి కామేశ్వరరావు.

మరెందరో కథకుల పుణ్యమా అని అతివేలంగా కథలు సృష్టించబడ్డాయి. వారపత్రికలు వాటికి జీవం పోశాయి. కథ కంచికి వెళ్ళకుండా మంచిగా తెలుగు నేలపై వేళ్ళూనుకొంది. హరికథా పితామహులైన ఆదిభట్లనారాయణదాసు ప్రాతఃస్మరణీయులు. పలువురు హరికథలకు అది జీవనోపాధి.

**విమర్శనా పరమేశ్వరులు :** తెలుగు సాహిత్యంలో విమర్శకాగ్రేసరులు పాండిత్య స్పర్ధతో విమర్శనా సాహిత్యాన్ని పరిపుష్టం చేశారు. కట్టమంచి రామలింగా రెడ్డి, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, మల్లంపల్లి సోమశేఖర శర్మ (చారిత్రకం) చిలుకూరి నారాయణరావు ప్రభృతులు విమర్శకు పట్టంగట్టారు. అదొక సాహిత్య ప్రక్రియగా ఆంగ్ల సాహిత్య ప్రభావంతో LITERARY CRITICISM ఎం.ఎ తరగతులలో పాఠ్యాంశమైంది. వేటూరి ప్రభాకరశాస్త్రి అన్నమాచార్య కీర్తనలను వెలుగులోకి తెచ్చారు.

**పద్యకవితా ప్రకాండులు :** పద్యాన్ని హృద్యంగా మలచిన పలువురు కవులను స్థలాభావం వలన స్పృశించలేదు. తుమ్మల పుట్టపర్తి, జాషువా, కరుణశ్రీ పద్యకవితకు రాజసం కలిగించారు. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి (1866 - 1960) భారత, భాగవత, రామయణాలను పద్యంలో ఒక్కచేతిమీదుగా నడిపారు. వావికొలనువారి మంధర వ్యాఖ్యాన రామాయణము, పుట్టపర్తి వారి జనప్రియ రామాయణము, ఉమర్ ఆలీషా సూఫీ వేదాంత దర్శనము. ఈ కోవలో కొన్ని రచనలు.

**గ్రంధ ప్రకాశకులు :** తాళపత్రాలకే పరిమితమైన అసంఖ్యాక కావ్యాలకు వెలుగు చూపిన మహనీయులు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు, నాగపూడి కుప్పుస్వామయ్య, కొమఱ్ఱాజు లక్ష్మణరావు, వేంకట పార్వతీశ్వర కవులు (ఆంధ్ర ప్రచారిణీ గ్రంధమాల) ప్రభృతుల వాఙ్మయసేవ అపారం. భారతాది గ్రంథాలను ప్రచురించి పాఠకుల హృదయాలను దోచుకున్నారు.

ఈ విధంగా ఆధునికాంధ్ర సాహిత్యం మూడు పూవులు, ఆరు కాయలుగా విలసిల్లి ఇతర భాషా సాహిత్యాలతో తలమానికంగా తూలతూగి గౌరవ ప్రతిష్ఠలను ఇనుమడింపజేసింది. గిడుగురామమూర్తి వ్యావహారిక భాషోద్యమ సాహిత్యంలో గొప్ప మార్పు తెచ్చింది.

# గురజాడ - హేతువాదం



డా. కనుపర్తి విజయబక్ష్
విశ్రాంత రీడర్
మండపేట
94413 82303

ప్రపంచంలో ఏ దేశ చరిత్ర చూచిన మార్పు అన్నది అకస్మాత్తుగా రాత్రికిరాత్రే ఆకాశం నుండి ఊడిపడేది కాదు. రాజకీయ, ఆర్థిక, సామాజిక విషయాల్లో ఎన్నో ఒడిదుడుకులు సంభవిస్తూ పాత విధానాలు పోయి కొత్తవి చోటు చేసుకోవటం ప్రారంభం అవుతాయి. అట్లా ప్రారంభమైన విధానాలు పాత వాటి కంటె అభ్యుదయకరంగా సాగినపుడే ఆ జాతి పురోగమనం వైపు పయనిస్తుందని చెప్పుకోవచ్చు.

19వ శతాబ్దపు మొదటి పాదం నుండి 20వ శతాబ్దపు మూడు దశాబ్దుల వరకు అటు వంటివి అవకాసమే తెలుగు దేశం లోపొట మరిచింది. అప్పటికే ఆంగ్ల విధ్యాభ్యాసం వల్ల అన్ని రంగాల్లో భారతదేశ సంస్కృతి మీద తమదైన ముద్రవేయటం మొదలు పెట్టారు ఆలోచనాపరులైన కొందరు. ప్రాచీనవిలువలకు ప్రాముఖ్య మిస్తూ నూతన సమాజ నిర్మాణానికి తమ వంతు కృషి చేయనారంభించారు.

మనిషికీ, అతని సామాజిక కార్యకలాపాలకి, స్వేచ్ఛా భావనకి, హేతువాదానికి, శాస్త్రీయ దృష్టితో నూతన భావ వికాసానికి మేధావులుఎందరో ప్రాధాన్యమిచ్చారు. ఇట్లాటి నూతన భావాల పరంపరతో, విలువలతో కూడిన స్వేచ్ఛా మానవతా దృక్పథంతో తెలుగు సాహిత్యానికి కొత్తభాష, భావం మరియు రూపాన్నిచ్చి తదుపరి తరం వారికి మార్గదర్శిగా నిలబడ్డ మహా మనిషి గురజాడ. తెలుగు సాహిత్యంలో హేతువాద యుగ ఆరంభానికి తనదైన శాస్త్రీయ దృక్పథంతో కొత్త వెలుగుదారులను

నిర్మించినవాడు ఆయన. హేతువాదానికి జీవగర్ర శాస్త్రీయ దృక్పథం బ్రిటీష్ నేషనలిస్ట్ అసోసియేషన్ వారి మాటల్లో హేతువాదమంటే " "Rationalism may be defined as the mental attitude, which unreservedly accepts the supremacy of reason and aims at establishing a system of philosophy and ethics verifiable by experience and independent of all arbitrary assumptions of authority" - (1899).

హేతువాదం ఒక సిద్ధాంతం కాని, ఒక వాదం కాని కాదు. అదొక 'ఆలోచనా విధానం' ఆ ఆలోచన కూడా శాస్త్రీయమైన ఆలోచనా విధానమే తప్ప అశాస్త్రీయతకు అహేతుకతకు తావులేని ఆలోచనా విధానమే. ఆ ఆలోచనా విధానం ఎల్లప్పుడు ప్రశ్నింప చేస్తూనే ఉంటోంది. ఆ ప్రశ్నించటంతో వచ్చిన సమాధానాల్లోని యుక్తాయుక్తాలను విశ్లేషించుకొంటు ముందుకు సాగిపోతోంది. సత్యాసత్యాలను నిర్ధారిస్తోంది. కాబట్టి ఏ విషయాన్నైనా ప్రశ్నిస్తూ, శాస్త్రబద్ధమైన నిర్ణయాలు తీసుకొంటూ పురోగమించేదే 'హేతువాదం' హేతుత్వం పని చేయనపుడు ఆలోచన కూడా స్తంభించి పోతోంది.

> హేతువాదం ఒక సిద్ధాంతం కాని, ఒక వాదం కాని కాదు. అదొక 'ఆలోచనా విధానం' ఆ ఆలోచన కూడా శాస్త్రీయమైన ఆలోచనా విధానమే తప్ప, అశాస్త్రీయతకు అహేతుకతకు తావులేని ఆలోచనా విధానమే. ఆ ఆలోచనా విధానం ఎల్లప్పుడు ప్రశ్నింప చేస్తూనే ఉంటోంది.

హేతువాదమంటే కేవలం దేవుణ్ణి, మతాన్ని మూఢనమ్మకాలను వ్యతిరేకించే సిద్ధాంతం అనే అభిప్రాయం చాలా మందిలో ఉంది. దేవుణ్ణీ, మతాన్నీ, మూఢ నమ్మకాలను హేతువాదం తిరస్కరించే మాట నిజమే, కానీ, అది అంతకుమాత్రమే పరిమితం కాదు. నిరవధికంగా పెరిగే జ్ఞానంతో అన్ని సమస్యలకు అవగాహనను, వాటి పరిష్కారానికి హేతుబద్ధమైన వివరణను సాధించే శాస్త్రీయ పద్ధతిని 'హేతువాద'మంటారు.

"ఇప్పుడున్న సాంఘిక భావాలు పోయి వాటి స్థానంలో కొత్తవి రావలసిన అవసరానికీ అగత్యానికీ మానవ పరిణామ వాదం దారితీస్తున్నది" అని

భావించిన అప్పారావు ఆ కొత్త సాంఘిక భావాంకురాలను పొడగట్టి సాగాడు కూడా. నిరుపయోగమైన ఉహాగానాన్ని తోసివేసి కళ్ళెదుట కనిపించే లోకవృత్తాన్ని ఆధారం చేసుకొని ఈ పోయే వచ్చే పాత కొత్త భావాలను తాత్వికుడైన వాడు శాస్త్రీయమైన పద్ధతి ద్వారా సేకరించి నిగ్గు దేలుస్తాడు. తానున్న సమాజంలోని సమస్యలను అవలోకించి ఆ సమస్యలకు మూల కారణం దేవుడో, దయ్యమో అనే భావనను పెంపొందించేలాగ కాకుండా మానవుడే కేంద్రంగా సమస్య పరిష్కారాలను చూపుతూ భావ విప్లవానికి నాంది పలికాడు. సాహిత్యాన్ని సామాజిక ప్రయోజనానికి మలచ గలిగాడు. అందుకే తాను తన కాలంలో నిలబడ్డ చూపు మాత్రం ముందు కాలానికి ప్రసరింప చేయ గలిగాడు. తన కాలం నాటి వాళ్ళు తనను మెచ్చరని ఆయనకు తెలుసు. కాని మెప్పు కోసం వెనకడుగు వేసే తత్వం కాదు ఆయనది.

మెచ్చునంటావీవు, నీవిక
మెచ్చుకుంటె మించిపాయెను
కొయ్య బొమ్మ మెచ్చు కళ్ళకు
కోమలుల సౌరెక్కునా?

ఆయన ఏర్చి కూర్చు కున్న అద్భుత ముత్యాలసరాల్లో హేతువాద దృక్పథం మానవతావాదం, సంఘ సంస్కరణ దృష్టి స్పష్టంగా కనబడతాయి. మత విషయాల్లోనూ అప్పారావు అంత పట్టుదలగా వుండేవాడు కాదు. ఒక్కోసారి సంశయవాదిగా (agonistic) కనిపిస్తాడు. ఈ మతాలన్నింటిని మించిన 'ప్రేమతత్త్వాన్ని' బోధించాడు.

'పరుల కలిమికి పొర్లి యేడ్చే
పాపి కెక్కడ సుఖం కద్దోయి?
ఒకరి మేల్తనమేలనెంచే
నేర్పరికి మేల్కొల్లలోయి

అనే విశాల దృక్పథాన్ని వెలార్చాడు.

కె.వి.రమణారెడ్డి గురజాడ మీద రచించిన 'మహోదయం' గ్రంథంలో గురజాడది వాస్తవిక దృష్టి అంటాడు. అప్పారావు భౌతిక వాదం దాకా దిగి రాలేదు గాని, వస్తు సంబంధమైన దృష్టిని ప్రయత్న పూర్వకంగా అలవరచుకొన్నట్లు ఆయన రచనా శకలాలను బట్టి తెలుస్తూంది.

ఎప్పటికి అనుభూతి మెద్దియు
అప్పటికి అది నిక్కువంబు
అని అనటంతో పాటు
కన్ను కానని వస్తు తత్వము
కాంచ నేర్పరు లింగిరీజులు
కల్ల నొల్లరు, వారి విద్యల
కరచి సత్యము నరసితిన్.

అప్పారావుకు శాస్త్రీయ పద్ధతి గురించి సదవగాహన ఉందనేందుకు నిదర్శనం ఆయన రాసి పెట్టుకొన్న తాత్త్విక చింతన అనే వ్యాసం. యూరప్‌లో బయలుదేరిన ఎంపిరిసిజం (ప్రయోగాత్మక పద్ధతి) హేతువాదం (ఊహాత్మక పద్ధతి) రెండును అవసరమంటాడు. మతం కంటె మనిషి ముఖ్యమని చెప్పటం విశాలమైన వసుదైక కుటుంబ భావన. ఆయనలోని మానవతా వాద లక్షణం.

ఎల్ల లోకము వొక్క ఇల్లై
వర్ణ భేదము లెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమ బంధము
వేడుకలు కురియ.
మతములన్నియు మాసి పోవును
జ్ఞానమొక్కటి నిలిచి వెలుగును;
అంత స్వర్గ సుఖంబులన్నవి
యవని విలసిల్లున్

విజ్ఞాన శాస్త్ర ప్రయోగానికి అందనిదేనిని నమ్మరు హేతువాదులు. ఊహలను అంగీకరించరు. అందుకే అంటాడు 'చొప్పు తెలియని వింత పొడమగ, చిన్నకాలపు చిన్న బుద్ధులు బెదిరి యెంచిరి కీడుగా పురాణాల్లో అంతా కల్పనలు... అద్భుతాలు..... ఊహలు.... వింతలు..

"వెఱ్ఱి పురాణ గాథల నమ్మ జెల్లున్పండితులు" అని సూటిగా ప్రశ్నించాడు. తోక చుక్క ఆవిర్భావాల్ని "తలతు నేనిది సంఘ సంస్కరణ ప్రయాణ పతాకగాన్" అని అందరు తోక చుక్క ఆవిర్భావం అరిష్టమనుకొంటే ఆయనకది సంఘ సంస్కరణ కెత్తిన పతాకగా అనిపించింది. ఆ రోజుల్లో ఆంధ్రదేశంలో ముమ్మరంగా కొనసాగుతున్న సంస్కరణ కార్యకలాపాలు ఆయన దృష్టి నుండి తప్పించుకోలేదు.

హేతువాద భావజాలం ఈనాటిదికాదు. ప్రాచీన కాలం నుండి ఉపనిషత్తుల పుట్టుక ఏమిటి? ఎందుకు అని ప్రశ్నించటంతోనే పరిపుష్టమయ్యాయి. అయితే చాలా మంది తమ సంశయాలకు సమాధానం పొందటంలో అప్పటికే వున్న దానిని ఆశ్రయించటంతో హేతుత్వం అణిగిపోతూ తు వచ్చింది. మూలం కోసం అన్వేషణ జరపటమే హేతుబుద్ధి. గురజాడ కూడా ఆ అన్వేషణలో మానవుని కంటె మించింది ఏదిలేదనే అభిప్రాయానికి వచ్చాడు. అందుకే అంటాడు.

మనిషి చేసిన రాయిరప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషుల కంటే రాయి రప్పల
కన్న కనిష్టంగా చూస్తావేం...
దేవుడెవడో దాగె నంటూ
కొండ కోనల వెదుకులాడే
కన్ను తెరచిన కాన బడదో
మనిషి మాత్రుడియందు లేడో
యెరిగి కోరిన కరగి యీడోముక్తి

అంతేకాదు, అస్పృశ్యతను గూర్చి తన అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా వెల్లడించాడు. అప్పటికే అస్పృశ్యత మీద కొంత చర్చ దేశంలో జరుగుతోంది. సంస్కరణ వాదులు తమ వాణిని వినిపించటం మొదలు పెట్టారు. గురజాడ కూడ ఆ విషయం పై తన సంపూర్ణ సహకారాన్ని వెల్లడించాడు.

మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే
మాలనేనగుదున్.

మానవ జాతి సమస్తం రంగు (తెలుపు-నలుపు), వర్గం (అప్పర్ - లోయర్), వర్ణం (అగ్ర-అధమ) లననుసరించి విభజించే సిద్ధాంతానికి వ్యతిరేకంగా 'మంచి-చెడ్డలు'గా విభజించటం ఆయన హేతు దృష్టికి నిదర్శనం. మతం కంటె మనిషి మిన్న అనే మానవతా దృక్పథం గురజాడ రచనలకు ప్రాణం- జవం- జీవం.

మలిన దేహుల మాల లనుచును
మలిన చిత్తుల కథిక కులముల
నెలవొసంగిన వర్ణ ధర్మ మ ధర్మ ధర్మంబే
కులము లేదట వొక్కవేటున
పసరముల హింసించు వారికి
కులము కల వటు నరులప్రేచెడి
క్రూరకర్ములకున్.

పాతదంతా గొప్పదని పొగిడే వారిని కొంచెమాలోచన చేయాలి సుమా అని "మంచి గతమునకొంచెమే" నని హెచ్చరించాడు. 'దేశభక్తి' గేయంలో ఆయన వెలిబుచ్చిన భావాలన్ని నాటికి, నేటికి, ఏ నాటికీ పనికి వచ్చేవే.... మందగించక ముందు అడుగేయి వెనక పడితే వెనకేనోయి 'అన్నదమ్ముల వలెను జాతులు మతములన్ని మెలగాలని ఆకాంక్షించాడు.

శివ కవులతో ఆరంభమైన ఈ హేతు దృష్టి, వేమనలో ప్రస్ఫుటమై ఆధునిక యుగంలో గురజాడ దగ్గరకు వచ్చేసరికే విశాలమైన మానవతా, హేతు దృక్పథంతో రాబోయే కాలంలోని కవులకు మార్గ దర్శకమైంది.

అప్పారావు రచనల్లో అనుభవ వాదము, హేతు వాదము రెండు పెనవేసుకొనే కనబడతాయి అనే విజ్ఞుల ఆభిప్రాయం వాస్తవమే అనేట్లు 'కన్యాశుల్కం' వుంటుంది. ఈ నాటక రచనలో అప్పారావు ప్రదర్శించిన ప్రతిభ అనన్య సామాన్యమైనది. బాల్య వివాహాలు, సానిరికం, వితంతువుల దుస్థితికి కన్యాశుల్కంలో ఆయన వర్ణించిన తీరు అమోఘం. గిరీశం పాత్ర ద్వారా సంఘ సంస్కరణం అనే పేరుతో జరిగే కార్యకలాపాలను ఆయన

> అప్పారావు రచనల్లో అనుభవ వాదము, హేతు వాదము రెండు పెనవేసుకొనే కనబడతాయి అనే విజ్ఞుల ఆభిప్రాయం వాస్తవమే అనేట్లు 'కన్యాశుల్కం' వుంటుంది. ఈ నాటక రచనలో అప్పారావు ప్రదర్శించిన ప్రతిభ అనన్య సామాన్యమైనది.

గర్హించాడు. 'కన్యాశుల్కంలోప్రస్తావనకు రాని సమాజ రుగ్మతలు అట్టే లేవు. మత విశ్వాసం, హేతు వాదం, దాంపత్యం, సానిరికం, ఛాందసం, అనాచారం, పురుషాధిక్యం, స్త్రీజనాకోశ్రం, గ్రామీణ జనుల బుద్ధి జడిమ నాగర జనుల బుద్ధి వక్రత, ఆచార పరత్వం, సంస్కారోద్యమ స్పందనం' ఇన్ని అంశాలు ఆ నాటకంలో చోటు చేసుకున్నాయి.

కన్యాశుల్కంలో ప్రస్తావనకు వచ్చిన కొన్ని అంశాలు మరింత విశ్వరూపాన్ని సంతరించుకొని మనకు 'కొండు భట్టీయం' నాటకంలో దర్శనమిస్తాయి. కొండు భట్టుకు మంచి చెడ్డల పాప పుణ్యాల విచక్షణ లేదు. స్వార్థం తప్ప పది రూపాయలు పారేస్తే (పాపం కూడా) పుణ్యం కింద పరిణామం అవుతుందని అంటానికి కూడా వెనకాడ లేదు. దేవతలు, బ్రాహ్మణులు చేసే పనులు తప్పు పట్ట గూడదు అని కూడ చెప్పటానికి జంకు లేదు.

> ఆనాడు 'బ్రహ్మ సమాజం' గొప్ప సంస్కరణకు నాంది పలికింది. ఈ ప్రసక్తి నాటకంలో చాలా చోట్ల వచ్చింది బ్రహ్మ సమాజము లోకములో నుండు మతములన్నింటి కన్నరేషనల్ అని దివాన్ బహద్దూర్ రాజారాం అంటాడు.

ఆనాడు 'బ్రహ్మ సమాజం' గొప్ప సంస్కరణకు నాంది పలికింది. ఈ ప్రసక్తి నాటకంలో చాలా చోట్ల వచ్చింది 'బ్రహ్మ సమాజము లోకములో నుండు మతములన్నింటి కన్నరేషనల్ అని దివాన్ బహద్దూర్ రాజారాం అంటాడు. ఆస్తికత అంటే ఛండాలుడు యెనుపోతును వేట వేసి మరిడమ్మకు పూజ చేసేది కాదని, సంఘంలో పై అంతస్థువారు రేషనల్రెలిజియన్ను కలిగి వుండాలని అంటాడు. థియోసాఫిస్టు మతం వాళ్ళు పూర్వం చెప్పబడిదంతా సత్యమంటాడు. దాన్నిదివాన్ఖండిస్తాడు.

మత కలహాలకు కారణం తమ మతమే గొప్పదనే అహంకార భావం. అందుకే చాలా తెలివిగా ఎదుటి వారి మతాన్ని చులకన చేస్తారు. ఎవడి మతం వాడికి సబబు. అందుకే గిరీశం చేత హేతుబుద్ధిని కలవాడిగా మాట్లాడిస్తాడు. నిష్కల్మషమైన మనస్సు, అవాజ్యమైన భూతదయ వుంటే యేమతమైనా సమ్మతమే' అని మానవత్వం నిండిన మాటలు అనిపిస్తాడు.

ఒక విధంగా భాష, భావము, వస్తు రీత్యా పరిశీలించి నట్లయితే గురజాడ అప్పారావు తెలుగు ఆధునిక కథా సాహిత్యానికి ఆద్యుడు. ఆయన తన మొట్ట మొదటి కథ 'దిద్దుబాటు' (1910) రాసే నాటికి ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమం ముమ్మరంగా కొనసాగుతోంది. గురజాడ వర్తమాన అంశాలను విశదీకరిస్తూ మూఢ విశ్వాసాలను ప్రశ్నిస్తూ 'దేవుళ్లారా మీపేరేమిటి?' 'సంస్కర్త హృదయం' 'మెటిల్డా' 'పెద్ద మసీదు' కథల్లో మూఢత్వాన్ని, కుహనా సంస్కరణ వాదాన్నిగేలి చేశాడు.

సంస్కరణోద్యమ కథా సాహిత్యానికి గురజాడ వేసిన పునాది చాలా గొప్పది. ఈ ప్రభావం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో చాలా మంది కథకుల పై పడింది.

గురజాడ కథల్లో 'దేవుళ్ళారా మీపేరేమిటి' కథానిక ఒక్కటి చాలును కథకుల్లో గురజాడకు అగ్రేసరత్వం స్థాపించడానికి. మామూలు మనుషుల్ని, పామరుల్ని కూడా అమాయకులు ఎట్లా అవతారాలుగా మారుస్తారో తెలియ చేస్తాడు. శైవులు, వైష్ణవులు హిందూ మతంలోని శాఖలైనా వారిలో వారు ఒకరినొకరు ఎట్లా తక్కువ చేసుకొంటారో, నిందించుకుంటారో ఈ కథలో చక్కగా చెప్పాడు. శైవ మతం కంటె తమ మతం గొప్పదని తెలియాలంటే రాత్రికిరాత్రి గుండం తొక్కాలని విష్ణు భక్తుల అభిప్రాయం. కాని ఎవరికీ ధైర్యం చాలలేదు. అందరు నీవు నీవంటే నీవనుకొన్నారు. కాని ఎవరు ముందుకురారు. చివరికి నాంచారమ్మ తానే గుండంలో నడుస్తానంటుంది. ఆమెకు తోడుగా పీరు సాయిబు గుండం తొక్కుతానంటాడు.



'రామి నాయుడా! పరమ భాగవతోత్తము లైయుండిన్నిమీరు యెవరు గుండం తొక్క జాలినారు కాదు గదా! అట్టి స్థితిలో ఈ పిచ్చి తురకకి గుండంతొక్కడానికి భగవంతుడు ధైర్య సాహసాలు

యిచ్చాడు గనుక మీ వైష్ణవ మతం గొప్పదా? అతగాడి తురక మతం గొప్పా? అని అడుగుతుంది నాంచారమ్మ.

వైష్ణవులు, శైవులు కూడ గుండం దొక్కటం, వాళ్ళకీ, వీళ్ళకీ కూడా కాళ్ళు కొంచెం కాలటం జరుగుతుంది. తరువాత ఆపీరుకి శైవ వైష్ణవ భేదం లేకుండా అందరూ మొక్కుతూ ఉంటారు. అందరూ దేవుళ్ళూ ఒక్కరే అయితే ఆపీనుగుల్ని అందరినీ ఒక్కచోటే నిలిపి అందరూ కలిసి పూజ తగలెట్టరాదా' అని ఎద్దేవా చేస్తాడు.

'ఈ దేశంలో పాండవులు వుండని గుహలూ, సీతమ్మ వారు స్నానమాడని గుంటలూ లేవు' అని మన మతంలోకి చొచ్చుకు వచ్చిన అంతు లేని అజ్ఞానపు విషయాలను సున్నితంగా హేళన చేస్తాడు.

పూర్తిగా హేతు దృష్టితో కథనం తా నడిపాడు. నిజమైన భక్తుల మనే వారు గుండాన్ని తొక్కటానికి పడేతొక్కిసలాటను చూస్తే దేవుడున్నాడనే నమ్మకం వారికి నిజంగా వుందా? అన్న అనుమానం వస్తోంది. అజ్ఞానం, అమాయకత్వం ప్రజల్లో వ్యాపించి వున్నంత కాలం ఇటు వంటికథల అవసరం తప్పదు.

'దేవుడు చేసిన మనుషుల్లారా' కథను భారతీయ భాషల్లోనికి అనువదింపజేసి బహుళ ప్రచారంలోకి తెస్తే దేశంలో మత కలహాలు నశించే వీలుంది' అని విజ్ఞుల అభిప్రాయం.

కవిగా, నాటక రచయితగా, కథానిక రచయితగా, వ్యాస రచయితగా తన స్థానం అమర రచయితల మధ్య వుందని గురజాడ పుష్కలంగా రుజువు చేసుకొన్నాడు. గురజాడ ఆసక్తి భాష పట్ల మాత్రమే కాదు. తన తరం, రాబోయే తరాల జీవితానికీ, యోచనకూ సంబంధించిన ప్రతి మౌళిక సమస్య పట్ల ఆయనకు ఆసక్తి వుంది.

గురజాడ 'ముందు చూపు' ఒకటని కాదు అన్ని విషయాలకు సంబంధించి ఆయన అభ్యుదయగామి అనేది స్పష్టం. స్త్రీలు కొన్ని రకాల సంకెళ్ళ నుంచి విముక్తమవ్వాలని ఆయన ఆశ, ఆశయం. అందుకే అంటాడు 'ఆధునిక మహిళలు భారత దేశ చరిత్రను తిరిగి రచిస్తారు' అని.

నా వుద్యమం ప్రజల వుద్యమం అని ధైర్యంగా చాటి చెప్పాడు. ఆయన గతించి నూట పది సంవత్సరాలైనా ఆయన భావి తరాలకు చూపిన 'జాడ' ఏనాటికైనా 'గురుజాడే' ఆధునిక భావ వికాసానికి సంపూర్ణ ప్రతినిధిగా ప్రభవించి తెలుగు సాహిత్యానికి 20వ శతాబ్దపు ద్వారాన్ని తెరిచిన మహా ద్రష్ట గురజాడ..

# విలక్షణకవీ ! గురజాడా !



శ్రీ బుడితి రామినాయుడు
✆ 94901 39503

పండితులు మత్సరగ్రస్తులని
పాపం భర్తృహరి వాపోయాడు
మెచ్చనంటావు నీవంటూనే
గుచ్చినావు ముత్యాలసరాలు నీవు

లోకమంతా మెచ్చుకున్నది
నీ కవిత్వం అజరామరం
సాటి లేనిది నీ నాటకం
హాస్యోక్తుల సమాహారం

ఏ మని పొగడను నిన్ను
ఎవ్వరు నీ సాటివారు
ఏటికెదురీది నిలిచిన
మేటి కవీంద్రుడవు నీవు

సాంఘిక దురాచారాల్ని
సమూలంగా దును మాడాలని
కంకణం కట్టుకున్న
కవి శేఖరుడవు నీవు
సంతలో పశువు నమ్మినట్లు
స్వంత కూతుర్నిఅమ్ముకోవడం

ఎంత ఘోరం ఎంత దారుణం
మనుమరాలి వయసు కన్యను
తాత కిచ్చి పెళ్ళి చెయ్యడం
మరీ ఘోరం మహా దారుణం

కన్యాశుల్కం కథ విషాద భరితమే
అయినా
విషాదంలో హాస్యం పండించిన
విలక్షణ కవివి నీవు

గ్రాంథిక భాషా ఛాందసాన్నిగర్హించి
గ్రామ్య భాష నాశ్రయించి
భాషా విప్లవ విజయానికి
బాటలు వేసిన ఘనుడవు

కుల వివక్షతో దేశం కునారిల్లి
పోతోందని
గుర్తించి హెచ్చరించిన
గొప్ప మేధావివి నీవు

నీ కన్యాశుల్కం నాటకాన్ని
ప్రజల ముందు ప్రదర్శించాము
ఎంత హాస్యం! ఏమి రక్తి!
గడసరి శిష్యుడు వెంకటేశం

కంది గుండగేదె పెరుగు
కావాలి నా కన్నప్పుడు
కడుపుబ్బ ప్రేక్షకులు
పడి పడి నవ్వుకున్నారు

చుట్ట పొగ ముందు ఆ దేవుడికి
గుగ్గిలం సాంబ్రాణి ఏమూలని
కోతల రాయుడు గిరీశం
కోవెలలో అన్నప్పుడు
పొట్ట చెక్కలయ్యేటట్టు
గట్టిగా నవ్వుకున్నాము

కన్యాశుల్కం దురాచారం
కనుమరుగై పోయినా
వరకట్నపిశాచం
వచ్చింది జడలు విప్పుకొని

అది కూడా అబలలకే శాపంగా మారింది
ఏ రాయి అయితే నేంపళ్ళూడ గొట్టడానికి
ముల్లు అరిటాకు మీద పయినా
అరిటాకు ముల్లు మీద పడినా
ఫలితం మాత్రం ఒక్కటే!

భాష సంస్కరింప బడినా
భావాలు మాత్రం పాతవే
కుల వివక్ష వికృత రూపం దాల్చి
కోరలు సాచి సాగుతున్నది
స్వార్థ బుద్ధి నానాటికీ
వృద్ధి చెందుతూనే ఉంది
మోసం దగా కుట్ర అత్యాచారలతో
దేశం నానాటికి అభాసు పాలౌతున్నది
వార్తా పత్రికలన్నీ దుర్వార్తా పత్రికలైనాయి

మళ్ళీ నీవు పుట్టాలని
కోరుకుంటున్నారు కొందరు
కాలం మారింది క్రౌర్యం పెరిగింది

మునుపటి కన్నా మౌఢ్యం
ముప్పిరి గొంటున్నది
మళ్ళీ నీవు పుట్టినా
నీ మాట వినేదెవ్వరో!



ప్రత్యేక వ్యాసం

# గాలిచేటు



- విహారి
ప్రముఖ రచయిత, విమర్శకులు
98480 25600

ఆ ఇంటిని భయం కమ్ముకుని వుంది.

ఒక్కొక్కరూ ఒక్కొక్క గదిలో. కరోనా!

మాస్కులు, శానిటైజర్లు, లిక్విడ్ సోపులూ, మందులూ, కషాయాలూ, పొడులూ, ఆకులూ....

హాల్ మిగిలింది. అది నిర్మలది, ఆమె ఆ ఇంటి కోడలు. వేళ ప్రకారం వాళ్ళకి వాళ్ళ వాళ్ళ అవసరాల్ని అందించటానికి బావి గిలకలా తిరుగుతోంది.

రూమ్ నెంబరు ఒకటి : పరబ్రహ్మం. వయస్సు 68. 35 ఏళ్ళకే షుగరూ, బిపి వరించాయి. ఆ తర్వాత నిదానంగా ఆస్తమా నేను ఉన్నానన్నది. కోపం, ఉద్వేగం, ఉద్రేకం, అసలు మేమే నీ తోడూ నీడా అని తనువునీ, మనసునీ ఆక్రమించాయి.

సిటిస్కాన్ 'కోరాడ్ - 6' : ఆయనకి తన గురించి భయం డెబ్బైపాళ్ళు, భార్య గురించిన బెంగ ముప్పైపాళ్ళు.

ఆమె పార్వతి, రూము నెంబరు రెండులో ఉంది. తనకు కోవిడ్ అనగానే ఆమెకు చావు భయం పట్టుకుంది. హాస్పిటల్‌లో పడేస్తే దిక్కులేని చావు అవుతుందని టీవీలో చూసి చూసీ, విని వినీ ఆమె గుండె బేజారైపోయింది. దీనికి తోడు ఆమెకు తన దైనందిన పూజా పునస్కారాల మీద ఈ రోగం దొంగ దెబ్బ తీసిందని లోలోపల కసి రేగుతోంది. నిస్సహాయత దుఃఖాన్ని సలుపుతోంది.

రూమ్ నెంబరు మూడు : అరవింద్ 35 ఏళ్ళు. తండ్రి వారసత్వంగా అన్ని వక్రవిక్రమాలూ ఆక్రమించేయి. చేసే ఉద్యోగం మార్కెటింగ్. దాని కాళ్ళకింద నీళ్ళు రావడం మొదలైంది. కోవిడ్ కంటే అతన్ని ఉద్యోగ భయం గట్టిగా పట్టుకున్నది.

నిర్మలకి ఆర్ టి పీసీ ఆర్ రెండుసార్లు 'నెగటివ్' 'నాకూ అది ఇచ్చి చావకూడదూ ఆ టెస్టులు చేసే వెధవలు?' అని చాలాసార్లు అనుకుని, పైకి అనీ సతమతమైంది పార్వతి. కానీ వాళ్ళు నీకా సర్టిఫికేట్‌కి అర్హత లేదన్నారు.

నిర్మల అక్కడికేదో సంపూర్ణంగా దిగులు 'ఫ్రీ' అనుకోకూడదు. ఆమె పదీ, ఎనిమిదీ - కొడుకూ, కూతుళ్ళని ఒంగోలులో ఆమె పుట్టింటికి సెలవలకని పంపింది (పదీ, ఎనిమిది క్లాసులు కాదు వయస్సులు) లాక్‌డౌన్, షట్‌డౌన్ అయిపోయారు వాళ్ళు! ఎప్పటికీ నిర్బంధానికి ముగింపో అని మనసు కాళ్ళకి పదేపదే తొట్రుపాటుని నేర్పుతోందామెకు.

ఇప్పుడు చీకటి ముసురుతోంది.

నిర్మల స్నానం చేసి వచ్చింది. దేవుని గదిలో దీపం వెలిగించి తిండి కార్యక్రమం చూడాలి.

> 'నిర్మలా! అదెందుకో మూలుగుతోంది చూడమ్మా! మతిలేని మనిషి. ఎప్పుడు ప్రకోపిస్తుందో తెలీని మాయదారి రోగం ఒహటీ' అని తన సహజ 'టోన్'లో విసుక్కున్నాడు పరబ్రహ్మం.

'నిర్మలా! అదెందుకో మూలుగుతోంది చూడమ్మా! మతిలేని మనిషి. ఎప్పుడు ప్రకోపిస్తుందో తెలీని మాయదారి రోగం ఒహటీ' అని తన సహజ 'టోన్'లో విసుక్కున్నాడు పరబ్రహ్మం.

వెళ్ళి చూసింది. పార్వతి ఫోన్‌లో 'యూట్యూబ్' లో ఉన్నది. అలికిడికి తలెత్తి 'చూశావుటే ఈయన వైరస్‌ల మీద వెయ్యి పేపర్లు రాశాడుట. ఈ కోవిడ్ వేరు, ఇది వస్తే 'ఇంతే సంగతులు' అని ఖండితంగా చెబుతున్నాడు' అన్నది.

'ఏవో రకరకాల పరిశోధనలు జరుగుతున్నాయి అత్తయ్యా. మీరవన్నీ వినకండి, చూడకండి' అని కొంచెం దృఢమైన స్వరంతోనే అన్నది. వెంటనే 'ఈ సమయంలో శివస్తోత్రం మంచిదంటారుగా హాయిగా చదువుకుంటూ పడుకోండి' అని గద్దించింది. తాను తన పనివైపు నడిచింది.

పరబ్రహ్మం ఈ మాటలు విన్నాడు 'అదే నేను మొత్తుకునేది కూడా. విని ఛస్తేగా' అని దైహికంగా కాకుండా, మానసికంగా నెత్తీనోరూ కొట్టుకున్నాడు.

నిర్మల కాస్త విరామ ఊపిరులూదుకుని హాల్లోకొస్తుంటే అరవింద్ కేక 'ఎక్కడే?' అంటూ.

వెళ్ళింది. 'మీ అన్నయ్య ఫోన్. పిల్లలు బాగానే ఉన్నారట గానీ, మీ నాన్నకి పాజిటివ్ అట' చెప్పాడు.

ఆమె మనసున దిగులు మేఘం మరింత నల్లగా ముసిరింది. ఏమీ మాట్లాడలేదు. స్టూల్ మీద కూచుంది.

'నాకు ఇప్పుడో ఇంటర్వ్యూ ఉంది. అదయిన తర్వాత టిఫిన్' అన్నాడు. ఇవన్నీ మామూలే ఆమెకు. 'అలాగే' అన్నట్టు తలూపి లేచి వచ్చింది. అరవింద్ వేరే కంపెనీల్లో ఉద్యోగానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. ముందు జాగ్రత్తచర్య! నిర్మలకు అంతవరకూ తెలుసు! వేటలో జంతువు పడితేనే గదా వార్త! అప్పటి వరకూ ప్రయాసే!

*************

తెల్లవారుజామున నాలుగు.

నిర్మల దినచర్య మొదలు. తన కాలకృత్యాల తర్వాత నాలుగు ఫ్లాస్క్ లలో వేడీనీళ్ళు మూడు గదులవాళ్ళకూ కషాయాలూ, మందులూ సర్దింది.

పాలు కాయబోతుంటే అరవింద్ గదిలో నుంచి ఖళ్ళుఖళ్ళుమని దగ్గూ, దానితో తేలిపోతూ 'నిర్మలా' అని బలహీనమైన స్వరంతో పిలుపు.

గబగబా గదిలోకి వెళ్ళింది.

దగ్గుతో ఆయాసంతో, మంచంమీద వెనక్కు కూచోవాలని ప్రయత్నించాడుట. నడుం పట్టేసింది. ఒళ్ళంతా చెమట, కళ్ళల్లో నీళ్ళు.

'ముందుగా పిలవకపోయారా' అంటూ అతనికి ఆసరా ఇచ్చి, పైకి జరిపి, వెనక దిండు పెట్టి ఆనుకునేలా కూర్చోబెట్టింది.

ఆయాసంతో ఛాతి పట్టుకుని దిండుని ఒళ్ళో పెట్టుకుని వంగి దగ్గుతున్నాడు.

మందుతెచ్చి నీళ్ళందించింది వేసుకున్నాడు.

'నువ్వేం చేసినా నేను బతకనే' అని నిస్పృహతో మాట గద్గదికమైంది. కళ్ళల్లో నీళ్ళు. ఏడుస్తున్నాడు.

నిర్మలకి గుండె జారింది. తనకు దుఃఖం పొంగింది. అంతలోనే

తమాయించుకుని 'పిచ్చి మాటలు మాట్లాడకండి. అంతా సర్దుకుంటుంది ఇంకో వారం మాగ్జిమమ్' అని భుజాన చెయ్యేసి సముదాయించింది.

హాల్లో పచార్లు చేస్తున్న పరబ్రహ్మం కేకేశాడు 'ఏమైంది నిర్మలా?' అంటూ.

నిర్మల హాల్లోకొచ్చి 'ఏం కాలేదు. దగ్గు తెర కాస్త ఉక్కిరిబిక్కిరి చేసింది. అంతే' అని ఆయన కాఫీ పనిమీద వంటింట్లోకి నడిచింది.

ఆమె ఆలోచన ఆమెతోనే నడిచింది. అరవింద్‌కి రోగ తీవ్రత ఏమైనా పెరిగిందా? కోవిడ్‌తో సమస్యంతా లంగ్స్ లోనే అంటున్నారు డాక్టర్.

చంద్రశేఖర్ గారు 'భయపడకండి ఏం కాదు...' అని నవ్వేస్తూ, అభయమిస్తున్నారు. మనసు పరిపరివిధాల పోతుంది. కాఫీ కలిపి తెచ్చి మామగారికి ఇచ్చింది.

తాను పూజాదికాల్లోకి దిగింది. యాంత్రికంగా జరుపుతోంది...

పదకొండయింది డాక్టర్‌కి ఫోన్ చేసింది. ఆయన 'హాస్పిటల్‌లో అడ్మిట్ చేస్తారా అంటే, 'నో' అంటుంటిరి. మీ మాటలు సబబుగానే వున్నాయి. ఒక్కదానివీ అక్కడికీ ఇక్కడికీ ఏం తిగురుతావ్? ఇంట్లో చూడబోతే మరో ఇద్దరు పేషంట్సాయె నీకు' అని మందులు రాసి వాట్సప్‌లో పెట్టాడు. 'రెండ్రోజుల్లో సర్దుకోవాలి' అన్నాడు.

> తులసి మొక్కలో నీళ్ళు పోసి వెనక్కి వస్తున్నది నిర్మల. గుమ్మం మెట్లెక్కుతుంటే పెద్దగా 'నిర్మలా' అంటూ కేకవేశాడు పరబ్రహ్మం.
>
> చేతిలో గ్లాసు పడేసి అటువైపు పరుగెత్తింది.

గత్యంతరం లేని పనులు మనసులో వేదన ఇరుసున పట్టిన కందెనలా నలిగిపోతోంది.

క్షణక్షణమొక యుగంగా రెండురోజులు గడిచాయి. ఒంగోలులో పరిస్థితి అలాగే వుంది.

****************

తులసి మొక్కలో నీళ్ళు పోసి వెనక్కి వస్తున్నది నిర్మల. గుమ్మం మెట్లెక్కుతుంటే పెద్దగా 'నిర్మలా' అంటూ కేకవేశాడు పరబ్రహ్మం.

చేతిలో గ్లాసు పడేసి అటువైపు పరుగెత్తింది.

భార్య గది గుమ్మంబయట స్తబ్ధుడుగా పరబ్రహ్మం.

గదిలోకి చూసింది నిర్మల.

గది ఖాళీగానే వుంది. పార్వతమ్మ గదిలో లేదు.

గుండె గుభేలుమంది. 'అట్టా నిలబడతారేం మామయ్యా' అంటూ తానే బయటికి పరుగెత్తింది. అప్పటికే ఆమెకు ఏడుపొస్తోంది.

కంగారు కంగారుగా ఇంటా బయటా పెరడూ వెతికింది. లేదు.

ఉన్నట్టుండి 'ఇదిగో.... ఇక్కడా' అని అరిచాడు పరబ్రహ్మం.

చెంగున ఆవైపు పరుగెత్తింది.

భుజాల వరకు నీటిసంపులో అత్తగారు!

చేతులు అందించి పట్టుకుని పైకిచేర్చారు. గదిలోకి తీసుకొచ్చి చీరమార్పించి జాకెట్ తొడిగించింది. పార్వతమ్మ వొణుకుతోంది.

మంచంమీదకి చేర్చి, పడుకోబెట్టి దుప్పటి కప్పింది.

నిర్మల మేధలో ఒక్క లిప్తకాలంలోనే కోటి ప్రశ్నలు మొలిచాయి. 'డిప్రెషన్' వలన ఆవిడ ఆత్మహత్యా ప్రయత్నం చేసిందా? కొన్ని కేసులు ఇట్టాంటివి ఉన్నట్టు విన్నది.

ఈ ఊహకే నిర్మల వెన్ను జలదరించింది.

పరబ్రహ్మం వచ్చాడు. గది గుమ్మం బయటే నిలబడి 'ఏం జరిగిందే? ఎట్టాపడ్డావే? అసలు అక్కడికెందుకెళ్ళావ్? ఎప్పుడెళ్ళావ్?' అని ప్రశ్నల వర్షం కురిపించసాగేడు.

పేలవంగా పిచ్చినవ్వు నవ్వింది పార్వతమ్మ. ఆ వెంటనే 'నా చావు నేను చచ్చే స్వేఛ్ఛ కూడా లేని పాడుబతుకై పోయింది. ఈ మాయదారి రోగం తొందరగా తీసుకుపోతే బాగుణ్ణు. పీడా విరగడవుతుంది. అంతా నా ఖర్మ' అంటూ పెద్దగా 'నాకు తెలుసు నేనెటూ చస్తాను. నాకు తెలుసు' అని అరుస్తోంది.

నిర్మల మనసులో ఆవేళ అరవింద్ అన్నమాటలు ఖంగున మ్రోగాయి. తత్తరపడింది. అత్తగారి పక్కన కూర్చుని వీపుమీద చెయ్యివేసింది. ఇటువైపు తిరిగి భోరుమన్నది ఆవిడ.

నిర్మలకి కళ్ళు చెమర్చాయి. 'భయపడకండి మీకేం కాదత్తయ్యా' అని కళ్ళు తుడిచింది. లాలనగా వీపు నిమరడం మొదలుపెట్టింది.

కొద్దిసేపటికి పార్వతమ్మకి కునుకుపట్టింది.

డాక్టర్‌కి ఫోన్‌లూ, మందులూ....

మధ్యలో అరవింద్ విషయాలు చెబుతూ వుండటం, అతని బాధలకి 'కరణేషుదాసి' కావటం... అంతా, అన్నీ తానై అవస్థ పడుతోంది నిర్మల.

****************

తెల్లవారుజామున లేచి తన దినచర్య ప్రారంభించింది నిర్మల.

'అమ్మాయ్ నిర్మలా! లేచావు గదా! నేనూ లేచానులే' అదాటుగా మాట వినిపించింది. పక్కన పార్వతమ్మ!

'ఇవాళ కార్తీక పౌర్ణమి కదా తొందరగా పూజ చేసుకుని గుడికి పోయొద్దాం' అంటూ తన జుట్టుముడి సర్దుకోసాగింది అత్తగారు.

> నిర్మలకు గుండె దడదడలాడింది. అసంకల్పంగా 'మామయ్యగారూ! ఓసారిలా రండి' అని కేకేసింది. ఉలిక్కిపడి లేచి హాల్లోకి వచ్చాడు పరబ్రహ్మం. ఇద్దర్నీ చూశాడు. ఆయన ఏదో అనబోయేలోగా పార్వతమ్మే అన్నది.

నిర్మలకు గుండె దడదడలాడింది. అసంకల్పంగా 'మామయ్యగారూ! ఓసారిలా రండి' అని కేకేసింది. ఉలిక్కిపడి లేచి హాల్లోకి వచ్చాడు పరబ్రహ్మం. ఇద్దర్నీ చూశాడు. ఆయన ఏదో అనబోయేలోగా పార్వతమ్మే అన్నది. 'ఇవాళ పౌర్ణమి సోమవారం. మీరు కూడా మీ స్నానం, సంధ్యా కానీయండి. గుడికి పోయొద్దాం'

పరబ్రహ్మం అవాక్కయి అయోమయంగా నిలిచాడు.

ఈ హడావిడికి అరవిందు లేచి తన గది బయటకు వచ్చి చూశాడు.

నిర్మలే ముందుగ తెప్పరిల్లింది. అత్తగారికి చెప్పవలసిన విధంగా చెప్పింది. పరబ్రహ్మం తాను పెట్టవలసిన నాలుగూ పెట్టాడు. అరవింద్ విసుగ్గా 'ఏమిటో ఎవరి చావు వాళ్ళు చావండి' అని మళ్ళీ గదిలోకి వెళ్ళిపోయాడు.

'కరోనా లేదు నా బొందా లేదు పోతే పోతాను. ఈ ముక్కుమూసుకుని స్నానం, జపం, ధ్యానం, పూజ ఏమీ లేకుండా ఈ జైలు బతుకు నావల్ల కాదు....' అని స్పష్టంగా రణగొణ ధ్వనినీ, రాళ్ళ వాననీ వినిపిస్తోంది. చూపిస్తోంది పార్వతమ్మ.

అర్జంటుగా డాక్టర్ గారికి ఫోన్ చేసి ఆమెతో మాట్లాడించారు. ఆయన ఏం చెప్పారో కాని పోయి గదిలో పడుకుంది పార్వతమ్మ.

******************

ముందుగా కోవిడ్ తగిలిన అరవింద్ కి ఇవాళ పదహారో రోజు. పరీక్ష చేయించవచ్చు అన్నాడు డాక్టరు.

తానూ చేయించుకుంటానని పట్టుబట్టింది పార్వతమ్మ. సరే నేనూ చేయించుకుంటానన్నాడు పరబ్రహ్మం.

ముగ్గురికీ టెస్ట్ లు జరిగినై.
ఆ రాత్రికి రిపోర్టులు వచ్చినై ముగ్గురికీ నెగిటివ్!

'వాడికి వచ్చిన తర్వాత నాలుగురోజులకి కదా నాకు వచ్చింది!' అని నోరెళ్ళబెట్టింది పార్వతమ్మ.

'ఆ తర్వాత రెండు రోజులకు కదా నేను చేయించుకున్నది!" అని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు పరబ్రహ్మం.

'పోనీలే తరుగులో మెరుగు' మనసు కుదుటపడింది నిర్మలకి.

'ఏమిటో, ఎవరికి ఎందుకు ఎప్పుడు వస్తుందో తెలీని మాయదారి రోగమైపోయింది కరోనా. అందుకే దీన్ని 'విఘూచి' అన్నార్ట యోగవాసిష్ఠంలో. ఎప్పుడో చెప్పారు శాస్త్రి గారు' అని దీర్ఘం తీసింది పార్వతమ్మ.

'అవున్లే అత్తయ్యా! కొన్ని సంభవాలు వచ్చీపోయే అతిథులే. కాకుంటే తగిన జాగ్రత్తలు అవసరం. అంతే. అతిథులనంగానే కాస్తంత మర్యాద కోరుకుంటారు గదా' అని నవ్వింది నిర్మల.

ఈ సంరంభంలోనే ఒంగోలు నుంచి ఫోన్. నిర్మల అన్నయ్య పిల్లల్ని తీసుకుని కారులో బయలుదేరినట్టు!

నిర్మలకి దిగులు తీరింది.

> 'ఏమిటో, ఎవరికి ఎందుకు ఎప్పుడు వస్తుందో తెలీని మాయదారి రోగమైపోయింది కరోనా. అందుకే దీన్ని 'విఘూచి' అన్నార్ట యోగవాసిష్ఠంలో. ఎప్పుడో చెప్పారు శాస్త్రి గారు' అని దీర్ఘం తీసింది పార్వతమ్మ.

ఆ మర్నాడు అరవింద్‌కి వేరే కంపెనీ నుంచి కాల్ లెటర్ వచ్చింది ఉద్యోగానికి!

ఇంటిని కమ్ముకున్న 'భయం' కాస్తా 'అభయం' అయింది. కాదు దానిపేరు నిర్భయంట!

*****************

ఇంతకీ ఇదంతా ఏడాది క్రితం గాథ!

ఈ మధ్యలో ఇంటిల్లిపాదికి 'వేక్సిన్‌లు' రెండు డోసులూ అయినై.

'నిర్భయం' 'నిశ్చింత' కూడా అయింది!

కానీ....

ప్రస్తుతం నిర్మలకు....

వారంనుంచీ జ్వరం, దగ్గు, ఊపిరి తీసుకోవడంలో ఇబ్బందీ, ఒళ్ళు, కీళ్ళు నొప్పులూ, వీటికితోడు అసందర్భపు మాటలు, అస్తవ్యస్తపు చేష్టలూ.... స్థలకాల స్పృహలో హఠాత్ పరిణామం.

అన్ని పరీక్షలూ అయినై....

ఇంకా ఇదమిత్థంగా పేరు తెలియని కరోనా వేరియంట్ అన్నారు.

అయినా వేక్సిన్ రెండు డోసులూ, అయినై కనుక ఫర్వాలేదు అని బోలు ఉపశమనం!

ఇప్పుడు గది ఒక్కటే కానీ అది చాలా ఇరుగ్గా ఉంది!
రోగి ఒక్కర్తే.... కానీ ఆమె 'కీ' పర్సన్!!
వైద్యం జరుగుతోంది.
కుటుంబ సభ్యులంతా మొహాలు వ్రేలాడేసుకుని పూటలు గడుపుతున్నారు.
అరవింద్ గూగుల్‌తో కుస్తీ పడుతున్నాడు.

ఇప్పుడు ఆ ఇంటిని గతంలోకన్నా మరింత దట్టంగా కమ్ముకున్నది- 'భయం'!!

కానున్నది.....???
కాలగర్భంలో దాగున్నది!!!

# వ్యవహార భాషా పరిణామం



**ఆచార్య అయినవోలు ఉషాదేవి**
విశ్రాంత ఆచార్యులు, పూర్వ పీఠాధిపతి,
భాషాభివృద్ధి పీఠం, పొట్టి శ్రీరాములు
తెలుగు విశ్వ విద్యాలయం

చారిత్రకంగా నూ సాంప్రదాయికంగానూ బహుధావిభక్త మైన భారతదేశం లో వివిధ భాషా కుటుంబాలకు చెందిన భాషల వ్యవహర్త లున్నారు. స్వాతంత్ర్యానంతరం భాషా ప్రయుక్త రాష్ట్రాలు గా ఏర్పడి నప్పటికీ, ఏ రాష్ట్రం లో కూడా ఆ ప్రయుక్తమైన భాష మాత్రమే జన వ్యవహారం లో లేదు. ప్రతీ రాష్ట్రం లోనూ అనేక భాషలు మాట్లాడే వివిధ ఇతర రాష్ట్రాల ప్రజలు, ఇక్కడే మూల వాసులుగా ఉన్న అనేక ఆదివాసీ గిరిజనులు అన్ని రాష్ట్రా లలోనూ ఉన్నారు. అయితే నిజానికి రాచరిక పాలనల్లో ఏ ఒక్క భాషా సమాజమూకూడా ఒంటరిగా లేదు. అంటే ప్రతిరాజూ అనేక భాషలు మాట్లాడే ప్రాంతాలను, ప్రజలను పాలించాడు అని అర్థం. అందువల్ల తెలుగు మాట్లాడే వారు అందరూ అన్ని సందర్భాల్లో ఒకే పాలన కింద లేరు అనేది చారిత్రక వాస్తవం. వివిధ కాలాలలో భిన్న భాషలు అంటే సంస్కృతం, ప్రాకృతం, తర్వాత ముస్లింల పాలనలో ఆరబిక్, పర్షియన్, ఉర్దూ వంటి భాషలు ఎంతటి రాజ్య ఆధిపత్యం పొందినా అనేక భారతీయ భాషలు తమ ఉనికిని, సాహిత్యాన్నీ కాపాడుకొని నిలబెట్టు కున్నాయన్నది వాస్తవం. వీటిలో ప్రధానమైనవి ఇండో- ఆర్యన్ భాషలైన మరాఠీ, గుజరాతీ, ఒరియా, బెంగాలీ వంటివి కాగా తెలుగు, తమిళం, కన్నడ మలయాళ భాషలు ద్రావిడ భాషా కుటుంబానికి చెందినవి. వేల సంవత్సరాల పరిణామ ఫలితంగా ఈ భాషల్లో చాలా కాలం రాసే భాష, వ్యవహార భాష రెండూ  విడి విడి గా అభివృద్ధి చెందుతూ వచ్చాయి. ఈ రెండు రూప భేదాలను భాషా శాస్త్రం లో **diglossia** అంటే ద్వై భాషికత అంటారు. ఇట్లాంటి రూప భేదాలు అనేక లిఖిత భాషల్లోకనిపిస్తాయి.

తెలుగు భాషా సాహిత్యం లో విలక్షణ మైనది పద్య/ కావ్య సాహిత్యం. ఈ పద్య రచన మనకు శాసనాల కాలం నుండీ కనిపిస్తుంది. అందువల్ల ఛందస్సు కోసం అంటే మాత్రా గణాల కోసం భాషా లక్షణాలకు లోబడే, వాటికి అనుగుణంగానే తెలుగు కవులు పదాలకు అనేక రూపాంతరాలు రూపొందించుకొని వాడారు. అందువల్ల వాటిలో ఏ రూపాలు కావ్యభాషవో ఏవి జనవ్యవహారమో లేదా వ్యాకర్తలు గ్రామ్యమని వాడకూడదనీ నిషేధించారో అనేది చర్చనీయాంశమయింది. కొందరికి సమ్మత మైనవి మరికొందరికి " దోషాలు" అయ్యాయి.

తెలుగులో ఉన్న / అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ ఐ, ఒ, ఓ, ఔ/ అచ్చులలో తెలుగు మాటలలో ఎక్కువగా పదమద్యం లోనూ పదాంతం లోనూ వచ్చేవి ఉ, ఇ అ అనే హ్రస్వ అచ్చులు మాత్రమే. ఇవి మూడు వేగం గా పలికే టప్పుడు కొన్ని సార్లు ఉచ్చారణ లో పోతాయి. ఉదాహరణకు పలుకు ను పల్కు అని, కూరిమి నీ కూర్మి అని అంటాం. ఈ లక్షణాన్ని కావ్య భాషలో విస్తృతంగా కవులు వాడటం వల్ల భాషలో అనేక రూప భేదాలు ఒక్క మాటకే కనిపిస్తాయి. ఈ విషయం ఇక్కడ చెప్పడానికి కారణం ఈ రూప భేదాలు తర్వాత గ్రాంథిక, వ్యవహార భాషా వాదాల్లో ' ఏది సరి అయిన రూపం, ఏది కాదు అనే వాదాల్లో ప్రాధా న్యాన్ని సంతరించు కోవడం వల్ల. అందువల్ల వ్యాకర్తలు ఈ రూప భేదాలను ప్రస్తావించి సూత్రాలు రాశారు. అలాగే కావ్యాలలో ఎక్కువగా ఉండే ము కారాంత రూపాలు పూర్ణ బిందు రూపాలుగా వాడడం.( గుర్రము~గుర్రం)

కావ్య భాషలో అంగీకరించని అనేక రూప భేదాలు మనకు శాసన భాషలో కనిపిస్తాయి. అంటే అవి అప్పటి వ్యవహారం లో ఉండి ఉంటాయని పరిశోధకులు గుర్తించారు.

శాసన భాష పై శాసనాలు లభ్యమవుతున్న కాలం నుండి చివరి శాసనం వరకూ అంటే నన్నయకు పూర్వం నుండి నన్నయ వరకూ అంటే 11వా శతాబ్దం చివరి వరకూ బూదరాజు రాధాకృష్ణ గారు పరిశోధించి సిద్ధాంత వ్యాసం రాశారు. తర్వాత 11 నుండి 16 వ

> కావ్య భాషలో అంగీకరించని అనేక రూప భేదాలు మనకు శాసన భాషలో కనిపిస్తాయి. అంటే అవి అప్పటి వ్యవహారం లో ఉండి ఉంటాయని పరిశోధకులు గుర్తించారు

శతాబ్ద శాసనాలపై ఎం. కందప్ప చెట్టి గారూ, 16 వ శతాబ్దాంతం నుండి 1900 వరకు కే కే రంగనాథాచార్యులు గారూ పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసాలు రాశారు. వీటి సారాంశాలు తెలుసుకోవాలన్న ఆసక్తి గల వారు తెలుగు భాషా చరిత్ర అనే గ్రంథం చూడవచ్చు. వీరు గుర్తించిన , అప్పటికీ ఇప్పటికీ వ్యవహారం లో ఉన్నవీ, కావ్యాలలో వాడకూడదు అని, గ్రామ్యమని వ్యాకరణాలు రాసి, పండితులు నిషేధించిన వాటిలో కొన్నింటిని తెలుసుకొందాం. ఇవన్నీ శాసనాల తో పాటుగా వ్యాఖ్యానాలలో వచనాలలో, సంకీర్తనలలో ఇంకా అప్పుడప్పుడు అక్కడక్కడా కావ్యాలలోనూ కనిపిస్తాయి.

1. తెలుగు అచ్చుల లో అ ఆ అనే మొదటి రెండు హ్రస్వ దీర్ఘ అచ్చులు తప్ప మిగిలిన అచ్చులు అయిన ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఒ ఓ అనే అచ్చుల ను పదాది లో అచ్చులుగా కాకుండా వాటిని ఉచ్చరించే చోటనే పలికే హల్లులయిన య వ లతో పలకడం, రాయటం ప్రాచీన కాలం నుండి కనిపిస్తుంది. అందువల్లనే చిన్నయ సూరి “ యకారంబును వు వూ వొ వో లును తెలుగు మాటలకు ముందు లేవు “ అనే నిషేధ సూత్రం చెప్పడం జరిగింది. కానీ వీటి వాడుక ఆగి పోలేదు. ఆంగ్లేయుల పాలన కాలం లో కూడా పదాది య కార, వ కారాలతోమాట్లాడే రాసే వ్యవహారాన్ని గుర్తించారు పాశ్చాత్యులు. అందువల్లనే 1800 ప్రాంతాల్లో తెలుగు నేర్చుకుని తెలుగుకు వ్యాకరణం, నిఘంటువు రాసిన విలియం బ్రౌన్ (William Brown) తన నిఘంటువు ను తెలుగు లిపి లోనే రూపొందించినా, కేవలం అ ఆ ల పదాల తర్వాత క తో పదాలు ఇచ్చాడు. మరి తెలుగు అక్షర క్రమం ఏది అంటే ఇ ఈ ; ఎ ఏ లతో మొదలయ్యే తెలుగు మాటలను అంటే ఇల్లు, ఈగ, ఎవరు, ఏనుగు వంటి వాటిని య అక్షరం పదాలలో చూసుకోవాలి. అలాగే ఉ ఊ, ఒ ఓ లతో మొదలయ్యే పదాలైన ఉప్పు, ఊరు, ఒకరు, ఓడ వంటి మాటలను వ వచ్చే చోట అంటే ఇంచుమించు అక్షర మాల చివరలో వెతుక్కోవాల్సి ఉంటుంది. మాట్లాడే విధంగా రాసే ఈ పద్ధతి సబబు గానే స్థూల దృష్టి కి అనిపిస్తుంది. కానీ భాషా లక్షణాలలో గుణింతాలు తెలియాలంటేనూ , రెండు మాటలు కలిసే సంధి వివరించాలని అంటేను అచ్చులన్ని తెలిసి ఉండక పోతే భాషా లక్షణం అర్థం కాదు.

2. కావ్యాలలో రాసే చ కొన్ని సూత్రాలకు లోబడి స గామారుతుంది. కానీ వ్యవహారం లో చ స గా మారటం పరిపాటి. చెప్పు చేదు వంటి మాటలు మాట్లాడితే వ్యవహారం లో సెప్పు, సేదు అని పలకడం, రాయటం పరిపాటి. అలాగే స్ కారం రాసే చోట శ పలకటం రాయటం కనిపిస్తుంది. చేసారు అన్న మాటను సేశారు

అని రాయటం శాసనకాలం నుండి కనిపిస్తుంది.

3. మూర్ధన్య ధ్వనులు అయిన ణ ళ లు న ల అని రాయటం , పలకటం రెండూ వ్యవహారం లో ఉన్నాయి.

4. కావ్యాల లోనే లోపాలతో వాడబడ్డ శకట రేఫ క్రమ క్రమంగా వాడుకలో పోయి ర అని రాయడమే నిలిచింది.

5. సంస్కృతం నుండి వచ్చి చేరి తత్సమ రూపాలుగా మారినా, ఆయా పదాల లోని మహా ప్రాణ అక్షరాలూ వాటి ఉచ్చారణ తెలుగులో నిలదొక్కు కున్నాయి. ఇవి రాసే భాషలోనే కాకుండా చదువుకున్న వాళ్ళ ఉచ్చారణలో నూ నిలిచిపోయింది. కానీ ఇటీవల చదువుకున్న వాళ్ళల్లో చాలా మంది లో మహా ప్రాణ రూపాలు అల్ప ప్రాణాలు మారిపోవటం ఎక్కువ కనిపిస్తోంది. ముఖ్యంగా టి. వి , ఇతర మాధ్యమాల్లో ఎక్కువగా కనిపించే, మాట్లాడే వారివల్లా, సంస్కృత ధ్వని ఉచ్చారణ, రాయటం అవసరం లేదని వాదించే చదువుకున్న వారి వల్లా ఈ పరిణామం చోటు చేసుకుంటోంది. దీని మంచి చెడ్డల గురించిన చర్చ ఇక్కడ ప్రస్తుతానికి అప్రస్తుతం.

6. కావ్య/ గ్రాంథిక క్రియా రూపాల లో అనేక మార్పులు చోటు చేసుకొని ప్రాంతాల వారీగా మారిపోయాయి. ఈ రూపాలలో హ్రస్వ దీర్ఘ భేదాల వల్ల ఇంకా కొన్ని ఇతర మార్పుల వల్ల పరస్పర అవగాహనలో కొంత క్లిష్టత పెరుగుతూ వచ్చింది

7. పదాల మధ్యలో అచ్చు కొన్ని ప్రాంతాలలో నిలిచి ఉంది మరి కొన్ని ప్రాంతాలలో పోవడం వల్ల ప్రాంతీయ మాండలిక భేదాలు ఏర్పడ్డాయి.

8. పదాది వ కార ఉచ్చారణ అంటే వెన్నెల వాన, వెండి వేట వంటి వాటిలో వ పోయింది. ఎన్నెల, ఆన, ఎండి~ యెన్డి; ఏట~ యాట

పైన వివరించిన విధంగా కావ్య భాష/ గ్రాంథిక భాష తో పాటే ఉంటూ వచ్చిన వ్యవహార భాష క్రమం గా దక్షిణాంధ్ర సాహిత్యం లో యక్షగానం మొదలయిన వాటితో బాటు కావ్యాలలో కూడా స్థానం సంపాదించు కుంది.

వాడుక భాషలో ఇట్లా ఏర్పడ్డ అనేక రూప భేదాలను వ్యాకర్తల తర్వాత గుర్తించిన వారు తెలుగు నేర్చుకున్న పాశ్చాత్యులు; ముఖ్యం గా ఆంగ్లేయులు. అందుకే వాళ్లు విద్యాబోధన లో వ్యవహార భాష ఉండాలనీ, దానితో పాటూ

పరిపాలన, న్యాయ రంగాల్లో కూడా ప్రజల వ్యవహార భాష ఉండాలనీ గుర్తించారు. వారి తో

కలిసి గిడుగు రామ్మూర్తి పంతులు గారు, గురజాడ అప్పారావు గారు ప్రజలంతా విద్యావంతులు కావాలంటే వ్యవహార భాష లోనే విద్య, పాలన, న్యాయం ,పత్రికలు సృజనాత్మక, వైజ్ఞానిక సాహిత్యాలు సమస్తం వ్యవహార భాష లోనే ఉండాలని ఉద్యమాన్ని నడిపారు.

> ఆంగ్లేయుల కాలానికి చాలా కొద్ది మందికే పరిమితమైన విద్య నేర్పడం నేర్చుకోవడం అనేవి వాళ్ళ పాలనలో పూర్తి మార్పులకు లోనైంది. అక్షరాస్యతా ప్రాధాన్యం గా విద్యను ప్రాథమిక, ఉన్నత పాఠశాలల లోనూ, విశ్వ విద్యాలయాల స్థాపనల తోనూ అనేక కొత్త కొత్త మార్పులు చోటు చేసుకున్నాయి.

ఆంగ్లేయుల కాలానికి చాలా కొద్ది మందికే పరిమితమైన విద్య నేర్పడం నేర్చుకోవడం అనేవి వాళ్ళ పాలనలో పూర్తి మార్పులకు లోనైంది. అక్షరాస్యతా ప్రాధాన్యం గా విద్యను ప్రాథమిక, ఉన్నత పాఠశాలల లోనూ, విశ్వ విద్యాలయాల స్థాపనల తోనూ అనేక కొత్త కొత్త మార్పులు చోటు చేసుకున్నాయి. కుల వర్గ వృత్తి భేదాలను కొంతలో కొంత తగ్గించేందుకు ఈ విద్యా విధానం నాంది పలికింది అని చెప్పుకోవచ్చు. దాని వల్ల కాలానికి చెందిన ఆధునిక దృక్పథం పెంపొందించు కున్న వారు సంప్రదాయ సంకుచితత్వాలను పారదోలేందుకు పూనుకొని ప్రజలను చైతన్య పరిచే విధంగా వివిధ సామాజిక విద్యాత్మక సంస్కరణలకు పూనుకున్నారు. ఆధునిక - అంటే అప్పటి కాలానికి వచ్చిన అనేక పారిశ్రామిక విప్లవాత్మకమైన మార్పుల కారణంగా భారత దేశం లో రైల్వేలు తపాలా వ్యవస్థ వంటి వాటితో పాటు విద్య తో పరోక్షంగానో, ప్రత్యక్షంగానో ముడిపడిన అచ్చు యంత్రాల ద్వారా తాళ పత్ర గ్రంథాలలో శిథిల మవుతున్న తెలుగు సాహిత్య ముద్రణ, రేడియో, సినిమా, పత్రికలు వంటి అనేక మాధ్యమాలు ఏర్పడుతూ ఉండడం వల్ల కావ్య భాష ప్రాధాన్యం క్రమ క్రమంగా తగ్గిపోతూ వచ్చింది. సాహిత్య రచన పద్యం నుండి వచనం లోకి మారి పాశ్చాత్య ప్రభావాల తో నవల, కథ, నాటకం వ్యాసాలు

వంటి వివిధ ప్రక్రియలలో విశిష్ట మైన సృజనాత్మక సాహిత్యం ప్రారంభ మై ఆధు నిక వచనం ఆధునిక ఆలోచనలు అనేక విధాలుగా వ్యాపింప జేసాయి.

పైన వివరించిన విధంగా సామాజికంగానూ, రాజకీయ ఆర్థిక రంగాల లోనూ అనేక రకాల మార్పులు చోటు చేసుకున్నప్పటికీ, విద్యా రంగం లోనూ, న్యాయ రంగం లోనూ పరిపాలనా రంగం లోనూ రావాల్సిన అధునిక తెలుగు భాషా వినియోగం ఆచరణ అమలు జరగక అన్నిరంగాల లోనూ ముఖ్యం గా విద్యా రంగం లో అవాంఛనీయ మార్పులు జరిగి విద్యా రంగం లో నే తెలుగు ప్రాధాన్యమూ, తెలుగు వినియోగము తగ్గి పోతూ ప్రస్తుతం అనేకమంది విద్యావేత్త లనూ భాషాభిమానులనూ ఆందోళనకు గురి చేస్తోంది.

విద్యారంగం లో తెలుగు ప్రాధాన్యం తగ్గుతూ రావటం వల్ల తెలుగు లో సృజనాత్మక సాహిత్యం వచ్చినంతగా వైజ్ఞానిక సాహిత్యం రాని పరిస్థితి ఏర్పడింది. ఏ భాష లో నైనా సాహిత్యం వేల యేళ్లు గా ఉండీ ఆధునిక వైజ్ఞానిక రంగాలైన మానవీయ ( humanities) సామాజిక ( social) , సామాన్య ( natural sciences) శాస్త్రాలలో మౌలిక ( original) అనువాద ( translation) రచనలు రావాల్సి నంతగా రానప్పుడు ఆ భాష పురోగతి కుంటుబడుతుంది. ఆ విధంగా సమాజానికి దాని అస్తిత్వానికి ఆధారమైన బాషాభివృద్ధికి ఆటంకం కలుగుతుంది. ఈ నష్టం ఇప్పుడే అరికట్టక పోతే దాని ఫలితం భావి తరాలపై పడి వారి భాషా వినియోగానికి హాని చేస్తుంది. ఎంతగా వినియోగం తగ్గితే అంతగా మూల పడిపోయే అంటే నశించ టానికి చేరువయ్యే ప్రమాదమూ ఏర్పడుతుంది.

అంటే, 13 వ శతాబ్దం లో కేతన చెప్పినట్లు కొంత తానే కలిగి ఉన్న తెలుగు భాష సంస్కృత, ప్రాకృత సంపర్కాలతో సంపన్నమైన సాహిత్యాన్ని సృష్టించుకొని, పదజాలాన్ని అభివృద్ధి పరుచుకుని భారతీయ భాషలలోనూ, భారతీయ సాహిత్యం లోనూ మంచి స్థానం, గుర్తింపు పొందిన తెలుగు నేడు ప్రజల, ప్రభుత్వాల నిర్లక్ష్యం వల్ల ఈ దుస్థితికి కారణమవుతున్నది. మాతృ భాష తో సహా పలు భాషలు ఏ ఇబ్బందీ లేకుండా బాల్యం లో నేర్చుకో గల పిల్లల శాస్త్రీయ సామర్థ్యాన్ని అర్థం చేసుకో కుండా కేవలం ఆంగ్ల మాధ్యమం తో ప్రగతి, అభ్యుదయం సాధించటం సాధ్యం కాకపోగా, రెండువేల యేళ్లు గా అనేక ఢక్కా మొక్కీలను ఎదుర్కొంటూ ఎదిగిన తెలుగును చేజేతులా మనమే విస్మృత భాష గా చేసుకుంటున్నాం. ఇది గుర్తించి తగిన విధంగా తెలుగు వారూ, ప్రభుత్వాలూ చర్యలు చేపట్టాలని ఆశిద్దాం.

# జన వ్యవహార భాష



**ఆచార్య వెలుదండ నిత్యానంద రావు**
తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వ విద్యాలయం
హైదరాబాదు

పొద్దున లేచింది మొదలు రాత్రి పడుకునే వరకు మనం ఎందరితోనో మాట్లాడాల్సి వస్తుంది. అధికారులు, మిత్రులు, ఉపాధ్యాయులు, వ్యాపారులు, ఇంకా భిన్న భిన్నరంగాల వారితో వ్యవహారాలు నడపవలసి వస్తుంది. ఈ వ్యవహార ప్రయోజనానికి మూలమైన సాధనం వాక్కు - భాష. జీవితంలో అనునిత్యం ఉపయోగిస్తూ వచ్చిన భాషయే సాంస్కృతిక సంబంధబాంధవ్యాలకు దోహదకారి అవుతుంది తప్ప కావ్యభాష కాజాలదు. దురదృష్టవశాత్తు తెలుగు భాషాబోధనం అంటే తెలుగు సాహిత్య బోధనం అని రూఢి కూడా ఏర్పడింది. నన్నయ నుండి చిన్నయ వరకు ఉన్న భాష 'సాహిత్యం' వరకు ప్రమాణీకరింపబడింది. సాహిత్య రచనాపరంగానూ, రసాస్వాదనపరంగానూ ఆ భాష తన ప్రయోజనాన్ని తాను నెరవేరుస్తుంది. కాని పూర్వీకుల కంటే నేడు మనిషి పరిధి ఎంతో విస్తృతమైంది. కార్యాలయాలు, బ్యాంకులు, తపాల ఆఫీసులు, వాణిజ్య సంస్థలు, న్యాయస్థానాలు, ప్రచార ప్రసార మాధ్యమాలు, రైళ్ళు భిన్నభిన్నమైన అధ్యయన విషయాలు (సబ్జెక్ట్స్) వచ్చాయి. విజ్ఞాన సాంకేతికాభివృద్ధి విపరీతంగా పెరిగిపోయింది. రవాణా సౌకర్యాలు మెరుగయ్యాయి. దీనితో మానవుని అవసరాలు పెరిగిపోయాయి. పెరిగిన ఈ అవసరాలన్నింటికీ అనుగుణంగా భాషను వేర్వేరు తీరులుగా వినియోగించుకోవలసి వచ్చింది. ఈనాటి భాష ఆ అవసరాలన్నింటిని తీర్చగలగాలి.

సజీవ భాష స్రోతస్వినిలాంటిది. దేశకాలపాత్రతలనెంచి ఎన్నెన్నో కొత్త పదాలను తనలో ఇముడ్చుకుంటుంది. అన్యదేశ్యాలను ఆదరంగా స్వీకరిస్తుంది. పాతబడ్డ మాటలను విడిచిపెడుతుంది. అవసరాన్ని బట్టి ఒదిగిపోతుంది. ఒక

భాష సజీవత్వానికి లక్షణం ఇదే. ఏ భాషనూ గిరిగీసి హద్దుల్లో బంధించలేం. ఆంగ్ల భాష అంతర్జాతీయ భాషగా గణుతి కెక్కిందంటే అది విస్తృత పదజాలాన్ని సమకూర్చుకోగలగడమే అని చెప్పవచ్చు. గ్రీకు, లాటిన్, ఫ్రెంచి, జర్మన్ పదాల సమాహార స్వరూపమే ఆంగ్లం. ఆంగ్లేయులు తమ నిఘంటువులకు ప్రతి అయిదారేళ్ళకు ఓసారి నూతన పదాలను చేర్చి అనుబంధాలను ప్రచురిస్తారు. అన్యదేశ్యాలను గ్రహించడం వల్ల భాషకు జీవం, జవం వస్తుంది. అన్యదేశ్యాల గ్రహణంలో తెలుగు అగ్రగామిగా నిలిచింది. ప్రాచీన సామాజిక చరిత్ర సమగ్రంగా మనకు తెలియకపోయినా ఆనాటి అవసరాలకు తగినట్లుగా అన్యభాషా పదాలను తెలుగు గ్రహించింది. సాధారణంగా మనపై పెత్తనం చలాయించినవారి భాష నుంచీ, కావ్యగతస్థాయిని సంపాదించిన భాష నుంచీ, పరిసర ప్రాంతాల వారి భాష నుంచీ అన్యదేశ్యాలను గ్రహించడం జరుగుతుంది. మరికొన్ని ఆచారవ్యవహారాల వల్ల, మతాల వల్ల కూడా ప్రవేశిస్తాయి. ఫలానా పదం ఫలానా ప్రత్యేక కారణం వల్లనే తెలుగులో కానీ, మరే భాషలోనైనా కానీ చేరిందని నిర్ధారించడానికి వీలులేదు. శాతవాహనుల కాలంలో రాజభాషగా ఉండడం వల్ల ప్రాకృత భాష ప్రభావం తెలుగు మీద బాగా ప్రసరించింది. ఉదాహరణకు లచ్చి, అచ్చర, అగ్గి, ఆకసం, సింగారం, కంచం మొదలైనవి. వీటిని వికృతులంటాం. కాని ఇవి ప్రాకృత భాషా పదాలు. అలాగే త్రాసు, అసలు, బనాయించు, బందోబస్తు, చాకు, దస్తావేజు, సిపాయి, కూజా, మేజా, గుమస్తా లాంటి పదాలెన్నో ఉర్దూ, అరబ్బీ, పార్సీల నుండి తెలుగులోకి చేరాయి. పరిసర ప్రాంతాల భాషలైన తమిళ, కన్నడ, మరాఠీల నుండి కొన్ని పదాలు తెలుగులోకి వచ్చాయి. తంబి, సాపాటు, సాంబారు, అలమేల్మంగ లాంటి తమిళపదాలు, నంగనాచి, దేవర, పల్లె, హేమాహేమీలు, హోరాహోరీలాంటి కన్నడ పదాలు, ఎకరం, కిరాణా, జిలేబి, పైటలాంటి మరాఠీ పదాలు దృష్టాంతంగా చెప్పుకోవచ్చు. భారతదేశాన్నంతటినీ ఏకసూత్రతతో బంధించి, సాంస్కృతిక

> శాతవాహనుల కాలంలో రాజభాషగా ఉండడం వల్ల ప్రాకృత భాష ప్రభావం తెలుగు మీద బాగా ప్రసరించింది. ఉదాహరణకు లచ్చి, అచ్చర, అగ్గి, ఆకసం, సింగారం, కంచం మొదలైనవి. వీటిని వికృతులంటాం. కాని ఇవి ప్రాకృత భాషా పదాలు.

సమైక్యానికి మూలమైన సంస్కృత ప్రభావం గురించి ప్రత్యేకంగా చెప్పవలసిన పనిలేదు. అన్నం, ముఖం, భార్య, భర్త మొదలైనవన్నీ సంస్కృత పదాలే సుమా అంటే ముక్కున వేలేసుకోవలసిందే. అనాస, టమాట, క్యాబేజీ, బొప్పాయి, అల్మారా, బాల్చి, మేస్త్రీ, తాళపుచెవిలోని చెవి, గోదాము, పీపా, సబ్బు, బిస్కత్తు లాంటి పోర్చుగీసు పదాలు తెలుగువారి జీవితంలో పూర్తిగా కలిసిపోయాయి. అవి తెలుగుపదాలు కావు పోర్చుగీసు పదాలంటే నమ్మశక్యం కాదు. ప్రస్తుతం జనవ్యవహారంలో అంతర్భాగమైన ఆంగ్లపదాలకు లెక్కలేదు. బస్సు, పెన్ను, పెన్సిలు, రోడ్డు, కారు ఇత్యాదులెన్నో తెలుగుకు సహజమైన ఉకారాంతాలుగా రూపుమార్చుకొని తెలుగులో స్థిరపడిపోయాయి.

ఆంగ్లేయుల రాకకు పూర్వం భారతదేశ స్థితి వేరు. నాటి భావాలు వేరు. తెలుగువారి జీవితంలో ఊహకు కూడా లేని ఎన్నో విషయాలు అనుభవంలోకి వచ్చాయి. ఒక నూతన సామాజిక వ్యవస్థ ఏర్పాటయింది. పాలకుల భాష అయిన ఆంగ్లం నుంచి మనం తీసుకొన్నది ఎక్కువే అయినా ఇచ్చినవి కూడా కొన్నయినా లేకపోలేదు. ఆంగ్లేయులకు ముంగీస, పందికొక్కు తెలియవు. మాంగూస్, బాండీకూట్ అని ఆంగ్లీకరించుకున్నారు. జంతువులు ప్రసవించడాన్ని సూచించే స్వచ్ఛమైన దేశీపదం 'ఈనుట' దీన్ని ఇంగ్లీషువారు 'ఈన్' (Year) గా ఇంగ్లీషులోకి మార్చుకున్నారు. 'నక్సలైట్' అన్నపదం కూడా ఆక్స్ ఫర్డ్ నిఘంటుకెక్కింది. 'సంస్కృత ప్రాకృతసమంబగు భాష తత్సమంబు', 'సంస్కృత ప్రాకృతభవంబగు భాష తద్భవంబు' అన్న చిన్నయసూరి బాలవ్యాకరణ సూత్రాలల్లోని, అవ్యాప్తి దోషాన్ని తొలగించి 'అన్యభాషా సమంబగు

ఆంగ్లేయుల రాకకు పూర్వం భారతదేశ స్థితి వేరు. నాటి భావాలు వేరు. తెలుగువారి జీవితంలో ఊహకు కూడా లేని ఎన్నో విషయాలు అనుభవంలోకి వచ్చాయి. ఒక నూతన సామాజిక వ్యవస్థ ఏర్పాటయింది. పాలకుల భాష అయిన ఆంగ్లం నుంచి మనం తీసుకొన్నది ఎక్కువే అయినా ఇచ్చినవి కూడా కొన్నయినా లేకపోలేదు.

భాష తత్సమము' అని, 'అన్యభాషా భవంబగు భాష తద్భవంబు' అని విస్తృతార్థం చెప్పుకోవలసిన తరుణంలో వున్నాం. ఆధునిక ప్రామాణిక భాషలో సంస్కృతాంగ్లాల నుండి ఇంకెంతో పదజాలం గ్రహించవలసి ఉంది. సంస్కృతం నుండి చాలినంత గ్రహించినా ఇంకా పారభాషిక పదాల దగ్గర, మరికొన్ని చోట్లలో మరింతగా గ్రహించవలసే ఉండటం అనుభవంలో ఉంది. ఆంగ్లభాషా పదాలు తెలుగులో రావడం మొదలైంది. అట్లాగని తెలుగు భాషకు కృతకంగా అనిపించేవి, తెలుగుదనానికి భంగం కలిగించేవి ప్రయోగాత్మకంగా స్వీకరించినా స్థిరపడవు. సంస్కృతంలో సహజమైన కర్మణి ప్రయోగాలు, యత్తదర్థక ప్రయోగాలు, భవచ్ఛబ్దం, విభక్తి ప్రత్యయాలు, ద్వివచనం, లింగవిభజన తెలుగువారు గ్రహించలేరు. కారణం అవి ఆంధ్ర భాష సహజ స్వరూపానికి భిన్నమైనవి, భంగకరమైనవి కనుక. అట్లాగే ఇంజనీరింగ్, టెక్నాలజీ, సైన్స్, ఇండస్ట్రీస్ మొదలైనవి మనకు కొత్త. కనుక తగిన పదజాలం భారతీయ భాషల్లో ఉండకపోవడం సహజం. వాటికి వీలైనంత వరకు సమానార్థక పదాలను సమకూర్చుకోవడానికి యత్నిస్తూనే, తెలుగు మర్యాద చెడకుండా అవసరమైన మార్పులు, కూర్పులు చేసుకుని ఆంగ్లపదాలను గ్రహించాలి. అందరికీ అర్థమై సరళంగా పలకగలిగిన ఆంగ్ల పదాలను అలాగే స్వీకరించడం ఉత్తమం. ధూమశకటం (ఇప్పుడు విద్యుచ్ఛకటాలు వచ్చాయి) అని రైలునూ, ద్విచక్రవాహనం అని సైకిలును అనువదించడం శుద్ధ దండగ. 'ఏయ్, రిక్షా! స్టేషనుకు వస్తావా?' అంటే సరిపోయే దానికి 'ఓయీ! త్రిచక్రశకట చోదకా! ధూమశకటములాచోటికి వచ్చెదవా?' అని వ్యవహరిస్తే పిచ్చాసుపత్రికి పోవలసిందే. 'సిద్ధిర్లోకాత్ దృశ్య' అన్నట్లు జనవ్యవహారమందు అత్యధిక ప్రచారంలో వున్న పదజాలం తీసుకోవాలి. ఆంధ్రదేశం నలుమూలలా వ్యాప్తి చెందిన పత్రికల ద్వారా ప్రచారమైన భాష, టెలివిజన్, రేడియోల ద్వారా, నవలా కథానికా సాహిత్యం ద్వారా వ్యాప్తమైన సర్వాంగీకృతమైన సర్వసుబోధకమైన భాషనే జనవ్యవహారిక భాషగా భావించాలి. దానికే ప్రామాణిక భాషగా గుర్తించాలి.

ఒక కొద్ది ప్రాంతానికి పరిమితమైన మాండలికాన్ని ఒక జిల్లాకో, ఒక మండలానికో పరిమితమైన యాసను రచనలో పరిహరించాలి. రచయిత రాసిన దాన్ని ఆ పరిమిత ప్రాంతీయులే చదువరు. అటు శ్రీకాకుళం మొదలు ఇటు నెల్లూరు వరకు, ఇటు ఆదిలాబాదు మొదలు ఇటు చిత్తూరువరకు సర్వులు చదువుతారు. వారందరికీ అర్థమయ్యేలా రాయాల్సిన బాధ్యత రచయిత మీద ఉంది. రచనలో ఎక్కడో సకృత్తుగా అవసరంగా ఒకటి రెండు మాండలిక పదాలు దొర్లితే సందర్భాన్ని బట్టి అర్థం చేసుకోవచ్చు. కాని సంపూర్ణంగా మాండలికంలో

చేసిన రచనలు ప్రయోగాలే అవుతున్నాయి, తప్ప ప్రయోజనదాయకాలు కావడం లేదు. పూర్తి మాండలికంలో కథ, కవిత, ఫీచర్ రైటింగ్ రాస్తే పెద్దగా నష్టముండదు. కాని దినవారి వార్తలు, ఇతర అంశాలు రాస్తే చదువువరులందరికీ అర్థంకాకపోయే ప్రమాదముంది. ఇవి తక్కిన మండలాల వారికి కాదు గదా! ఆ మండలం వారికి కూడా పూర్తిగా అర్థం కాని స్థితిలో వున్నాయి. కొందరు కథారచయితలు ఇటీవల పత్రికల్లో యాస, మాండలికాలను హద్దు మీరు ప్రయోగించిన రచనలు అర్థం చేసుకోవడం కన్న నన్నయగారి మహాభారతం అర్థం చేసుకోవడమే సులువనిపిస్తుంది.

> కొందరు కథారచయితలు ఇటీవల పత్రికల్లో యాస, మాండలికాలను హద్దు మీరు ప్రయోగించిన రచనలు అర్థం చేసుకోవడం కన్న నన్నయగారి మహాభారతం అర్థం చేసుకోవడమే సులువనిపిస్తుంది.

సంప్రదాయవాదులు కావ్యాల్లో వున్న గ్రాంథిక భాషనే ప్రామాణిక భాషగా ఉపయోగించాలని వాదించారు. కాని ఈనాడు ఆ వాదం పరాస్తమైపోయింది. కావ్యాలలోని పదజాలం, ఇతివృత్తం భారతీయుల సాహిత్య వ్యవహారాలైన ఆముష్మిక చింతనకు, శృంగార దీప్తికి సరిపోతాయేమో కాని లౌకిక జీవన వ్యవహారాలకు సరిపోవడం లేదు. ఇప్పుడు కావ్యభాష, జీవన వ్యావహారిక భాష సమాంతరంగా పయనిస్తున్నాయి. రెంటికీ పొంతన కుదరడం లేదు. అయినా మనం వీలైనంత వరకు కావ్యజాలంలోని పదాలను గ్రహించి సమన్వయ మార్గంలో ఆధునిక ప్రామాణిక భాషా కోశాన్ని సంసిద్ధం చేసుకోవాలి. కావ్యపద జాలాన్ని గ్రహించడంలో మూడు మార్గాలు అనుసరించవచ్చు.

1. ప్రాచీన కావ్యాలలో ఉండి నేటికీ అదే అర్థంలో వాడబడుతున్నవి. అంటే ఏమాత్రం అర్థ విపరిణామం పొందనివి.

2.ప్రాచీన కావ్యాలలో ఉండి నేడు భిన్నార్థంలో వాడబడుతున్నవి 'కంపు' పదం కృష్ణరాయలు సుగంధం అనే అర్థంలో వాడితే అది నేడు కాస్తా దుర్గంధమైపోయింది. 'చీర' నాడు సామాన్య వస్త్రవాచి అయితే నేడు కేవలం స్త్రీలు

దాల్చు వస్త్రానికే అర్థసంకోచం చెందింది, తైలం అంటే ఆనాడు కేవలం నువ్వుల నూనెకే పేరు. కాని నేడు అన్ని నూనెలను తైలం అనే పేర వ్యవహరించడమే కొన్ని ప్రాంతాల్లో 'చేతిలో తైలం బెడితే' 'చేయి కాస్త తడిపితే' పని పూర్తవుతుంది అని లంచం అన్న నూతనార్థాన్ని సైతం తైలం పొందింది. 'తగవు' అంటే భారత రచనా కాలంలో 'తీర్పు' అని అర్థం. ఈ విధంగా అర్థ విపరిణామాన్ని గమనించి ఈనాడు వ్యాప్తంలో ఉన్న అర్థంలో మాత్రమే ఉపయోగించాలి.

3. ఆనాడు వ్యవహారంలో ఉండి నేడు పూర్తిగా మాయమైనవి. వెండియు, నావుడు, ఏము, నేము, అనద ఇటువంటి పదాలెన్నో ఉన్నాయి. భాషలో ఉన్నాయి కదా అని ప్రయోగించరాదు. ఆ పదం వ్యవహారంలో ఉందా? ఉంటే అదే అర్థంలో ఉందా భిన్నార్థంలో ఉందా అని పరిశీలించుకొని మరీ ప్రయోగించాలి.

4. కొన్నింటిని కొత్తగా సృష్టించి వ్యాప్తిలోకి తేవాలి. ఐక్యరాజ్య సమితి, అలీనోద్యమం, దూరదర్శన్, శ్వేతపత్రం, సంపాదకుడు, శ్రీముఖం లాంటివి కొత్తగా వచ్చినవి. ఆంగ్లభాషా విద్వాంసులు దేశంలో రెండు శాతాన్ని మించి లేరు. పరాయి భాషలో చదువుకునే విధ్యార్థి మొదట తన భాషలోకి అనువదించుకోవాలి. ఆ తర్వాత చెప్పిందేమిటన్నది ఆలోచించుకోవాలి. భాషను అర్థం చేసుకోవడంలోనే విద్యార్థి శక్తి దుర్వినియోగమైపోవడం చేత సంపూర్ణంగా మానసికంగా పరిణితి చెందలేడు.

5. శ్రవణ సుభగత్వం, సులభోచ్చారణ, క్లుప్తత, అర్థాన్ని ఇవ్వగలుగుతున్న శక్తి ఉన్న పదజాలం పట్ల వ్యాకరణ సూత్రాలకు కొంత సడలింపునిచ్చుకోవాలి. పనిమంతుడు, బానిసత్వం, మేల్తరం, ఇబ్బందికరం, సుస్వాగతం, సాహిత్య అకాడమీ, అధ్వర్యం, ఐక్యత, వారసత్వం, వీలునామా లాంటివి వ్యాకరణ విరుద్ధాలని పరిహరించలేం.

"కేవలం తెలుగు తెలుగు అని పట్టుబడితే విద్యార్థులు విదేశాలకు గాని, ఇతర రాష్ట్రాలకు గాని పోయి బతకలేరు గదా!" అని కొందరు వాపోతున్నారు. కాని అది పొరపాటు. తెలుగు అమలు అంటే అర్థం ఆంగ్ల సహితమనే భావం. విద్యార్థి తనకు బతుకుతెరువు దొరికే ఆంగ్లమాధ్యమాన్ని చదవకూడదని అనడం అమానుషం. అంతేగాక ఎంతమంది తెలుగువారు విదేశాలకు బ్రతుకుతెరువు కోసం వెళ్తున్నారు? విదేశాలకు పోయేవారు సాధారణంగా డాక్టర్లు, ఇంజనీర్లు, సాఫ్ట్ వేర్ ఇంజనీర్లు, వారు ప్రత్యేకంగా శిక్షణ పొందినా సరిపోతుంది. ఒక స్థాయికి వచ్చాక ఆంగ్లం నేర్చిన సరి. కాని మరి ఓనమాల స్థాయిలో ఇంగ్లీషును పిల్లల

మీద రుద్దడం ఏం సబబు? ఆంగ్లం నేర్చితే బ్రిటన్, అమెరికాలు తప్పిస్తే జర్మనీ, జపాన్, రష్యాలాంటి తక్కిన దేశాలకు వెళ్ళలేరు. అక్కడకు వెళ్ళాలంటే స్థానికంగా అమలులో ఉన్న అధికార భాషల్లో శిక్షణ పొందాల్సిందే. భారత వ్యోమగాములు రాకేశ్ శర్మ, రవీష్ మల్హోత్రాలు ఆంగ్లంలో కాక రష్యన్ భాష నేర్చుకొని ఆ భాషలో శిక్షణ పొందారన్న సంగతి విస్మరించరాదు. అటువంటప్పుడు మనం తెలుగులో ఉత్తరాలపై చిరునామాలు సైతం రాయడానికి ఎందుకు సిగ్గుపడాలి? భాషా విషయకంగా తమిళనాడు వారిది మేరమీరిన దురభిమానమైతే ఆంధ్రులది విరభిమానం అని చెప్పవచ్చు. తెలుగులో వ్యవహారమంటే అవమానం. మరి తెలుగువారిలో ఎంతమంది నిర్దుష్టంగా, దోషరహితంగా, నుడికార సమన్వితంగా ఇంగ్లీషులో రాస్తారో సందేహాస్పదమే.

ఏది ఏమైనా ఈనాడు భాషా ప్రయోజనం సాహిత్య పఠనం రసాస్వాదనం కవిత్వ నిర్మాణం మాత్రమే కాక సకల జీవన వ్యవహారాలు సమర్థంగా నడపడానికి వాహికగా వినియోగపడడం. ఈనాడు మనకు కావలసిన భాష శాస్త్ర సాంకేతిక భాష, వాణిజ్య భాష, వైజ్ఞానిక భాష.




శ్రీ బ్నిం గారి ద్వారా అందిన బాపుగారి కార్టూన్. స్వాతి వార పత్రిక సౌజన్యంతో

# తెలుగు - నేడు, రేపు



**డా. డి. చంద్రశేఖర రెడ్డి**
విశ్రాంత ప్రధానోపాధ్యాయులు, ఆంధ్ర సారస్వత పరిషత్తు; సంపాదకులు, ఎమెస్కో, హైదరాబాదు

భవిష్యత్తులో ఏదైనా ఏమి జరుగబోతోంది అని ప్రశ్నించుకొని సమాధానం చెప్పాలంటే ఆ విషయం గతంలో ఎలా పరిణామం చెందుతూ వచ్చింది అనేదాన్ని కొంత ఆధారంగా చేసుకోవచ్చు. హఠాత్పరిణామాలు, విప్లవాలు జరగకపోతే, దాని గమనం ఏకగతిలో సాగుతూ ఉంటే ఆ ఊహ నిజం కావడానికి అవకాశం ఉంది. కాని మనం ఏమి ఊహించినా అది తప్పిపోయే అవకాశం కూడా ఉంటుంది. అందువల్ల మనం ఊహించగలిగినంత వరకే చెప్పగలం.

నేను రాబోయే అర్ధ శతాబ్దిలోనో, శతాబ్దిలోనో తెలుగు భాష భవిష్యత్తు ఎలా ఉంటుందో ఊహించే ప్రయత్నం చేస్తున్నాను. పాతికేళ్ళ తర్వాత ఎలా ఉంటుందో ఊహించడం కష్టం, మరీ ముఖ్యంగా రోజురోజుకూ మార్పులు చోటు చేసుకుంటున్న ఈ ఆధునిక సాంకేతిక యుగంలో, గురికి బెత్తెడు ఎడమో, బారెడు ఎడమో ఏదో ఒకటి ప్రయత్నమైతే చేయక తప్పదు కదా!

తెలుగు ఒక ప్రత్యేక భాషగా స్వతంత్ర అస్తిత్వంలోకి వచ్చి రెండువేల, సంవత్సరాలకు పైనే అయిందన్న విషయంలో ఎవరికీ సందేహం అక్కరలేదు. అభిప్రాయ భేదాలేమైనా ఉంటే అంతకంటే కూడా ఎంత ప్రాచీనమైందన్న విషయంలోనే.

శాసనాల్లో, సాహిత్య రచనలో తెలుగు పదాలు అప్పటినుంచీ కనిపిస్తూనే ఉన్నాయి. దేశ, జాతి, భాషా వాచకాలుగా పేర్లు వాడుకలో వచ్చాయి.

స్థూలంగా ఈ రెండువేల సంవత్సరాల చరిత్రనూ విహంగ వీక్షణం చేద్దాం. భాష ఆవిర్భావం నాటినుంచీ జనవ్యవహారంలో ఉంటుందన్న విషయం అందరికీ తెలిసిందే. వాస్తవానికి జనవ్యవహారం నుండే భాష కదా!

శాతవాహనులు, ఇక్ష్వాకుల శాసనాలు ప్రాకృతంలో ఉన్నాయి. తరువాత సంస్కృత ప్రాకృత మిశ్ర శాసనాలు వచ్చాయి. శాసనాల్లో గ్రామాల, వ్యక్తుల పేర్లు దానభూమి సరిహద్దులు తెలుగులో కనిపిస్తాయి. పల్లవులు, విష్ణుకుండినులతో సంస్కృత శాసనాలు వచ్చాయి. విష్ణుకుండినుల కాలంలోనే రేనాటి చోళులు పూర్తిగా తెలుగులో శాసనాలు వేశారు. ఆ తర్వాత తూర్పు చాళుక్యులు సంస్కృతంతో పాటు తెలుగులోనూ శాసనాలు వేశారు. తూర్పు చాళుక్యుల శాసనాల్లోనూ, సమకాలిక సామంతప్రభువుల శాసనాల్లోనూ చంధోబద్ధమైన పద్యరచన కనిపించడంతో నాటికే తెలుగులో గ్రంథరచన ఉండినట్లు ఊహించవచ్చు. పదకొండో శతాబ్దిలో నన్నయ భారతంతో ప్రారంభించి తెలుగులో ఎడతెగకుండా సాహిత్యసృష్టిని మనం గమనిస్తూనే ఉన్నాం. వేలసంఖ్యలో శాసనాలూ వచ్చాయి. సాహిత్య రచనలూ వచ్చాయి.

అయితే ఈ రెండువేల సంవత్సరాల చరిత్రలో పందొమ్మిదో శతాబ్దానికి పూర్వం తెలుగు ఎప్పుడైనా విద్యామాధ్యమంగా ఉందా, అంటే చెప్పడానికి ఆధారాల్లేవు. అసలు విద్య అంటే ఏమిటన్న ప్రశ్న కూడా వేసుకోవలసి ఉంటుంది. వృత్తి విద్యలన్నీ కుటుంబాలలోనే, మాతృభాషలోనే చెప్పుకొనేవాళ్ళు, లేదా ఆ వృత్తినిపుణుల వద్ద కరణాల లెక్కలు, స్థానిక చరిత్రలు, ఉత్తర ప్రత్యుత్తరాలు, శిలా తామ్రశాసనాలు, వ్యాఖ్యన రచనలు, ఛందోలంకార, వ్యాకరణాది భాషా సాహిత్య సంబంధ శాస్త్రాలు, సస్య, జ్యోతిష్య, గణితాది శాస్త్ర రచనలు తెలుగులో ఉన్నప్పటికీ వాటి సంఖ్య పరిమితమే. ముఖ్యంగా విద్యావిధానమంతా సంస్కృత మాధ్యంలో జరిగేది. విద్యను లౌకిక ఆధ్యాత్మిక, వైదిక విద్యలుగా విభజిస్తే లైకిక విద్యలో చాలాభాగం మాతృభాషలోనూ, ఆధాత్మిక / వైదిక విద్య పూర్తిగా సంస్కృతంలోనూ సాగేది. ఆయుర్వేదం వంటి శాస్త్రాలు కూడా సంస్కృత మాధ్యంలో బోధించేవాళ్ళు.

> అయితే ఈ రెండువేల సంవత్సరాల చరిత్రలో పందొమ్మిదో శతాబ్దానికి పూర్వం తెలుగు ఎప్పుడైనా విద్యామాధ్యమంగా ఉందా, అంటే చెప్పడానికి ఆధారాల్లేవు. అసలు విద్య అంటే ఏమిటన్న ప్రశ్న కూడా వేసుకోవలసి ఉంటుంది.

కుతుబ్ షాహీలు, ఆసఫ్ జాహీల కాలంలో పాలనా వ్యవస్థ అంతా పర్షియన్, ఆ తర్వాత ఉర్దూ భాషల్లో సాగింది. వైదిక విద్య ఇప్పటికీ సంస్కృతంలోనే సాగుతూ ఉంది.

కంపెనీ పాలన ఆరంభమైన తర్వాత కానీ పరిపాలన రంగంలో తెలుగు వాడకం ఊపందుకోలేదు. జనంతో వ్యవహరించవలసి రావడం, అట్లా వ్యవహరించగల యంత్రాంగాన్ని ఏర్పరచుకోవలసిన అవసరం రావడం వల్ల విద్యారంగంలో తెలుగు ప్రవేశించింది. ఇంగ్లీషు వాళ్ళ పాలన కాబట్టి ఇంగ్లీషు ఎట్లాగూ తప్పదు. తమ పాలనవ్యవస్థకు ఆవశ్యకమైన అనుగుణమైన లౌకిక విద్యావ్యవస్థను నిర్మించాల్సిన అవసరం ఇంగ్లీషువాళ్ళకు ఏర్పడింది. వాళ్ళు ఏర్పరచిన విద్యావ్యవస్థే చిరుమార్పులతో ఈనాటికీ కొనసాగుతూ ఉంది.

మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మనదేశ సామాజికవ్యవస్థ సంస్కృతులకు అనుగుణంగా ఒక విద్యావ్యవస్థను ఏర్పరచుకోవడంలో మనం విఫలమయ్యాం. అసలు అటువంటి ఉద్దేశంగాని, పట్టుదలగాని ఎక్కడా వ్యక్తం కాలేదు. ఇంగ్లీషువాళ్ళ, మహమ్మదీయుల పరిపాలనాకాలంలో కంటే మన విద్యా, పాలనా రంగాలలో ఇంగ్లీషు ప్రాభవం పెరుగుతూ పోయింది. ఉదాహరణగా మనం ఏ వ్యవస్థనైనా తీసికోవచ్చు. మన వైద్యం తీసుకోండి. ఆయుర్వేదం వంటి దేశీయ వైద్యవిధానాలు, ముస్లిముల ద్వారా వచ్చిన యునానీ వంటి వైద్యవిధానాలు క్రమ క్రమంగా వెనుకబడి కనుమరుగయ్యే పరిస్థితి ఏర్పడింది. వాటితోపాటు సంస్కృతం, తెలుగు, ఉర్దూ భాషలు కూడా ఈ రంగంలో వెనుకబడ్డాయి. ఇంగ్లీషు వైద్యంతో పాటు, వైద్యవిద్య పూర్తిగా ఇంగ్లీషులోకి వెళ్ళిపోయింది. న్యాయస్థానాల్లో కింది కోర్టుల్లో సాక్షులు సాక్ష్యాలు చెప్పడం తప్ప మరేమీ తెలుగులో ఉండదు. దాన్నీ ఇంగ్లీషులోకి అనువదించవలసిందే.

> మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మనదేశ సామాజిక వ్యవస్థ సంస్కృతులకు అనుగుణంగా ఒక విద్యావ్యవస్థను ఏర్పరచుకోవడంలో మనం విఫలమయ్యాం. అసలు అటువంటి ఉద్దేశంగాని, పట్టుదలగాని ఎక్కడా వ్యక్తం కాలేదు.

విద్యారంగంలో ప్రాథమిక, ఉన్నత పాఠశాల స్థాయిల్లోనూ, డిగ్రీ, పిజి స్థాయిల్లోనూ తెలుగును వ్యాపింపజేయటానికి ఒకటి రెండు దశాబ్దాల పాటు కొంత ప్రయత్నం జరిగిన అది ముందుకు సాగకపోగా ఇప్పుడు తిరుగుముఖం పట్టింది. 90 శాతం పైగా పాఠశాలలు ప్రభుత్వరంగంలో ఉండి ఉన్నత పాఠశాల విద్య వరకు మాతృభాషలో నడుస్తుండిన పాఠశాల విద్య ఇప్పుడు అతివేగంగా ప్రాథమిక పూర్వ పాఠశాల విద్యనుండి ఇంగ్లీషులోకి మారిపోతూ ఉంది. ప్రభుత్వ పాఠశాలలే ఇంగ్లీషుమాధ్యంలోకి మారిపోతున్నాయి. ప్రైవేటు రంగంలో పాఠశాలలు, కళాశాలలు సంఖ్య విపరీతంగా పెరిగిపోవడంతో పాటు ప్రభుత్వ విద్యాసంస్థలు కూడా వాటి ధోరణిలోకే చేరిపోవడం వేగవంతం కావడం వల్ల తెలుగు మాధ్యంలో విద్య మరణశయ్యకు చేరుకుంది. సాంకేతిక వృత్తివిద్యలెలాగూ తెలుగులో లేవు.

పాలన వ్యవస్థలో తెలుగు వాడుక ఒక అడుగు ముందుకు, రెండడుగులు వెనక్కు.

### మరి తెలుగు భాష భవిష్యత్తేమిటి?

ఇప్పుడు రంగాల వారీగా తెలుగు భాష భవిష్యత్తు ఎలా ఉండవచ్చో ఊహిద్దాం.

### 1. రోజువారీ జన వ్యవహారం

తక్కిన వ్యవస్థలెలా ఉన్నా ఇంటా బయటా జనం మాట్లాడుకొనే భాషగా తెలుగుకు పెద్ద ప్రమాదమేమీ ఉన్నట్లు కన్పించదు. ఆరంభం నుండీ ఇంగ్లీషు మాధ్యమం వల్ల చాలామంది తెలుగు ప్రమాదంలో పడినట్లు భయపడుతున్నారు కాని అటువంటి భయం అవసరం లేదనిపిస్తుంది. రెండువేల సంవత్సరాలకు పైగా విద్యామాధ్యం, పరిపాలనా మాధ్యం కానప్పటికీ జనవ్యవహారంలో నిలిచి ఉన్న భాషకు ఎప్పటికైనా ఏదైనా ముప్పు సంభవించవచ్చునని ఆందోళన చెందవలసిన అవసరం లేదు.

### 2. రాజకీయ రంగం

ఈ రంగంలో తెలుగు భాష వాడుక తగ్గే అవకాశం కన్పించదు. మనం నిర్భయంగా ఉండవచ్చు. జనంలోకి పోవలసిన రాజకీయ నాయకుడు తెలుగు మాట్లాడక తప్పదు. వాస్తవానికి ఈ పరిస్థితే తెలుగు భద్రత విషయంలో మనకు ఊరట కల్గిస్తుంది.

### 3. ప్రసార మాధ్యమాలు, చలనచిత్రరంగం

తెలుగు పత్రికలు చదివేవారి సంఖ్య, టి.విలో తెలుగు కార్యక్రమాలు చూసేవారి సంఖ్య, తెలుగు చలనచిత్రాలు చూసేవారు, పాటలు వినేవారి సంఖ్య పెరుగుతూనే ఉంది తప్ప తగ్గడం లేదు. తామర తంపరగా పెరుగుతున్న ఛానళ్ళు, వాటి ఇరవై నాలుగ్గంటల ప్రసారాలు ఈ విషయాన్ని నిరూపిస్తున్నాయి. అట్లాగే సామాజిక మాధ్యమాలు కూడా నిత్యాభివృద్ధి చెందుతున్న ఈ రంగంలో తెలుగు వినియోగం పెరిగేదే తప్ప తరిగేది కాదు. తెలుగు ఛానళ్ళుపెరిగినందువల్ల, క్రీడా ఛానళ్ళుచూసే తెలుగు ప్రేక్షకులు పెరిగినందువల్ల, ఆటల ప్రత్యక్ష ప్రసారాలు తెలుగులో ఎక్కువవుతున్నాయి. భవిష్యత్తులో మరింత అభివృద్ధి ఉంటుంది. ప్రమాణాలు కూడా పెరుగుతాయి.

### 4. సాహిత్య రంగం

మన దేశంలో ఇంగ్లీషు చదువుకుని, ఇంగ్లీషు బోధించే ఉపాధ్యాయులు, ఆచార్యులలో ఇంగ్లీషు సృజనాత్మక రచనలు చేసేవారికంటే తమ తమ మాతృభాషలో రచనలు చేసేవారి సంఖ్య ఎన్నోరెట్లు ఎక్కువ. మాతృభాషలో, సొంత జనంలో రచయితగా పేరు తెచ్చుకోవాలనే కోరిక, తన సొంతభాషలో భావ వ్యక్తీకరణ సౌలభ్యం రచయితలు మాతృభాషను అవలంభించడానికి హేతువవుతున్నది. ఈ పరిస్థితి కూడా సమీప భవిష్యత్తులో మారే అవకాశం లేదు.

ప్రస్తుతం పుస్తక ప్రచురణ, క్రయ విక్రయాలు అంత ప్రోత్సాహకరంగా లేకపోయినప్పటికీ, రచయితలు తమ రచనల వ్యాప్తికి ఎలక్ట్రానిక్ / డిజిటల్ మార్గాలను ఎంచుకుంటున్నారు. ప్రాథమిక దశలో ఉన్న ఈ ప్రక్రియ క్రమంగా వేగం పుంజుకుంటున్నది.

పుస్తక ప్రచురణ రంగంలో ఇంగ్లీషు ప్రచురణకర్తలు కూడా తెలుగు పుస్తకాల ప్రచురణలో ఆసక్తి చూపడం ప్రారంభించారు. తెలుగు మార్కెట్‌లో ప్రవేశిస్తున్నారు. ఇదొక ప్రయోజనకరమైన పరిణామం. భవిష్యత్తులో తెలుగులో పుస్తక ప్రచురణ పురోగతి సాధించే అవకాశం ఉంది.

### 5. పరిపాలనా రంగం

అధికార భాషగా తెలుగును ప్రకటించి అర్ధశతాబ్ది దాటినా ఈ రంగంలో తెలుగు ప్రగతి నత్తనడకగానే ఉంది. ఇప్పటికీ ప్రభుత్వ కార్యకలాపాలు ఇంగ్లీషులోనే ఎక్కువగా జరుగుతున్నాయి. ప్రాంతీయ భాషల్లో పరిపాలన విషయంలో మిగతా రాష్ట్రాలతో పోలిస్తే మనం చాలా వెనుకబడి ఉన్నాం. ప్రజాభిప్రాయం కూడగట్టగలిగితే ఈ రంగంలో పురోగతి సాధించే అవకాశాలు చాలా ఎక్కువ.

### 6. న్యాయపాలన రంగం

న్యాయస్థానాలు పూర్తిగా ఇంగ్లీషుమయంగా ఉన్నాయి. కింది న్యాయస్థానాల్లో ఎవరైనా ఒక న్యాయమూర్తి తెలుగులో తీర్పు చెప్తే అదొక గొప్ప వార్త. ప్రస్తుత పరిస్థితుల్లో న్యాయస్థానాల్లో ఈ పరిస్థితి మారే అవకాశం కన్పించడం లేదు.

### 7. శాస్త్ర సాంకేతిక రంగాలు

విద్యారంగంలో ఉన్నత విద్య తెలుగు మాధ్యం లేనప్పుడు ఈ రంగాలలో తెలుగువాడుక అత్యల్పంగానే ఉంటుంది. సమీప భవిష్యత్తులో ఈ రంగంలో తెలుగు వాడుక పెరిగే అవకాశమే లేదు. సాంకేతిక విద్యను మాతృభాషల్లోకి తేవాలనే కేంద్రప్రభుత్వం ప్రభావం ఎలా ఉంటుందో, ఎంతవరకు అమలు జరుగుతుందో చూడవలసి ఉంది. అమలు ప్రయత్నం ఇప్పుడు ప్రారంభించినా చాలా సమయం పట్టవచ్చు. ప్రస్తుతం రాష్ట్రాలలో ఉన్న పరిస్థితి దీనికి అనుకూలంగా లేదు. గత రెండువేల సంవత్సరాల పరిస్థితే ఇకముందు కూడా కొనసాగుతుంది.

### 8. విద్యారంగం

ప్రస్తుతం ఆందోళన కల్గిస్తున్న రంగం ఇది. ఉన్నత పాఠశాల వరకు ఉన్న తెలుగు మాధ్యం కళాశాల, పరిశోధన రంగాలకు ఈ డెబ్భై ఏళ్ళలో విస్తరించవలసి ఉండింది. అది అలా విస్తరించకపోగా మరింత కుంచించుకుపోతూ పాఠశాల విద్యకూడా ఇంగ్లీషుమాధ్యంలోకి మారిపోయే స్థితి వచ్చింది. ఉన్నత విద్యారంగంలో తెలుగుమాధ్యమం లేకపోవడం వల్ల శాస్త్ర సాంకేతిక వృత్తి విద్యారంగాల్లో తెలుగు శూన్యమయింది. ఈ కారణంగానే ఆయా రంగాల్లో తెలుగులో మౌలిక పరిశోధన గ్రంథాలు రావడం లేదు. ఈ పరిస్థితి మారే సూచనలేవీ కనిపించడం లేదు. రాబోయే యాభయ్యేళ్ళలో కూడా తెలుగులో మౌలిక పరిశోధక విస్తృతి పెరగడం అసాధ్యమే.

### కర్తవ్యం :

ఒక భాష స్వతంత్రంగా, స్వయంప్రతిపత్తితో నిరంతర ప్రగతి సాధించాలంటే ఆ భాష మాట్లాడే జాతికి సంబంధించిన సర్వరంగాలలో దాని వినియోగం జరగాలి. తెలుగు భాష విషయమే తీసికొంటే గత రెండువేల సంవత్సరాలలో తెలుగుకు అటువంటి వినియోగం లేనే లేదు. ముఖ్యంగా విద్యారంగంలో తెలుగు ప్రాథమ్యం లేకపోవడం పెద్ద లోపం. ఇప్పుడు మతపరమైన కర్మకాండ అంతా సంస్కృతంలో జరుగుతుంటే, విద్యా పాలనాదిరంగాలలో ఇంగ్లీషు ప్రాధాన్యం వహిస్తూ ఉంది. ఈ పరిస్థితి మారవలసి ఉంది. ఈ పరిస్థితి కేవలం తెలుగు ఒక్కదానిదే కాదు భారతీయ భాషలన్నిటిదీ కూడా. బహుశా ప్రపంచంలో మరెన్నో భాషలది కూడా.

ఇవ్వాళ తెలుగు భాషా పరిరక్షణ కోసం ఉద్యమం చేపట్టాలనేవాళ్ళు ఒకవైపు, తెలుగు భాష పాడైపోతున్నదని వాపోయే వాళ్ళొకవైపు తమ గొంతుకలు వినిపిస్తున్నారు. భాష స్వచ్ఛత అనేది మిథ్య అని అర్థం చేసుకోవాలి. అన్యదేశ్య పదాలు వాడకూడదనీ, సంస్కృత పదాలు కూడ వాడకూడదనీ, ద్రావిడ భాషల్లో మహా ప్రాణవర్ణాలు లేవు కాబట్టి మహాప్రాణులన్నిటినీ అల్పప్రాణాలుగా మార్చుకోవాలని ప్రాచీన సాహిత్యాన్నంతా అలా మార్చి అచ్చువేసుకోవాలనీ కొందరు ప్రతిపాదిస్తున్నారు. కొందరు లిపిని మార్చుకోవాలని ప్రతిపాదిస్తున్నారు. కొందరు మనం నిత్యం వాడుతున్న పదాల స్థానంలో వింత వింత పదాలు వాడుతున్నారు. ఇదంతా భాషకు నష్టం కలిగించేదే తప్ప మేలు చేసేది కాదు. భాష వ్యవహారంలో విస్మృతి పొందుతుంది. ఆ వ్యవహారాన్ని పెంచుకోవాలి. భాషను విస్తృతంగా అన్ని రంగాలలో ఉపయోగించడంపై దృష్టి సారించాలి. భాషను వాడే వాళ్ళున్నంతకాలం భాష ఎలా మాయమవుతుంది? భాష నశించాలంటే ఆ భాష మాట్లాడే జాతి నశించాలి లేదా ఆ జాతి మొత్తంగా తన భాషను వీడి మరో భాషకు పరివర్తనం చెందాలి. ప్రపంచంలోనే అధిక సంఖ్యాకులు మాట్లాడే మొదటి ఇరవై స్థానాల్లోపున ఉన్నదని మనం గర్వంగా చెప్పుకుంటున్నాం. అటువంటి భాష అదృశ్యమయ్యే ప్రమాదం లేదు. మనం గుర్తుపెట్టుకోవలసిన అంశం ఒకటి ఉంది. భాషకు దానంతటదే ఎటువంటి గొప్పదనమూ లేదు. ఆ భాష మాట్లాడేవాళ్ళ గొప్పదనమే ఏమైనా ఉంటే ఆ భాష గొప్పదనం కూడా. జాతి - భాష అని చెప్పవచ్చు. జాతి పరిస్థితే భాష పరిస్థితి కూడా. మనం ఎక్కడ ఉండాలో మనమే నిర్ణయించుకోవలి. మన న్నతే మన భాష ఉన్నతి. మనల్ని మనం ఉద్ధరించుకుంటే మన భాషను ఉద్ధరించుకున్నట్లే.

“స్వరాజ్యం కావలెనంటున్నాము. ప్రత్యేకాంధ్రరాష్ట్రము కోసం చిక్కుపడుతున్నాము. ప్రజాస్వామిక పరిపాలనం కోరుచున్నాము. ఇటువంటి పరిస్థితులలో మన ప్రజలకు, సామాన్య జనులకు ఏభాష ద్వారా జ్ఞానం కలుగచేయవలసి ఉంటుందో, ఏ భాషలో గ్రంథ రచన సాగించవలసి ఉంటుందో ఆలోచించండి. మీ చేతులలో పత్రికలున్నవి. పత్రికల ద్వారా మీరు ఎంతైనా చేయగలరు”

**(1940 జనవరి 15వ తేదీన ప్రజామిత్ర కార్యాలయంలో పత్రికాసంపాదకులను సంబోధిస్తూ)**

# గిడుగు భాషావాదం



**డా. సి.హెచ్. లక్ష్మణ చక్రవర్తి,**
అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు శాఖ
తెలంగాణ విశ్వ విద్యాలయం



తెలుగు భాష రంగంలో లో ఆధునికతను తీసుకువచ్చిన భాషా శాస్త్రజ్ఞుడు గిడుగు రామమూర్తి పంతులు. కందుకూరి, గురజాడ, గిడుగు ముగ్గురు తమ కాలంలో తమ పద్ధతిలో ఆధునికతను సంఘం, సాహిత్యం, భాష విషయంలో తీసుకువచ్చే ప్రయత్నం చేశారు. ఈ ముగ్గురు చేసిన ప్రయత్నాలకు ఒకరకంగా సమాజంలో వస్తున్న మార్పులు, సంతరించుకుంటున్న ఆధునికత, పరిచయమవుతున్న పాశ్చాత్య విద్య వంటివన్నీ కారణమయ్యాయి. విద్యారంగం మరింత విస్తృతమౌతున్న దశలో గిడుగు వాడుక భాషను సాహిత్యభాషగా, విద్యారంగపు మాధ్యమభాషగా చేయడానికి ప్రయత్నించాడు.

గిడుగు రామమూర్తి భాష విషయంలో చేసిన కృషి వాడుక భాషకు సంబంధించినది. వాడుక భాషకు పట్టం కట్టడం కోసం అతడు చేసిన కృషి ప్రధానంగా మూడు రీతులుగా కనిపిస్తుంది

1. ప్రాచీన కవులు ఉపయోగించినది వాడుక భాషే అని చెప్పడం
2. వాడుక భాషలో పాఠ్య గ్రంథాలను తీసుకు రావాలనే ప్రయత్నం
3. భాష ప్రజా సామాన్యాన్ని చేరాలి దానిని అందరికీ ఉపయోగించె శక్తి ఉండాలని భావించడం

ఈ మూడు వాడుక భాష/ వ్యావహారిక భాష ద్వారా మాత్రమే కుదురుతుందని పై మూడు మార్గాలు అందుకు తగిన పునాదిని ఏర్పరుస్తాయి అని గిడుగు భావించారు. ఆ దృష్టితో తన ఆలోచనలను పుస్తకాలుగా రచించారు.

వ్యాసావళి ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజం, గద్య చింతామణి, బాలకవి శరణ్యం అనే నాలుగు రచనలు ఆయన ఆలోచనా రీతిని భాష విషయంలో అతని వాదాన్ని వివరిస్తాయి. ఆంధ్ర సాహిత్య పరిషత్తు వ్యావహారిక భాషను బహిష్కరించిన సందర్భంలో వ్యావహారిక భాషా బహిష్కార నిరసనము అనే వ్యాసం గిడుగు రాసారు. ఈ వ్యాసంలో నాలుగు అంశాలు ప్రధానంగా కనిపిస్తాయి

1. గ్రాంథిక వాదుల వాదన యదార్థమైనది కాదు

2. ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారు తాము మోసపోయి లోకాన్ని మోస పుచ్చారు.

3.వాడుక భాష వలన ఎక్కువ ప్రయోజనాలు ఉన్నాయి గ్రాంథికభాష పండితులకే తెలియదు

4. వాడుక భాషను బహిష్కరించడం వలన విద్యావ్యాప్తి, సారస్వతాభివృద్ధి జరగదు

వాడుక భాషలో గ్రంధాలు వ్రాయడమే నిజమైన సంప్రదాయమని రుజువు చేస్తాను అని

ఈ వ్యాసంలో పేర్కొన్న గిడుగు తరువాతి కాలంలో నిజమైన సంప్రదాయము పేరుతో చిన్ని పుస్తకాన్ని రాసి మహాకవులందరూ వాడుక భాషలోనే రచనలు చేశారని వాడుక భాషను ఎవరు గ్రామ్య భాష అనలేదు అని అన్నారు.

రాజరాజు కాలమందున్న తెలుగు భాష అనే వ్యాసాన్ని రాస్తూ నందంపూడి శాసనం వాడుక భాషలోనూ, మహాభారతాన్ని కావ్యభాషలోనూ నన్నయ వ్రాశాడని ఆయన వ్రాసిన అసలు ప్రతి మనకు దొరకలేదు అది దొరికితే కానీ అసలు ప్రాచీన భాష స్వరూపమేమిటో స్పష్టంగా చెప్పలేము అని గిడుగు ఈ వ్యాసంలో అభిప్రాయపడ్డారు.  పాత తెలుగులో వ్రాయడం ఎంత కష్టమో ఎంత ప్రయోజన రహితమో చెప్పడం కోసం ప్రాదెనుగుగమ్మ అన్న లేఖను రాశారు.

భాషను స్థిరీకరించగల వారెవ్వరు అనే వ్యాసాన్ని ప్రజా సాహిత్యం అని మూడు భాగాలుగా విభజించి వ్రాశారు. ఇందులో విద్వత్ కవుల రచనలలో కంటే స్వచ్ఛమైన కవితా రీతి వాడుక భాషలో వ్రాసిన నాందేవ్ తుకారాం వంటి

వారి రచనలలో కనిపిస్తుందని, శాశ్వత ప్రమాణాలు గల పూర్వపు రచనలను ఎప్పటికప్పుడు ఆధునిక భాషలో తిరిగి రాస్తూ ఉండాలని మరాఠీ హిందీ బెంగాలీ మొదలైన వాటిలో వాడుక భాషలలో ప్రజా సాహిత్యం ఎంత అభివృద్ధి చెందిందో ఈ వ్యాసంలో గిడుగు చర్చించారు.

వ్యవహారిక భాషకు ఒక ప్రమాణం ఉండాలని నియమాలు ఉండాలని మండపాక పార్వతీశ్వర శాస్త్రి, టేకుమళ్ళ కామేశ్వర రావు వంటి వారు అభిప్రాయపడ్డప్పుడు జీవద్భాష కు అడ్డుకట్ట వేయడం ఎవరికీ సాధ్యం కాదని గిడుగువారు చెప్పారు. ప్రజలకు నూటికి 90 మంది చొప్పున అయినా చదువు ఎప్పుడు వస్తుందో అప్పుడు ఆంధ్ర భాషకు స్టాండర్డ్ దానంతట అదే ఏర్పడుతుంది అదయినా కేవలము ఏక రూపమున ఉండదు సుమండీ పరమైకత గల భాష లోకములో ఎక్కడా లేదు. భాషకు బడిపంతుళ్లు సంకెళ్లు తగిలించారు వంటి అభిప్రాయాలూ వ్యావహారికరచనకూ కొన్నినియమాలు పుస్తకానికి రాసిన ఉపోద్ఘాతంలో కనిపిస్తాయి.

> వ్యవహారిక భాషకు ఒక ప్రమాణం ఉండాలని నియమాలు ఉండాలని మండపాక పార్వతీశ్వర శాస్త్రి, టేకుమళ్ళ కామేశ్వర రావు వంటి వారు అభిప్రాయపడ్డప్పుడు జీవద్భాష కు అడ్డుకట్ట వేయడం ఎవరికీ సాధ్యం కాదని గిడుగువారు చెప్పారు.

ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజం వేదం వెంకటరాయ శాస్త్రి గారి గ్రంధాలలో ఉండే దోషాలను చెప్పడానికి రాసిన పుస్తకం ఇందులో ఈ క్రింది అభిప్రాయాలు కనిపిస్తాయి.

1. గ్రాంథిక భాష అనేది ఒక కృతక భాష కానీ వాస్తవమైనది కాదని , గ్రాంథికాంధ్రము అనే దానిలో కొంత పూర్వీకులు వాడిన భాష కొంత మనము వాడుకునే భాష కలిసి ఉంటుంది

2. ప్రాచీనాంధ్ర గ్రంథములలో కాని, మన వ్యవహారములోగాని ఉన్న భాష వాస్తవమైనది

3. వ్యావహారిక భాషలోని శబ్దాలే అచ్చే హల్లో మార్చి గ్రామ్యత్వము తొలగించి గ్రాంథికీకరణము చేసి ఉపయోగిస్తారు

4. ఒక అర్ధ శతాబ్ది నుండి ఈ కృతక భాష దేశంలో వ్యాప్తిలో ఉంది వంటి అభిప్రాయాలు మిథ్యాపవాదము అనే వ్యాసంలో, ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజం పుస్తకంలో కనిపిస్తాయి.

ప్రాచీన కాలంలో తెలుగు వచన రచన వాడుకభాషలో ఉందని నిర్ధారణ చేయడానికి గద్య చింతామణి కూర్చి ప్రకటించారు గిడుగు. బాలకవి శరణ్యము బాల వ్యాకరణం లోని లోపాలను చెప్పడం కోసం గిడుగు చేసిన రచన. వ్యాకర్తలు తన కాలపు పండితులు ఏయే రూపాలయితే వ్యాకరణ విరుద్ధాలు అని గ్రామ్యాలని తోసి పారేసారో ఆ రూపాలన్నింటికీ గతి కల్పించి పూర్వకవుల ప్రయోగాలు చూపించి అవి సాధువు అని చెప్పడం కోసం బాలకవి శరణ్యము వ్రాసారు.

ఈ నాలుగు రచనల ద్వారా గిడుగుకున్న భాషా దృష్టి వాడుక భాష లో రచనలు చేయడమే అని, దానిని ప్రోత్సహించడమే అని తెలుస్తుంది. వాడుక భాష ప్రాచీన కాలం నుంచి ఉందని దానిని కొనసాగించడమే తన లక్ష్యమని ఈ రచనల ద్వారా నిరూపించినట్లు గుర్తించవచ్చు. పొల్లు మాటలు కోశాలలో ఉంటాయి కానీ నిత్య వ్యవహారంలో ఉండవు. వాడుకలో ఉన్న మాటలు అన్నింటిని ఉన్నదున్నట్లు రాతల్లో చూపించడం కష్టం. వాడుక భాషలోనూ మార్పులుంటాయి వ్యాకరణంతో భాషను కట్టి పడేయడం ఎవరి వల్లా కాదు అయితే వ్యాకరణం ఒకనాటి భాషను గురించి చెబుతుందన్న దానిలో గిడుగు వారికి పేచీ ఏమీ లేదు అయితే లౌకిక భాషకు కూడా వ్యాకరణం రాయాలనే విషయం చాలా మందికి తెలియదు అన్న అభిప్రాయం ఆయన ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజం లో ఇతర వ్యాసాల్లో కనిపిస్తుంది.

గ్రాంథికము కల్పిత భాష, కృతకభాష అవుతుంది కానీ శిష్టుల భాష దేశ భాష కాలేదనీ, గ్రామ్య భాష లక్షణ విరుద్ధమైనది కాదు సంస్కార దూరమైనది అంటూ వాడుక భాషకు పట్టం కట్టాలని గిడుగు తన భాషావాదాన్ని ప్రకటించారు. మంచి కవులు భాషా సౌందర్యాన్ని గుర్తెరిగి ప్రయోజనకరంగా భాషను ఉపయోగించారని, వారందరిదీ వాడుక భాషే అనీ దానినే తనతరం, తన తరువాతి తరం అనుసరించాలన్నది గిడుగు వారి భావన. భాషా సంస్కరణమే సంఘ సంస్కరణ మని భావించిన గిడుగు పాఠ్య గ్రంథాల ద్వారా భాష ప్రజాసామాన్యాన్ని చేరాలని కోరుకున్నారు దానికి వాడుక భాష పునాది అని తాను వ్రాస్తున్న ప్రతి పుస్తకం, వ్యాసంలోనూ, పీఠిక లోనూ పదే పదే చెబుతూ వచ్చారు వాడుక భాషకు గౌరవం దాని వ్యవహారం పెరగాలని కోరుకున్న భాషావాది గిడుగు.

# టి.వి వార్తల్లో వ్యావహారిక భాష



- ఆచార్య శివుని రాజేశ్వరి
విశ్రాంత ఆచార్యులు

పత్రికలకూ భాషకు, టీ.వీల భాషకూ చాలా తేడా ఉంటుంది. పత్రికల భాష ప్రామాణిక భాషకు రాసే భాష దగ్గరకు ఉంటే, టీ.వీ భాష వ్యావహారిక భాషకు మాట్లాడే భాషకు దగ్గరగా వుంటుంది. మొదటిది అక్షరాస్యులకు అర్థమయ్యే విధంగా ఉంటే టీ.వీ భాష నిరక్షరాస్యులకు సైతం అర్థమయ్యే విధంగా ఉండాలి. మాట్లాడే భాషలో సులభమైన పదాలతో, చిన్నవాక్యాలతో వార్తా రచన జరగాలి. భాష స్పష్టంగా సూటిగా ఉన్నప్పుడే ప్రేక్షకుడు వినగానే అర్థం చేసుకుంటాడు.

పత్రికా రచనలో అర్థం కాకపోతే మళ్ళీ చదివి తెలుసుకునే సౌకర్యం ఉంది. టీ.వీ రచనలో ఆ సౌకర్యం లేదు. పత్రికా రచనకు అలవాటుపడిన జర్నలిస్టు ఈ శైలికి మారడం కొంచెం కష్టమే. 'విజువల్స్' కు తగినట్టుగా ఎక్కడ వ్యాఖ్యానం అవసరమో ఎక్కడ అనవసరమో గుర్తించి రాయడం ముఖ్యం. ఈ నేపథ్యంలో వార్తలు రాయడానికి ప్రత్యేక నైపుణ్యం అవసరమవుతుంది. చూసింది చెప్పడం టీ.వీ జర్నలిస్టు పని కాబట్టి చూసిన విషయాన్ని మాట్లాడే భాషలో రాయాలి. మాట్లాడే భాష అంటే తాను నిత్యం వ్యవహరించే భాష కాదు. మాండలిక పదాలతో నింపడమూ కాదు. అది వాడుక భాష, సభ్యతా సంస్కారం ఉట్టిపడేలా ప్రామాణికంగా ఉండాలి. అయితే నేరుగా టీ.వీలలో చేరుతున్న వాళ్ళు ఎక్కువ సంఖ్యలో ఉండడం, టీ.వీల కోసమే ప్రత్యేకంగా శిక్షణపొందినవాళ్ళు తక్కువగా ఉండడం వలన ప్రతిసారీ ప్రతిపదమూ టీ.వీకి అనుగుణంగా ఉండేలా చూసుకోవాలి. టీ.వీ వార్తల్లో పదాలు, వాక్యనిర్మాణం, ధ్వన్యనుకరణం, ఊనిక (stress) పద సంహిత (Juncture) శృతి (Tone) ప్రధాన పాత్ర పోషిస్తాయి.

మొదటి రెండు అంశాలు వార్తా రచనకు తోడ్పడేవి, తరువాతి అంశాలు వార్తా పఠనానికి తోడ్పడేవి.

## I. వార్తారచన

### (1). వ్యావహారిక పదాల ఎంపిక

పదాల ఎంపిక భాషకు జీవం పోస్తుంది. మితిమీరిన తత్సమ పదాలు, ఆంగ్లపదాలు తెలుగు భాషా మాధుర్యాన్ని ప్రేక్షకులకు దూరం చేస్తాయి. వాడుకలో ఉన్న పదాలు తెలుగు భాష సజీవత్వానికి నిదర్శనం. పత్రికా భాషలో తత్సమ పదాల వినియోగం తప్పనిసరే కానీ, టీ.వీల భాషలో వాటి వాడుక తగ్గించాలి.

| 1.1 తత్సమ పదాలు | వ్యావహారిక పదాలు |
|---|---|
| పత్రికా రచన | టీ.వీ రచన |
| వృద్ధాప్యం | ముసలితనం |
| భూకంపం సంభవించిన /భూమి కంపించినది | భూకంపం వచ్చింది. |
| విచ్చేశారు | వచ్చారు |
| అంగీకరించారు | ఒప్పుకున్నారు |
| కొనియాడారు | పొగిడారు |
| సతీమణి | భార్య |
| జన్మదినోత్సవం | పుట్టినరోజు వేడుక |
| పర్యటించనున్నారు | పర్యటిస్తారు |

### 1.2. పునరుక్తి

అనవసర పదాల వాడకం టీ.వీ వార్తా రచనలో తగ్గించాలి. పత్రికలకంటే టీ.వీలో పొదుపు చాలా అవసరం. ఒకే అర్థం వచ్చే రెండు మూడు పదాలను వాడడం పునరుక్తి దోషం. ఈ కింది పదాలను చూడండి.

### పునరుక్తి పదాలు

గెలుపొందిన విజేతలు - గెలుపొందిన వారు / విజేతలు

మళ్ళీ పునః ప్రారంభించారు - మళ్ళీ ప్రారంభించారు

వివాహిత మహిళ - వివాహిత

గర్భిణీ స్త్రీ - గర్భిణీ

రాష్ట్ర ముఖ్యమంత్రి - ముఖ్యమంత్రి

అక్టోబర్ నెలలో చర్చిస్తారు - అక్టోబరులో చర్చిస్తారు.

### 1.3. ఇంగ్లీషు పదాల వాడకం

టీ.వీ వార్తా రచనలో ఇంగ్లీషు పదాల వాడకం ఎక్కువ అనేది సర్వత్రా వినిపిస్తున్న విషయమే. పత్రికల తరహాలో ఇంగ్లీషు పదాలకు సమానార్థకం తయారుచేసే సమయం వీరికి ఉండదు. పైగా బ్రాకెట్లో ఇంగ్లీషు పదాన్ని ఇచ్చి కొత్త తెలుగు పదాన్ని పరిచయం చేసే సౌలభ్యం లేదు. కానీ ఇప్పటికే వాడుకలో ఉన్న తెలుగు పదాల్ని వదిలేసి ఇంగ్లీషు పదాలను వాడనవసరం లేదు.

'ఎలక్షన్స్' వస్తున్నాయి - ఎన్నికలు వస్తున్నాయి

చెన్నైకి 'హైస్పీడ్' రైలు - చెన్నైకి 'అతివేగంగా నడిచే' రైలు

'లేట్' చేస్తున్నారు - 'ఆలస్యం' చేస్తున్నారు

విదేశీ సంస్థలకు 'గ్రీన్ సిగ్నల్' ఇస్తున్నారని వారి భావన - విదేశీ సంస్థలకు 'పచ్చజెండా' చూపించారని వారి భావన.

### 2. వాక్య నిర్మాణం

టీ.వీ వార్తా రచనలో ప్రధాన పాత్ర వహించేది వాక్య నిర్మాణమే. సరళ వాక్యాలు మాట్లాడే భాషలో ఎక్కువగా ఉంటాయి. సంశ్లిష్ట, సంయుక్త వాక్యాలు రాసే భాషలో ఉంటాయి. సరళవాక్యాలు రాసే భాషలో (పత్రికా రచనలో) ఎక్కువగా ఉంటే భాషకు గాంభీర్యం తగ్గుతుంది. సంశ్లిష్ట, సంయుక్త వాక్యాలు మాట్లాడే భాషలో (టీ.వీ వార్తా రచనలో) ఎక్కువగా ఉంటే శ్రోతకుగానీ, ప్రేక్షకులకు గానీ అర్థం కావు. కాబట్టి టీ.వీ వార్త రచనలో వీలైనంత వరకు సరళవాక్యాలు ఉండడం అవసరం. సంశిష్టవాక్యాన్ని సరళవాక్యంగా మార్చుకోవాలి. 'బడువాక్యాలు' 'జరుగుడు వాక్యాలు' 'సంబోధక బోధక పదాలున్న వాక్యాలను' తీసేయాలి.

## 2.1 బడు వాక్యాలు

వీనినే కర్మణి వాక్యాలు (passive sentences) అంటారు. వీనిలో క్రియకు 'బడు' అనుబంధ క్రియ చేరుతుంది.

'కర్ఫ్యూ విధించబడింది' 'హంతకుడు అరెస్టు చేయబడ్డాడు' 'ఈ భవనం 18వ శతాబ్దంలో కట్టించబడింది' అన్న వాక్యాలు వార్తల్లో వినిపిస్తున్నాయి. పత్రికా రచనలో కనిపిస్తున్నాయి. వీనినే వ్యావహారిక భాషలో రాస్తే 'కర్ఫ్యూ విధించారు' 'హంతకుని అరెస్టు చేశారు' 'ఈ భవనం 18వ శతాబ్దంలో కట్టారు' అని తెలుగుకు సహజమైన వాక్యాలు తయారవుతాయి. అపుడు 'ఎవరు?' అన్న ప్రశ్న వస్తుందని దానికి సమాధానం చెప్పడం కష్టమని కొందరి వాదన. అందుకు చేకూరి రామారావు మూడు సందర్భాల్లో 'బడు వాక్యాన్ని' వాడవచ్చు అన్నారు. కానీ ఇపుడు ఆ అవసరం లేదు. టీ.వీలో 'బడు' వాక్యాల ప్రయోగం తగ్గించారనే చెప్పాలి.

## 2.2. జరుగుడు వాక్యాలు

వీనినే 'క్రియా ప్రాధాన్య' వాక్యాలు అంటారు. వక్త తాను చెప్పదలచుకున్న విషయాన్ని నొక్కి చెప్పే క్రమంలో క్రియకు 'జరిగింది' అన్న పదాన్ని చేరుస్తాడు. ఇది కూడా భాషకు కృతకంగా ఉంటుంది. రాజకీయ నాయకుల భాషలో ఈ రకమైన వాక్యాలు ఎక్కువ.

'ప్రభుత్వాధికారులను హెచ్చరించడం జరిగింది'

'వారిని అరెస్టు చేయడం జరిగింది'

'ఇంతకుముందే ఈ విషయాన్ని మా సర్వే ద్వారా చెప్పడం జరిగింది'

అన్న వాక్యాలు వార్తల్లో బాగానే వినిపిస్తున్నాయి.

'ప్రభుత్వాధికారులను హెచ్చరించారు'

'వారిని అరెస్టు చేశారు'

'ఇంతకుముందే ఈ విషయాన్ని మా సర్వేలో చెప్పాము'

అని రాయడం వ్యవహారిక భాషకు సహజం. కానీ ఆ విధంగా చెప్పడం ద్వారా ఊనిక () తగ్గిందని కొందరి వాదన, ఊనిక సంగతి ఎలా ఉన్నా భాష కృతకమై పోయింది.

## 2.3 సంబంధ బోధక వాక్యాలు

ఇంగ్లీషు భాషలో ఉన్న Relative Pronouns యథాతథంగా తీసుకోవడం వలన ఈ రకమైన వాక్యాలు తయారవుతున్నాయి. 'ఏదైతే ఉందో' 'ఇక్కడ ఎవరైతే ఉన్నారో' 'మీరు ఏ దృశ్యాన్నయితే చూస్తున్నారో' 'వారు ప్రత్యక్ష సాక్షులు' అన్న ప్రధాన వాక్యాలు ప్రత్యక్ష ప్రసారాల్లో ఎక్కువగా వినిపిస్తున్నాయి. నాటకీయత కోసం ఈ రకమైన వాక్యాలను వాడుతున్నారు. కానీ భాష సహజత్వం కోల్పోతున్న విషయాన్ని గమనించడం లేదు.

తెలుగులో సంబంధ బోధక పదాలను క్రియా విశేషణంగా మారుస్తారు. 'ఇక్కడ ఉన్నవారు' 'మీరు చూస్తున్న దృశ్యం' అనడం ద్వారా వ్యావహారిక భాషకు దగ్గరవుతారు.

## 2.4 సంశ్లిష్ట వాక్యాలు

ఒక వాక్యంలో మరో వాక్యం ఇమిడిపోవడం సంశ్లిష్ట వాక్య లక్షణం. ఇవి పత్రికారచనలో బాగుంటాయి. కానీ టీ.వీ వార్తల్లో ఇమడవు. ప్రేక్షకుడికి సులభంగా అర్థంకాని వాక్యాలివి. విషయం పటిష్టంగా ఉండాలంటే సంశ్లిష్ట వాక్యాన్ని చిన్న చిన్న వాక్యాలుగా మార్చుకోవాలి.

'సమ్మె చేస్తున్న మూడువేలమంది విద్యార్థులను ప్రభుత్వం అరెస్టు చేయించింది'

ఈ సంశ్లిష్ట వాక్యాన్ని 'Hard lead' లో ఉపయోగించవచ్చు. విషయాన్ని నేరుగా సూటిగా చెప్పేవి. Hard lead Breaking news లోను, న్యూస్ హెడ్‌లైన్స్ లో ఈ తరహా వాక్యాలు ఉంటాయి. అయితే ఇదే వాక్యాన్ని కొంచెం నెమ్మదిగా, సున్నితంగా చెప్పే ప్రయత్నం చేయాలి. దాన్ని 'soft lead' అంటారు. పై వాక్యాన్ని 'విద్యార్థుల సమ్మెను అణిచేందుకు ప్రభుత్వం సన్నద్ధమైంది. అందులో భాగంగా ఈరోజు మూడువేలమందిని పోలీసులు అరెస్టు చేశారు' అని వార్తను కాస్త నిదానంగా చెప్పవచ్చు. 24 గంటల న్యూస్ ఛానల్‌లో Head lead ఉండే వార్తలు ఎక్కువ. తక్కిన ఛానల్స్ లో Soft lead ఉండే వార్తలు ఎక్కువ.

అయితే Hard news కు Hard lead ముందు చెప్పి, Soft lead లోకి వెళితే ఆ వార్త ప్రేక్షకుడిని ప్రభావితం చేస్తుంది. Soft news ను Hard lead తో ప్రారంభిస్తే ఆ వార్త అభాసుపాలవుతుంది. సీరియస్ వార్తను స్థాయి తగ్గించడం ఎంత తప్పో, సరదా వార్తను సీరియస్‌గా పరిచయం చేయడం అంతే తప్పు.

## 2.5 వాక్యంలో అర్థం సందిగ్ధత

వాక్యంలో క్రియలకు 'అని' చేర్చినపుడు కొన్నిసార్లు అర్థ సందిగ్ధత ఏర్పడుతుంది. మంత్రిగారు సమ్మెలో పాల్గొన్న వారికి జీతాలు ఇవ్వమని చెప్పారు. జీతాలు ఇవ్వమన్నారా? ఇవ్వవద్దన్నారా? అన్న అర్థ సందిగ్ధత ఏర్పడుతుంది.

(అ)

ఇవ్వము +అని - ఇవ్వమని

చెల్లించము +అని - చెల్లించమని

(ట) (డ)

ఇవ్వుము +అని - ఇవ్వుమని

చెల్లించుము +అని - చెల్లించుమని

సందిగతంగా స్వల్పమైన భేదం ఉండడం వలన అది చదివేటప్పుడు ధ్వనించదు. విన్నవారికి అర్థ సందిగ్ధత ఏర్పడుతుంది. అటువంటి చోట 'ఇవ్వవలసిందిగా' చెప్పారు అని లేదా 'ఇవ్వబోమ'ని చెప్పారు అని స్పష్టం చేయాల్సిన అవసరం ఉంది.

## II. వార్తా పఠనం

సిబ్బంది అంతా కలిసి చేసిన కృషిని నిలబెట్టడం, పడగొట్టడం న్యూస్ రీడర్ చేతిలోనే ఉంది. క్షణాల్లో ఛానల్స్ మార్చే రిమోట్ కంట్రోల్ ప్రేక్షకుల చేతిలో ఉంది. అందువలన ప్రేక్షకుడిని ఆకట్టుకునే బాధ్యత న్యూస్ రీడర్లదే. చాలామంది పనులు చేసుకుంటూ ఒక చెవిని ఇటు పడేస్తారు. అటువంటి వాళ్ళకు కూడా వార్తలు అర్థం కావాలి. ఒకసారి చదివిన వార్తను మళ్ళీ చదివి వినిపించే అవకాశం లేనందువలన ప్రేక్షకుడికి అర్థం అయ్యేలా నిదానంగా స్పష్టంగా చదవాలి. వార్తాపత్రిక చదివేవాళ్ళకు వాక్యం అర్థం కాకపోతే మరొకసారి చదువుకునే అవకాశం ఉంటుంది. కానీ టి.వీ వార్తల్లో అలాంటి సౌకర్యం లేదు. అందుకు న్యూస్ రోడర్ చదివే వార్తను ప్రేక్షకుడు విని అర్థం చేసుకుని, అనుభూతి చెందగలిగే వార్తాపఠనం సాగాలి. న్యూస్ రీడర్ గొంతులో ఆ భావం పలకాలి.

పాశ్చాత్య దేశాల్లో టీ.వీ వార్తలు మొదలైన రోజుల్లో నాటకాలు రాసేవాళ్ళను న్యూస్ రీడర్లుగా ఎంచుకునేవారు. వాచకం, అభినయం తెలిసిఉండడం వలన వార్తాపఠనాన్ని వారు రక్తి కట్టించేవారు. అయితే రాను రాను వార్తల్లో

నాటకీయత ఎక్కువైందన్న విమర్శ రావడంతో జర్నలిస్టులే వార్తలు చదవడం మొదలుపెట్టారు. ఆ తరువాత కేవలం అందం, ఆకర్షణ, స్పష్టంగా చదవడం అనే అర్హతల ఆధారంగా న్యూస్ రీడర్ల ఎంపిక సాగుతోంది గాత్రం బాగున్నా తెరమీద ఆకర్షణీయంగా కనిపించలేనివారు బిడియపడేవాళ్ళు 'వాయిస్ ఓవర్ ఆర్టిస్టులు'గా ఎంపిక అవుతున్నారు. కాస్త అభినయం జోడించి అలవోకగా మాట్లాడగలిగేవారు 'యాంకర్లు'గా మారుతున్నారు. వార్తకు ప్రాణంపోసేది న్యూస్ రీడర్లు, వాయిస్ ఓవర్ ఆర్టిస్టులు (దృశ్యరూపంలో ఉండే వార్త కథనాలకు నేపథ్యంలో చెప్పే వ్యాఖ్యానమే వాయిస్ ఓవర్) న్యూస్ రీడర్లు ఉచ్ఛారణ విధానం పదాల ఊనిక (Stress) పద సంహిత(Juncture) శృతి (Tone) వార్తలకు ప్రాణం పోస్తాయి.

### 1. ఉచ్చారణ

అనవసరమైన చోట్ల ఒత్తులు, అవసరమైన చోట ఒత్తులు తీసివేయడం, దీర్ఘాలు లేనిచోట పెట్టడం, ఉన్నచోట తొలగించడం మామూలైపోయింది. శషసల భేదం పాటించడం కొంతమందికి తెలియదు. వీనితోపాటు పరభాషాపదాలను ఎలా పలకాలో కొందరికి తెలియదు. భూకంప తీవ్రతను కొలిచే 'రిక్టర్ స్కేల్' గురించి చెపుతూ ఒక్ న్యూస్ రీడర్ 'రిక్టర్ స్కేల్' (Richter scale) అనడానికి బదులుగా 'రిచ్‌టర్ స్కేల్' అని చదివి అభాసుపాలయింది. ముఖ్యంగా హిందీ, ఇంగ్లీష్ పేర్ల విషయంలో అప్రమత్తంగా ఉండడం అవసరం.

హాంగ్ కాంగ్‌ను హాంకాంగ్, వాయిస్ ఓవర్‌ను వాయిసోవర్ అనాలి Prince Charles పేరును ప్రిన్స్ చార్లెస్ అని రాస్తున్నారు. కానీ దాన్ని 'ప్రిన్స్ ఛాల్స్' అని ఆంగ్లేయులు పలుకుతారు.

### 2. ఊనిక (Stress)

ఉచ్చారణ దోషాలు లేనంతమాత్రాన వార్తలు బాగా చదివినట్లు కాదు. కొందరు వార్తలు చదువుతుంటే జోల పాడినట్లుగా ఉంటుంది. అన్ని రకాల వార్తల్ని, అన్ని రకాల వాక్యాల్ని ఒకే రకంగా చదవడం వలన స్క్రిప్ట్ ఎంత బాగున్నా ఆ శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది. గొంతులో మాడ్యులేషన్ (స్వరభేదం) లేకపోతే వార్త రక్తి కట్టదు. వాళ్ళు బాగా చదవగలిగితే పేలవంగా ఉన్న స్క్రిప్టు సైతం అర్థవంతంగా మారుతుంది. స్క్రిప్టు రాసిన వారి రచనకు తగినట్లుగా న్యూస్ రీడర్ వార్తను చదవగలగాలి. వాక్యం ఒకేవిధంగా ఉన్నప్పటికీ ఏ పదాన్ని ఒత్తి పలకాలనేది సందర్భాన్ని బట్టి మారుతుంది. ఉదాహరణ ముఖ్యమంత్రి నిన్న

ఢిల్లీ వెళ్ళారు అన్న వాక్యంలో ఎవరు ఢిల్లీ వెళ్లారో తెలపడం అవసరమైనప్పుడు ముఖ్యమంత్రి అన్నపదాన్ని ఒత్తి పలకాలి. ఆయన ఎక్కడికి వెళ్లారన్న విషయం ప్రధానమైనప్పుడు ఢిల్లీకి అన్నపదాన్ని నొక్కి చెప్పాలి. ఎప్పుడు వెళ్ళాడో చెప్పడం ముఖ్యమైనప్పుడు 'నిన్న' అన్న పదానికి ప్రాధాన్యం ఇవ్వాలి. ఢిల్లీకి వెళ్ళడం ప్రధానమైన అంశం అయితే 'వెళ్ళాడు' అన్న క్రియను నొక్కి చెప్పాలి.

ఒక వాక్యంలో పదాన్ని నొక్కడం ద్వారా విషయానికి ప్రాధాన్యం వచ్చినట్లుగానే వాక్యంలో పదాల విభజన ద్వారా కూడా అర్థం మారిపోతుంది.

### 3. పద సంహిత

పదాల మధ్య అవ్యవహిత అవ్యవహితోచ్చారణ పదసంహిత. ఆస్థానం, ఏకాకి అన్న పదాల్లో ఆ, ఏ లను విశేషణాలుగా విడగొడితే వాని అర్థం మారిపోతుంది. ఆ స్థానం, ఏ కాకి అవుతాయి. 'పెద్ద పండ్ల చెట్లు' అన్న సమాసంలో 'పెద్ద' అన్న విశేషణాన్ని దేనికి అన్వయించాలి. పండ్లకా? చెట్టుకా? వ్యవధానం ద్వారా ఆ అర్థభేదాన్ని సాధించవచ్చు.

పెద్ద పండ్లచెట్టు! పెద్ద పండ్ల చెట్టు

వాక్యంలో పద విభజన సరిగా లేకపోతే అర్థం మారిపోయే ప్రమాదం ఉంది. 'కూలీలు అందరికీ భోజనాలు పెట్టారు' అన్న వాక్యంలో కూలీలే అందరికీ భోజనాలు పెట్టినట్లు అర్థం వస్తుంది. కూలీలు అందరికి అన్న పదాల మధ్య వ్యవధానం లేకుంటే కూలీలకు భోజనం పెట్టినట్లు అర్థం వస్తుంది. కూలీలందరికీ భోజనాలు పెట్టారు

### సంయుక్త వాక్యాలు

సంయుక్త వాక్యాల్లో సంకలన సంబంధం ఉన్నప్పుడు రాసే భాషలో కామాతో వానిని వేరు చేస్తారు.

'సుజాత, రామారావు పాట పాడారు' అన్న వాక్యాన్ని కామా ఉన్నచోట దీర్ఘం చేర్చి 'సుజాతా, రామారావు పాట పాడారు' అని చదువుతారు.

అపుడు 'మిసెస్ సుజాత రామారావు పాట పాడింది' అన్న అర్థం వస్తుంది. కామా తీసేసి దీర్ఘం చేరిస్తే కొన్ని కావ్యాల్లో అర్థం మారుతుంది. కానీ ఇక్కడ అదే అర్థం వస్తుంది. ఆ సందిగ్ధత తొలగాలంటే 'సుజాతా, రామారావు ఇద్దరూ పాట పాడారు' అని చదవాలి.

'ఒక మహిళ ఇద్దరు యువకులపై కేసు నమోదు చేశారు' అన్న వాక్యంలో ఇద్దరు యువకులపై కేసు నమోదు చేసినట్లు అర్థం వస్తుంది. కామా తీసేసి దీర్ఘం చేర్చడం ద్వారా మహిళాపైన, యువకులపైన కేసు నమోదు చేసినట్లు స్పష్టం అవుతుంది. లేదా ఒక మహిళాపైన, ఇద్దరు యువకుల పైన కేసు నమోదు అన్నప్పుడు గొడవే లేదు.

జర్నలిజానికి గ్లామర్ పెంచింది టీ.వీ జర్నలిజం. రిపోర్టర్ తెరమీద కనిపించే అవకాశమే అందుకు కారణం. టీ.వీలో కనిపించేవారి విషయంలో ప్రేక్షకులకు అందే సందేశాన్ని నిపుణులు కొన్ని భాగాలుగా విభజించారు. 55 శాతం సందేశం బాడీ లాంగ్వేజ్ ద్వారా చేరుతుంది. 38 శాతం సందేశం అతని వైఖరి, మాటశైలి ద్వారా అందుతుంది. 7 శాతం మాత్రమే మాటల ద్వారా చేరుతుంది. అందుకే కెమేరా ముందుకు అషామాషీగా వెళ్ళకూడదు. అభాసుపాలు కాకూడదు.

తెలుగు ఛానల్స్ అందానికే ప్రాధాన్యత ఇచ్చే పరిస్థితి ఉన్నా, న్యూస్ రీడర్ల అందం ఎంతవరకు ఆదుకుంటుందన్నది ప్రశ్నార్థకమే. తగినంత శిక్షణ లేకుండానే వార్తలు చదివే ఛానల్స్ భాషాభిమానుల నుంచి తీవ్ర నిరసనను ఎదుర్కొంటున్నాయి. న్యూస్ రీడర్ల డ్రెస్‌కు, హెయిర్ స్టైల్‌కు ఇస్తున్న ప్రాధాన్యం భాషకు, ఉచ్ఛారణకు ఇవ్వడం లేదన్న విమర్శలు పెరిగాయి. అందుకే జర్నలిస్టులనే న్యూస్ రీడర్లుగా ఎంచుకొంటున్నారు. బి.బి.సి, సి.ఎన్.ఎన్. రెండు తమ ప్రత్యేకతను చాటుకున్నాయి. వారు న్యూస్ రీడర్లకు కొన్ని మార్గదర్శక సూత్రాలు అందించారు.

స్క్రిప్టును ఒకటికి రెండుసార్లు బాగా చదువుకోవాలి. న్యూస్ రీడర్ తనకంటూ ఒక శైలిని అలవరచుకోవాలి. వార్తాపఠనంలో ఆత్మవిశ్వాసం తొణికిసలాడాలి. స్పష్టంగా కీలకమైన పదాలను ఒత్తి పలుకుతూ తగినంత వేగం పాటించాలి. వార్త చదువుతున్నట్లు కాక ఒక విషయాన్ని చెపుతున్నట్లుగా ఉండాలి. అందుకు వార్తా రచన వ్యావహారిక భాషకు దగ్గరగా ఉండాలి అంటూ కొన్ని సూచనలు చేశారు ఈ విధంగా టీవీల్లో వార్తా రచన, వార్తాపఠనం రెండూ వార్తకు సజీవత్వాన్ని తెస్తాయి. పాఠకుడిని ప్రేక్షకుడిగా మారుస్తాయి.

# ఈ తరం విద్యా వ్యవస్థ – రేపటి ప్రగతి



డా. శారదాపూర్ణ శొంఠి

నేటి యువ తరం ప్రపంచమంతటా అందరి జీవిత ప్రవాహం లో అంతర్నిగూఢంగా ప్రవహిస్తున్న విశ్వతత్త్వాన్ని తెలుసుకోవాలని ప్రయత్నంచేస్తోంది. సాంకేతిక విజ్ఞానం, శాస్త్రీయ పరిజ్ఞానం, అంతర్జాల విలసనం, అంబరమంటుతుంటే ఆలోచన అనుభవాల మధ్య సమన్వయం కోసం ప్రయత్నిస్తోంది. దొరికిన ఆధారాలని విశ్లేషిస్తోంది. వివేచిస్తోంది. అభివ్యక్తీకరిస్తోంది. ప్రయోగ విధానాలకోసం వెతుకుతోంది. అన్వయ మార్గాలు వెతుకుతోంది . అంతస్సత్వం గా అనుభవిస్తోంది . ప్రక్రియలో, ప్రవృత్తిలో , భాషలో, భావంలో, ఆలోచనలో, శాస్త్రంలో, వస్తువులో, విషయం లో అంతర్జాతీయ వ్యవస్థ అవగాహనకి శ్రమిస్తోంది. తన జాతీయ అస్తిత్వానికి, దేశ అస్తిత్వానికి బలమైన ఆధారం ఆయుధం కావాలని ఆశిస్తోంది. ఈ ప్రయత్నం లో గతం లోకి చూడటం సహజం. చరిత్ర పుటలు తిరగవెయ్యటం ఇంకా సహజం. గతం అందించిన ప్రక్రియలని, అన్వయ విధానాలని, ప్రయోగ విశేషాలని, తాత్త్విక రహస్యాలని పునర్వ్యాఖ్యానించుకుంటు ముందుకు సాగాలని చూస్తోంది. విద్యాభ్యాసం, విద్యావ్యవస్థ, విద్యావిధానం, జిజ్ఞాస, ఆధార భూమికగా చేసుకుని ప్రశ్నిస్తూ అడుగులు వేస్తోంది .విద్యా వ్యవస్థలో, ప్రణాళికల్లో మార్పు కోరుకుంటోంది. నవ్య సంప్రదాయ భూమిక మీద నిలబడి భవిష్యత్తులోకి చూస్తోంది .నేటి యువత గతం కన్నా వర్తమానం ముఖ్యమని నమ్మింది.

బ్రహ్మాండం గా కనిపించే సమస్యలని అతి స్వల్పమైన వాటిగా గుర్తించి ఎవరికి వారుగా పరిష్కరించుకోగల సామర్థ్యం సంపాదించటమే విద్య ప్రయోజనం. రేపటి దేశాన్ని, దశలని నిర్ధారించి మార్గం నిర్దేశించటం కోసమే విద్య. విద్య ప్రగతికోసం .

విద్య పరివర్తన కోసం. హేతుబద్ధమైన ఆలోచన పెరగటం కోసం మార్పురావాలి. భూమిక మారాలా ? ప్రపంచ మేధావులు, విద్యావేత్తలు ఈ ప్రశ్నలకి సమాధానాలు అందించిన నాడు సంయమనం,సామరస్యం నిశ్చయం. ఎల్లలు చెరిగి దేశాలన్నీ ప్రపంచ కుగ్రామం గా మారాయి. భూగోళపు పరిధి కుంచించుకుపోతోంది. సాంకేతిక విజ్ఞానం ఇతర గ్రహాలకి తీసుకువెళ్తోంది. భారత దేశం మిగిలిన అగ్ర రాజ్యాలతోపాటు వారితో సమానంగా ముందుకి నడుస్తోంది. ఇది నిస్సందేహమైన విషయం.

పదిహేను వందల సంవత్సరాల భారత చరిత్రలో విద్య విషయకంగా గమనించదగ్గ విశేషం ఒకటుంది. అది చాలాఈరోజున 634,321 గ్రామాలున్న భారత దేశం, 700,000,000 గ్రామ ప్రజానీక మున్నదేశభాగం విద్యావంతులైన మిగిలిన వర్గాలతో పాటు తమకి కూడా విద్యనీ , అవకాశాలనీ ఆశిస్తోంది. ప్రపంచ జనాభాలో 12.2 % శాతం భారతదేశ గ్రామీణ జన సందోహమే. స్వతంత్రం వచ్చాక 1951 ప్రాంతం లో 16% మాత్రమే విద్య వ్యవస్థలో పెరుగుదల కనిపించింది. 1986 నాటికి అది 36% పెరిగింది. మూడు దశాబ్దాల కాలం లో వచ్చిన అక్షరాస్యత అప్పటి ప్రభుత్వాన్ని , విద్యావేత్తలని నిరాశ పరచటం తో 1986 లో నేషనల్ పాలసీ అఫ్ ఎడ్యుకేషన్ అమలయింది. కుల మత విషయాలలో, ఆడ పిల్లల విద్య విధానాలలో ప్రత్యేక శ్రద్ధ వహించటం మొదలయింది.

> విద్యారంగం లో 2015 నాటికి ఊహించని పరిణితి వికాసం వచ్చింది. దేశాన్ని సులభంగా, సరళమైన విధంగా ప్రగతి మార్గం పట్టించగల విధానాలకోసం తీవ్రంగా ప్రయత్నాలు సాగాయి.

విద్యారంగం లో 2015 నాటికి ఊహించని పరిణితి వికాసం వచ్చింది. దేశాన్ని సులభంగా, సరళమైన విధంగా ప్రగతి మార్గం పట్టించగల విధానాలకోసం తీవ్రంగా ప్రయత్నాలు సాగాయి. మేధావి వర్గం ఒకటై సాంకేతిక పరికరాల వైపు, విధానాలవైపు దృష్టి సారించింది. సాంకేతిక అంతర్జాల విద్యావ్యవస్థ ప్రపంచమంతటా అల్లుకుపోయింది. భారతీయ విద్యావేత్తల, పరిశోధకుల పాత్ర ఎక్కువ. అమెరికా వలస పెరిగింది. యాభై సంవత్సరాల పాటు వైద్య వృత్తిలో ఉన్నవారు అధిక సంఖ్యలో వెళ్తుంటే, వారికి తోడై సహాయకారిగా కంప్యూటర్

సాఫ్ట్ వేర్ రంగం ప్రవాస వాసం మొదలుపెట్టింది. అత్యద్భుతమైన ప్రగతి సాధించింది. దానికనుగుణంగా వ్యవస్థ ఏర్పడింది. విదేశాలలో విద్యా సంస్థలు, వ్యాపార సంస్థలు, భారత దేశంలో అడుగుపెట్టి నివాసం ఏర్పరచుకున్నాయి. రెండు అగ్ర రాజ్యాల మధ్య వాణిజ్య విద్యా సాంకేతిక వ్యాపార సంబంధాలు పెరిగాయి. ఆసక్తికరం. 'మన విద్యావిధానం విదేశాలు చేరటం, పాశ్చాత్యులు మనదేశం వలస రావటం' ఏనాడో ప్రారంభమైన వ్యవస్థ ఈ రోజున సమపాళ్లలో సాగటం. .

581 AD నాడు భారత దేశం నుంచి సంగీత కళాకారుడు Emperor Kao Tsu సభ చేరటం, 618 AD లో చైనా నుంచి Tang Dynasty వారు విద్యా నిమిత్తం మన దేశం రావటం, 860 AD ప్రాంతంలో బలదేవ్ మహారాజు నలంద విశ్వవిద్యాలయానికి ఇండోనేసియా నుంచి విద్యార్థులకి ప్రవేశార్హత కల్పించటం, తక్షశిల నలంద విశ్వ విద్యాలయాల వలన దేశాల మధ్య రాకపోకలు పెరగటం,

1200 ప్రాంతం భారతం లో కల్లోలం విద్యావిధానాలు క్రుంగటం, మత కుల లింగ అరాచకాలు, 1250 AD నుంచి సంస్కృతం, సంస్కృతి విదేశ పయనం, 1500 AD లో థాయిలాండ్ నుంచి విద్యావిషయకం గా భారతానికి విద్యార్థుల రాకపోకలు, 1794 AD లో కోపెన్ హాగెన్ లో మొట్టమొదటి సారి విశ్వ విద్యాలయాల్లో సంస్కృత భాష బోధన, 1800 - 1850 AD నాటికి 8 యూరోపియన్ విశ్వవిద్యాలయాల్లో సంస్కృతానికి ప్రత్యేక శాఖల స్థాపన, భారతదేశంనుంచి గ్రంథాల తరలింపు, పరిశోధనలు - వంటి ప్రగాఢమైన సంఘటనలు చరిత్ర పుటల్లో ముఖ్యమైన అధ్యాయాలుగా మారాయి. ఎప్పటికప్పుడు మార్పులు సంభవిస్తూనే ఉన్నాయి.

2018 AD నాటికి భారత దేశం నుంచి ఉన్నత విద్యా భ్యాసం చేసిన వారు అధిక శాతం అమెరికా, ఇతర దేశాలు చేరి, స్థిరపడి, విదేశ సంస్కృతిని, విద్యావిధానాలని, సాంకేతిక పరిజ్ఞానాన్నిదిగుమతి చేసుకుని, దేశాన్ని ముందడుగు వేయించటం వలన అనూహ్యమైన మార్పు సంభవించింది .

భారత దేశం లో TV, Radio, Computer technology , Film & Movie industry, News Paper media , International & National Press, Mobile communications మొదలైన ప్రసార మాధ్యమాలన్నీ ఉత్సాహంతో అతివేగంగా ప్రయత్నం సాగించటం, ప్రచారం చెయ్యటం, అవకాశాలు కల్పించటం, జాతి కుల మత లింగ భేదం చూపక అందరికీ అందుబాటులోకి తేవటం గమనార్హం.

ఈ ప్రయోగం వలన వచ్చిన, వస్తున్నమార్పు విశ్లేషణకి, నిర్వచనానికి, నిర్దిష్టమైన వ్యవస్థ నిర్మాణానికి అందకుండా పోతోంది అనే విషయం కూడా చర్చించ వలసిన విషయమే.

> ఒకనాడు భారతాన్ని ఆమూలాగ్రం గా పరిపాలించిన సంస్కృతభాష ఈనాడు దేవాలయాలకి, కళలకి, పరి మితమై సంపూర్ణం గా ' మారువేషం ' లో ఉండటం చూడవచ్చు. సంస్కృత భాష ప్రజా జీవనంలో కలిసిపోయింది.

ఒకనాడు భారతాన్ని ఆమూలాగ్రం గా పరిపాలించిన సంస్కృతభాష ఈనాడు దేవాలయాలకి, కళలకి, పరి మితమై సంపూర్ణం గా 'మారువేషం' లో ఉండటం చూడవచ్చు. సంస్కృత భాష ప్రజా జీవనంలో కలిసిపోయింది. ఒకప్పుడు విద్యావ్యవస్థ సర్వం సంస్కృతంలో ఉండేది. ఈ రోజు ఆంగ్లభాష ప్రపంచాన్ని పరిపాలిస్తోంది. పల్లెలు చేరుతున్న సాంకేతిక వైజ్ఞానిక అంతర్జాల పరిజ్ఞానం భారతదేశ 27 జాతీయ భాషల స్వరూపాన్ని మార్చివేసే పరిస్థితి వచ్చే అవకాశం పొలిమేరల్లో ఉంది. ఈ విషయం ఒక విధమైన భయావహంగా తయారైన మాట నిజం. ప్రజలలో అభద్రతా భావం కలుగుతోంది. సాంస్కృతిక అస్తిత్వం, దేశ భాషా అస్తిత్వం బలహీనమై విదేశీ ప్రభావం బలవత్తరమవుతోంది. మన భారతదేశ సాంస్కృతిక భాషా వ్యక్తిత్వాలకి వినాశం ఏర్పడకుండా విద్యావేత్తలు, ప్రభుత్వం మేధావులు అధికారంలో ఉన్నవారు ఈ విషయం లో తగు జాగ్రత్త వహించాలి.దేశ ప్రగతికి, వికాసానికి, విలాసనకి, పురోగమనానికి తగిన విద్యావిధానాలు అమలు లోకి రావాలంటే భాగీరథ ప్రయత్నం చెయ్యాలి. మనకి అందుబాటులోకి వచ్చిన విద్యా విధానాలనీ, పరికరాలనీ, వ్యవస్థలనీ దేశాభివృద్ధి కనుగుణంగా మలచుకునే మార్గం ఏర్పాటుచేసుకోవాలి. దేశ సంస్కృతికి, ఆశయాలకు, ఆలోచనలకి భంగం కానీ వాతావరణం కోసం ప్రయత్నం సాగాలి. అయితే ఆ మార్పుని పతనం క్రింద పరిగణింపవచ్చా ? కారణం ఏమిటి ? బ్యాశ్యత ఎవరిదీ? వ్యవస్థదా వ్యక్తులదా? దానినాపే విద్యావ్యవస్థ మనకుందా ? విద్యావేత్తలున్నారా ? ప్రభుత్వం గుర్తించిందా?

'ఈనాడు' మనిషి కన్నా మానవత్వం, వ్యక్తికన్నా వ్యక్తిత్వం, వ్యవస్థకన్నా వెనుకనున్న సిద్ధాంతం, సూత్రంకన్నా ప్రయోగం , ప్రభుత్వం కన్నా ప్రజాస్వామ్యం, వస్తువుకన్నా అందించే ప్రయోజనం' అధికంగా విలువ పొందుతున్నాయి. మనిషి మనుగడ కన్నా మనిషి ప్రభావం మన్నన పొందుతోంది.

పత్రికల స్థానం లో Face Book, Twitter, Whatsapp, Instagram వంటివి అతి ప్రాచుర్యంలోకి వచ్చాయి. పాఠశాలలకి బదులు Star Bucks, Fresh Start వంటి ప్రదేశాలు ఆకరమయ్యాయి. పుస్తకాలకి CD-s, audio Video accessories & E- Books స్థానభ్రంశం కల్పించాయి. మూడేళ్లు నిండని పసి పిల్లలు కూడా కంప్యూటర్ వాడుకుని విషయం నేరుస్తున్నారు. విదేశాలన్నీ ప్రభుత్వాదేశానుసారం పాఠశాలల్లో విద్యా పరికరాలుగా సమకూరుస్తున్నారు. నాట్యానికి సంగీతానికి కళకి చలన చిత్రాలు, Skype , Face Time , Messenger వంటి మాధ్యమాలు ఆధారమవుతున్నాయి. కళాకారుల ప్రదర్శనల ప్రేక్షకుల సంఖ్య తగ్గింది. శ్రోతల సంఖ్యా పలుచబడింది. You Tube వంటి మాధ్యమం వలన వేలాది జనం తక్కువ ప్రయత్నంతోనే వినోదాన్నీ విజ్ఞానాన్నీ, ఆనందాన్నీ పొందుతున్నారు. వైద్యానికి విద్యకీ కూడా Google , Wikipedia వంటి అంతర్జాల సైట్లు చాలా వరకు తోడవుతున్నాయి. పాఠశాలలు, విద్యాసంస్థలు, గురుకులాలు, సంగీత సంస్థలు, కళాసంఘాలు, గ్రంథాలయాలు, అనవసరమన్న భావన కలుగ జేస్తున్నాయి. ఊహించని పరిమాణంలో Computer programing అభివృద్ధి చెంది ప్రపంచాన్ని నడిపిస్తోంది.

సాంకేతికపరిజ్ఞానం విద్యని సంపూర్ణం గా సులభంగా, అందించి మెరుగు పరచవచ్చు. క్రొత్త తరం వారు తమతమ రంగాల్లో అభ్యుదయం సాధించవచ్చు. విద్యార్థులు చిన్నవయసులోనే అపరిమిత విజ్ఞానం సంపాదించవచ్చు.

"సాంకేతిక పరిజ్ఞానం విద్యని సంపూర్ణం గా సులభంగా, అందించి మెరుగు పరచవచ్చు. క్రొత్త తరం వారు తమతమ రంగాల్లో అభ్యుదయం సాధించవచ్చు. విద్యార్థులు చిన్నవయసులోనే అపరిమిత విజ్ఞానం సంపాదించవచ్చు."

ఇటువంటి వాతావరణంలో యువత నవ ప్రపంచ వీధుల్లో పరుగులు పెడుతూంటే మరొక మేధావి వర్గం మరొక కోణంలో ఆలోచన సాగిస్తోంది. 'పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసం' లేని విద్య, శాంతియుత ప్రపంచాన్ని ప్రసాదించని విద్య , మానవత్వపు విలువలు నేర్పని విద్య, వ్యర్థమని ఉద్ఘాటన ప్రారంభించారు. నెల్సన్ మండేలా, Warren Buffett, Dalai Lama, Jeff Bezos, Geoffrey Canada, Yoani Sanchez , Mia Farrow , Aung San Suu Kyi - వంటి పాశ్చాత్య అంతర్జాతీయ మహామహులే కాక, అబ్దుల్ కలామ్ వంటి మేధావులు దేశ నాయకులు, భారత దేశంలో స్ఫూర్తినిస్తూ భిన్న భిన్న మార్గాలలో ప్రజని అభ్యుదయ మార్గం పట్టిస్తున్న Roshni Mukherjee ( Online education), Aditya Kumar ( Taking education where rural lands of India ) Arvind Gupta ( Learning as fun for all ) Rajesh Kumar Sharma ( No building for school), Abdul Malik ( who swims to school), Anand Kumar ( teaching dreamers to dream for better tomorrow ), చలన చిత్రాలతో ప్రపంచ సంచలనం కలిగిస్తున్న రాజమౌళి వంటి దర్శకులు , JD లక్ష్మి నారాయణ వంటి విద్యావేత్తలు, చాగంటి వంటి ప్రవచన కారులు, మరెందరో విద్యావిధానాల్లో మార్పులు తెస్తున్నారు. వీరు పాటిస్తున్న విధానాలని సూక్ష్మ దృష్టితో పరిశీలించవలసిన అవసరం ఉంది.

> "ఇప్పటి వరకు సాగిన విద్యా వ్యవస్థ ఒక విధం గా ఉంది. ఈ నాటి వ్యవస్థ వేరుగా ఉన్న వైనం మనకి తెలిసినదే. పూర్వం 'తాత్త్వికత – అన్వయ దృష్టి' ప్రధానమైతే ఈ నాడు 'వైజ్ఞానికత – ప్రయోగ దృష్టి 'ముఖ్యం. దృష్టిలో మార్పు, వ్యవస్థలో మార్పు కారణం."

ఇప్పటి వరకు సాగిన విద్యా వ్యవస్థ ఒక విధం గా ఉంది. ఈ నాటి వ్యవస్థ వేరుగా ఉన్న వైనం మనకి తెలిసినదే. పూర్వం 'తాత్త్వికత - అన్వయ దృష్టి' ప్రధానమైతే ఈ నాడు 'వైజ్ఞానికత - ప్రయోగ దృష్టి 'ముఖ్యం. దృష్టిలో మార్పు, వ్యవస్థలో మార్పు కారణం. వీటికి అనుగుణం గా విద్యావిధానాలు, కేంద్రాలు, సిద్ధాంతాలు, ప్రణాళికలు, మాధ్యమాలు, ఫలితాలు వస్తాయి. మార్పు ఎందువలన? ప్రయత్నాలలో ఎదుర్కునే సమస్యలని సమన్వయ దృష్టి తో పరిశీలించి పరిష్కరించుకునే సమాధానాలు లభించక, దానికవసరమైన

సామర్థ్యం విద్యా విధానాలు ఇవ్వకపోవటం వలన, ఏక సూత్రత లేకపోవటం వలన ! ప్రతిపాదికలకి బలం పటిమ లేక పోవటం వలన!

విద్యాభ్యాసం ఒక వ్యవస్థగా మన పూర్వీకులు గుర్తించారు. ఒక నిర్దిష్టమైన ప్రణాళిక ఏర్పాటుచేశారు. ఏ వ్యవస్థైనా 'గతం' 'వర్తమానం' 'భవిష్యత్తు' అన్న మూడు అంశాలమీద ఆధారపడి, సమన ప్రతిపత్తి కలిగి విలసన పొందుతుంది. విద్యా విధానాలు 'సమాజ ప్రగతి', 'వ్యక్తి త్వ వికాసం', 'శాంతియుత జీవనం' అనే మూడింటినీ సమన్వయ పరచి అందించేవిగా ఉండాలి. 'తల్లిదండ్రులు-కుటుంబం', 'గురువులు - విద్య సంస్థలు','సమాజం -జీవన విధానాలు', 'ప్రపంచ ప్రగతి - శాంతి భద్రత' ఈ నాలుగు వ్యవస్థలన్నింటినీ ప్రభావితం చేస్తాయి. ఈ ప్రయత్నం ఎక్కడ, ఎవరివలన, ఎప్పుడు ఎంతవరకు జరగాలో అక్కడ వారివలన అప్పుడు జరగాలి. చరిత్ర , శాస్త్రీయ దృక్పథం ఈ విషయావగాహనకి తోడ్పడతాయి. విద్యావ్యవస్థ మానవ జాతికంతటికీ సంబంధించిన దవటం వలన అనివార్యంగా నిరంతరంగా పరిశీలన, పర్యవేక్షణ, ప్రణాళికా బద్ధతల పై ప్రభుత్వ దృష్టి కేంద్రీకృతమై ఉండాలి ఈ పనులు వ్యక్తులు చేసేవి కావు. పరిషత్తులు చేసేవి. అధికారంలో ఉన్న ప్రభుత్వం బాధ్యతతో చెయ్యవలసిన కార్యాలు. ఆయా రంగాల్లో కృషి చేస్తున్న వారిని, విద్యావేత్తలనీ, సంఘటిత పరచి, సమావేశాలు జరిపి, చర్చలు చేసి, సిద్దాంతాలేర్పఱచి, శాస్త్ర బద్ధం గా గ్రంథస్థం చేసి, సంస్థల నేర్పాటుచేసి, విద్యావిధానాలలో ప్రవేశపెట్టి, తగిన వనరులు అందించి, ముందుకు తీసుకువెళ్లాలి. ఇదంతా ప్రభుత్వ బాధ్యత.

గతం లో వెయ్యేళ్ళ క్రితం విద్యావికాసం ఒక ప్రత్యేక దృక్పథం తో సాగిన మాట వాస్తవం. ప్రయోగించిన ప్రక్రియలు చాల వరకు ప్రౌఢమైనవి. మిశ్ర ప్రక్రియలు, సాహిత్య దర్శనాలు, దేశీయ ప్రాంతీయ దర్శనాలు , దేశాన్నఆక్రమించి ప్రభావితం చేసిన అన్యమత పాశ్చాత్య దేశదర్శనాలు, భారతీయ తాత్త్వికతతో కలిసిపోయి ఏర్పడ్డ వ్యవస్థలు. సిద్ధాంతాలు. ఈనాడు మార్పువచ్చింది.

అప్పుడు ఇప్పుడు ఎప్పుడు కూడా విద్య నందించేవారు "తల్లి దండ్రులు - గురువులు- సంఘ వ్యవస్థలు- చరిత్ర " ఈ నాల్గింటిలో ఏఒక్కటి బలహీనమైనా, పలుచనైనా మార్పు తథ్యం .

ఇక ఈ నాడున్న అంతర్జాల సాంకేతిక వైజ్ఞానిక విద్యా వ్యవస్థ యువతరాన్ని ఉద్వేగ పరుస్తోంది. వ్యక్తిగత స్వేచ్ఛ అన్నికోణాల్లో వారిని ఉత్సాహ పరుస్తోంది. అవరోధాలు లేని విద్యావిధానం కోసం ప్రయత్నం సాగిస్తున్నారు. పర్యవేక్షణ లేకుండా, వినోదాత్మకం గా నేర్వటం అభిలషిస్తున్నారు. ప్రయోగాత్మక దృష్టితో

అన్ని అంశాలనీ క్షుణ్ణంగా చూస్తున్నారు. ఈ వినూత్న విద్యా వ్యవసాయం లో తల్లి దండ్రులు, గురువులు, సాటి సమాజం, గతం, చరిత్ర, మానవీయ విలువలు, సౌభ్రాతృత్వ భావన, వంటి తాత్త్విక విషయాలు మరుగునపడుతున్నాయి .

మార్పుని అంగీకరించటం, ఆహ్వానించటం, గౌరవించటం మానవ ధర్మం. యువతరం ఆశించేది ఇదే. విలువలు, ప్రమాణాలు, సమగ్ర సంపూర్ణ వ్యక్తిత్వ లక్షణాలు పాఠ్యాంశాలు కావాలి. సాంకేతిక పరిజ్ఞానంతోపాటు ఆధ్యాత్మికత, పరమార్థికత, కళాత్మకత, తాత్త్వికత, ప్రణాళికలో చోటుచేసుకోవాలి. తరగతులవారీగా పెరగాలి. పూర్వానికీ ఇప్పటికీ ఒకటే తేడా ! పరికరం మారింది. అంటే మాధ్యమం మారింది. శాస్త్ర రంగంలో, కళా రంగంలో, క్రీడా రంగంలో, విద్యారంగంలో, ఈ నాటి యువత నేరుస్తున్న వేగం తీవ్రత అందరినీ ఆశ్చర్య చకితులని చెయ్యటం అందరకు తెలిసినదే. వారికి వారుగా కల్పించుకుంటున్నారు. ముందు తరాలవారు యువత నిర్ణయాలని గౌరవిస్తూ, చేదోడువాదోడుగా ఉంటూ పరోక్షంగా మానవీయ విలువలు నేర్పవలసిన అవసరం ఈ నాటి ప్రజాళికి, ప్రభుత్వానికి, విద్యావేత్తలకీ అత్యావశ్యక కర్తవ్యం. మానవత్వపు విలువల చర్చలకు సభలు జరగాలి. సమావేశాలు నడపాలి. విద్యావంతుల ఆలోచనలని గ్రంథస్థం చేసి ప్రజకి అందించాలి. ప్రస్తుత తరాలని అపరిమితం గా ప్రభావితం చేస్తున్న చలచిత్రాలు , You Tube , Whatsapp వంటి మాధ్యమాలని సంఘ ప్రయోజనాలకు ఉపయోగించే విధానాలని తెలుసుకొని, విద్యావిధానాలలో ప్రవేశపెట్టాలి. పాఠాలకి వినోదాలకీ మాత్రమేకాక విలువలని అందించటానికి, శాంతియుత ప్రగతి సాధించటానికి కూడా ఈ మాధ్యమాలని వాడుకోవాలి.

> మార్పుని అంగీకరించటం, ఆహ్వానించటం, గౌరవించటం మానవ ధర్మం. యువతరం ఆశించేది ఇదే. విలువలు, ప్రమాణాలు, సమగ్ర సంపూర్ణ వ్యక్తిత్వ లక్షణాలు పాఠ్యాంశాలు కావాలి.

ఆనాడే మానవ జాతికి మహోదయం. " తన శాంతమాత్మలో తగిలినప్పుడు కదా తనకైన తన చదువు ఫలియించుట " అన్న అన్నమయ్య వాక్కు సార్థకమయ్యేది .!!

# అంటువ్యాధులు, ఆయుర్వేదం



- డా. భాస్కర్ రావు B.A.M.S, M.D, Ph.D,
GURU, Ministry of Ayush, Govt. Of India,
98491 47330

వాస్తవానికి ఆరోగ్యం అనేది మనను ప్రభావితం చేసే వరకు ఒక సమస్యగా కనపడదు. అలాంటి ఆనారోగ్యం సమస్యలు మానవ శరీరానికి ఆహారం వల్లనైతేనేమి వ్యాయామం చేయక పోవడం, బాధ్యతలు ఒత్తిడిలు, మానసిక ఒత్తిడులు మొదలగు వాటి వల్లనైతేనేమి వస్తాయి. ప్రస్తుత వాతావరణంలో ప్రపంచ వ్యాప్తంగా అనారోగ్య సమస్యలు మరియు అంటు వ్యాధులు ప్రధాన భూమిక పోషిస్తున్నాయి. ఆయుర్వేద శాస్త్రములో కూడా కొన్ని వేల సంవత్సరాల క్రితమే ఈ అంటువ్యాధులకు (Communicable Disease), సంబంధించిన వివరణ, వాటి కారణాలు అవి సమాజంలో ఎలా వ్యాప్తి చెందుతుంది మరియు వాటి యొక్క చికిత్స పద్ధతులు చెప్పబడ్డాయి. ఆచార్య చరకుడు (1000 BC) ఈ అంటు వ్యాధులను జనపదోద్వంసముగా చెప్పారు. జనపదోద్వంసం అనగా ఈ అంటు వ్యాధుల ప్రభావం చేత ఊర్లకు ఊర్లు సమూలంగా ఈ వ్యాధి ప్రబలి వందలాది గ్రామాలలో లక్షలాది మంది ప్రజలకి ఒకేసారి వ్యాప్తి చెందగల బలీయమైన అంశంగా వారు ఆనాడే గుర్తించడం జరిగింది. సుశృతులవారు (800 BC) ఈ అంటు వ్యాధులని ఔపసర్గిక వ్యాధులని చెప్పడం జరిగింది. వాటిలో ముఖ్యంగా విష జ్వరాలు (Viral Fever), కుష్టు వ్యాధులు (Contagious skin diseases), మరియు శ్వాస (Viral bronchitis) లాంటి వ్యాధులను కూడా చేర్చడం జరిగింది. చరక ఆచార్యులు మరియు సుశృత ఆచార్యులు ఇరువురు కూడా వాయు కాలుష్యం జల కాలుష్యం మరియు కాలంతో పాటు జరిగే విపరీతమైన మార్పులు మరియు భూగోళిక ఉపద్రవాలు ప్రధాన భూమిక పోషిస్తాయి అని చెప్పడం జరిగింది.

ప్రస్తుత కాలంలో కనబడే H1N1 - FLU ఎబొల వైరస్, SARS వ్యాధులు మరియు మెర్స్ (Middle east respiratory syndrome) వ్యాధులు ప్రస్తుతం ప్రపంచంలో అంతటా వ్యాపించిన Covid - 19 వ్యాధులు ఈ కోవలోకి వస్తాయని చెప్పడంలో ఆశ్చర్యం లేదు. ఈ విషయాలు అన్నీ కూడా చరక సంహిత విమాన స్థానంలోని మూడవ అధ్యాయంలో మరియు సుశ్రుత సంహితలోని కుష్టు వ్యాధి నిదానం అధ్యాయములో వివరింపబడి ఉన్నాయి. జనపదోద్వంసము వ్యాధులు ముఖ్యంగా ఎదుట వారియొక్క ఉఛ్వాస నిఛ్వాసల కారణంగా, కలిసి భోజనం చెయ్యడం వలన కలిసి ఒకే ఇంటిలో నివసించడం వల్ల, ఒకరి వస్త్రాలను ఒకరు మార్చడం ద్వారా ఈ అంటు వ్యాధులు వ్యాప్తి చెందుతాయి. సాధారణంగా ఈ వ్యాధులు గాలి, నీరు, దేశంలోని మార్పులు, కాలంలోని మార్పులు వల్లనే గాక మనయొక్క ధర్మాది ప్రవర్తనలు (Ethical Behaviour) హద్దులు మీరడం చేత సత్ప్రవర్తన లేకపోవడం చేత ఈ వ్యాధులు వ్యాప్తి అయ్యే అవకాశం ఉందని చెప్పడం జరిగింది. నిజానికి Air borne droplet ఇన్ఫెక్షన్ ద్వారా చాలా వరకు అంటు వ్యాధులు ప్రబలుతున్నట్లుగా శాస్త్రీయ పరిశోధనలు తెలియజేస్తున్నాయి.

చికిత్స ఉపాయాలు : (Treatment Measures)

ఇందు ప్రధానంగా దినచర్య (Daily Regimen) రుతుచర్య (Seasonal Regimen) వేగ విధారణ (Suppression of Natural urges) మరియు ప్రజ్ఞాపరాధము (మనము తెలిసి చేసే వివిధ పాపకర్మలు) ఈ వ్యాధులు ప్రబలడానికి ప్రధానకారణం అయి ఉన్నాయి. ఆయుర్వేదం ఈ అంటు వ్యాధులను ప్రబలకుండా చెయ్యడానికి మూడు రకాల చికిత్స పద్ధతులు చెప్పడం జరిగింది.

(1) నిధాన పరివర్జనము (Preventive Measures)

(2) చికిత్సా ఉపాయములు (Curative measures)

(3) ఆరోగ్య సంరక్షణ (Promotive health measures)

ఇందులో.....

(1) నిధాన పరివర్జనము (Preventive Measures): ఇందులో నిద్ర, ఆహారం మరియు బ్రహ్మచర్యం ముఖ్యమైనవిగా ఉన్నాయి. సరియైన మోతాదులో 6 - 8 గంటల వరకు ప్రతి రోజు నిద్రించడం.

(2) ఆహారం తగు రీతిలో సమయాను భాగంగా సమతుల్య ఆహారం ఏ రోజుకా రోజు చేసుకుని వేడిగా ఉండేటట్లు తీసుకోవడం మంచిది. వండిన ఆహారాన్ని వారాల తరబడి ఫ్రిజ్‌లలో దాచుకోవడం తిరిగి వేడిచేసుకోవడం చేత ఆహారం తన రుచిని, శుచిని మరియు పోషకాంశములు కోల్పోవడమే కాకుండా తిరిగి

వేడిచేయడం ద్వారా Free Radical ఉత్పత్తి జరిగి వివిధ రకాలైనటువంటి పెద్ద పేగు సంబంధించిన వ్యాధులు కలగజేయడమే కాకుండా కాన్సర్ వ్యాధికి మూల కారణం అవుతుంది అనేది ఇటీవల జరిపిన పరిశోధనలలో నిర్ధారించబడింది.

అంతేకాకుండా మలమూత్రాలకు సంబంధించిన వేగాలను ఆపకుండా ఉండటం మంచిది. ఈ ఆధునిక కాలంలో పని ఒత్తిడిచేత, మల మూత్రాది వేగాలను ఆపడం (Hold) గంటలతరబడి Supress (ఆపడం) జరుగుతున్నది. దీని ద్వారా శరీరంలో న్యూరో ఎండ్రోకైనల్ వ్యవస్థలో వివిధ రకములైన రసాయన మార్పులు జరిగి క్యాన్సర్ లాంటి వ్యాధి బారిన పడే అవకాశాలున్నాయని శాస్త్రీయంగా నిర్ధారించబడినవి.

(2). చికిత్సా ఉపాయములు (Curative measures):

చికిత్సాపద్ధతులలో పంచకర్మలను (Bio purification) నిత్యం ఆచరించడం ద్వారాను ఆయా వ్యాధి లక్షణాలకు అనుగుణంగా తినదగు అశ్వగంధ, గుడూచి, మహాలక్ష్మి విలాస్ రస్, అమృతప్రాస, చవనప్రశ మరియు శాలాజిత్తు రసాయనం లాంటి దివ్య ఔషదాలు ఆయుర్వేద వైద్యుల అమ్ములపొదిలో సమృద్ధిగా ఉన్నాయి.

(3) రసాయన విధి (Promotive Health)

ఆరోగ్యాన్ని కాపాడటంలో వ్యాధుల బారిన పడకుండా రసాయన విధి చాలా ఉత్తమమైనవి. ఇందులో త్రిఫలరసాయనం అశ్వగంధ రసాయనం శిలాజిత్ రసాయనం, వాజీకరణ రసాయనం ముఖ్య భూమిక పోషిస్తున్నాయి.

ఈ విధివిధానాలను శాస్త్రీయంగా ఆయుర్వేదం వైద్యుల పర్యవేక్షణలో పాటించడం ద్వారా అంటు వ్యాధులు అనబడే వ్యాధులు రాకుండా కరోనా వైరస్ వ్యాధి బారిన పడకుండా ఒకవేళ పడినా తొందరగా ఈ వ్యాధి నుండి తొందరగా బయట పడతారనటంలో సందేహం లేదు.

ఆయుర్వేదం యొక్క ముఖ్య ఉద్దేశ్యం ఆరోగ్యవంతుని యొక్క ఆరోగ్యం కాపాటడంతో పాటుగా వ్యాధిబారిన పడినా కూడా ఆయుర్వేదం చెప్పబడిన సత్‌వృత్త పాలన (Body of right conduct), ఆచార్యరసాయనం, (Behaviour therapy) మరియు ఔషధ చికిత్స (Medical Management) అనే విధి విధానాలు ప్రధాన భూమిక పోషిస్తాయి.

తద్వారా ఆరోగ్యాన్ని కాపాడుకోవడంతో పాటుగా "కరోనా" లాంటి మహమ్మారి అంటు వ్యాధులను కూడా తట్టుకొని నిలబడగల శక్తిని ఆయుర్వేదం ప్రసాదిస్తుందనడంలో సందేహం లేదు.

